# పద్మాకరప్రభ

CONTAINING
EXHAUSTIVE NOTES, QUESTIONS & ANSWERS
AND GRAMMATICAL PECULIARITIES, ETC.

ON

## పద్మాకరము

(Detailed Telugu Text)

**FOR CLASS X**

BY
M. SURYANARAYANA MURTY, M.A.
*Telugu Dept., W. G. B. College*
*BHIMAVARAM*

PUBLISHERS:
**RAJASRI PUBLICATIONS**
TENALI

 1960 [ *Price: Rs.* 1-50

# గురుదక్షిణ

## I. అర్థాదులు

1. చాపకృష్ట = [illegible] వెడలిన వర్షమునకు; కుమార = కుమారస్వామి యొక్క; శర = బాణముల చేత; నిహత = కొట్టఁబడిన; సురారికుమారులు = రాక్షస కుమారులు; సంరంభంబున = వేగిరపాటుతో; సేనాగ్రచరుండు = సేనకుముందు నడచువాఁడు

2. తా:- భీముఁడు ఏనుగుల సమూహమును ఎదుర్కొని మిక్కిలి కఠినమైన వజ్రాయుధముయొక్క పాటువలెఁ దీవ్రమైన గదయొక్క దెబ్బలచేత కపోల ప్రదేశములను గుండ్రని కుంభస్థలములను తుండాగ్రములను శిథిలమైన వానినిగా నొనర్చెను.

3. ప్రతిపదార్థము :- అన్య = శత్రువులయొక్క; వాహినీ = సేన యందలి; వారణ = ఏనుగులయొక్క; సంచయంబు = సమూహము; వృకోదర = భీమునియొక్క; గదా, కులిశ, ఆహతిన్ = గదయనెడు వజ్రాయుధముయొక్క దెబ్బచేత; అభినవ = క్రొత్తవైన; క్షత = గాయములయొక్క; శోణిత, ధారలు = రక్తధారలు; ఒప్ప = ప్రకాశించుచుండఁగా; సంచారిత = సంచరింపఁజేయఁబడిన; ధాతు = గైరికాది ధాతువులతోఁ గూడిన; నిర్ఝర = సెలయేళ్ళచే; విశాల = విశాలములైన; శిలోచ్చయ = పర్వతములయొక్క; సంచయ = ప్రోగుయొక్క; అభను+వి = కాంతివంటి కాంతి గలదై (సమానమై); దారుణమై = భయంకరమై; విక్షత = మిక్కిలి కొట్టఁబడిన; [illegible]; వృక్షపంక్తితో = వృక్షములయొక్క సముదాయములతో; వీరరణంబునం బడియె = వీరరసములతోఁ గూడిన యుద్ధమునందుఁ బడెను.

4. అధికుండు = ఘనుఁడైన; అనిలజాఁడు = భీముఁడు; ఉగ్రుఁడై = క్రోధము గలవాఁడై; సమరంబునన్ = యుద్ధమునందు; ద్రుపదు = ద్రుపదుని; హస్తి+ఘటా+ఆవలిన్ = ఏనుఁగుల సమూహముల వరుసలను; అశ్వసంహతిన్ = గుఱ్ఱముల సముదాయమును; ఘనరథకోటి = గొప్ప రథముల సమూహమును; భగ్నములుగాన్, చేసి = శిథిలములుగా నొనర్చి; పేదదుర్మనుజాలన్ = బలహీనులైన దుష్టమనుష్యులను; చంపన్, ఏల, అని; నూనుగ = ఒప్పుగ; గోపుఁడు = ఆలకాపరి; గోగణంబులన్ = ఆవుల సమూహములను; గొనికొని = ప్రయత్నించి; రొప్పునట్లు = తఱుమునట్లు; పృథుదండ హస్తుఁడై = పెద్ద కఱ్ఱ చేతఁగలవాఁడై; ఎగచెన్ = తఱిమెను.

5. అంతన్=అప్పుడు; అతి+ఆయత+భుజుఁడు=మిక్కిలి దీర్ఘములైన బాహువులుగల; కౌంతేయుఁడు=కుంతీకుమారుఁడైన; నరుఁడు=అర్జునుఁడు; అల్గి=కోపించి; పాంచాలు=ద్రుపదుని; దంతిధ్వాంతంబున్=ఏనుగులనెడి చీఁకటిని; వాని=ఆతని; వాహ+ఉత్తమ+తుహిన+తతిన్ = శ్రేష్ఠములైన గుఱ్ఱములనెడి మంచు సముదాయమును; తత్=వాని; భట=భటులనెడి, ఉదార=శ్రేష్ఠములైన; తారా=నక్షత్రములయొక్క; సంతానంబున్=సమూహమును; శర=బాణములనెడి; అంశు=కిరణముల; ఉచ్చయ=సమూహముయొక్క; విభవములన్=వైభవములచే; శాంతిన్, పొందించి=శాంతింపఁజేసి; తత్ రణ=ఆ యుద్ధమనెడి; వ్యోమ=ఆకాశముయొక్క; వీథిన్=వీథియందు; ఉద్యత్+ధ్వాంత+అరాతి+ప్రభుండు+ఐ = ఉద్యత్ = ఉదయించుచున్న; ధ్వాంత=చీఁకటికి; అరాతి=శత్రువైన సూర్యునియొక్క (కాంతి వంటి) ప్రభుండు + ఐ = కాంతికలవాఁడై; తనరుచు = ఒప్పుచు; వెలిఁగెన్=ప్రకాశించెను.

6. తా.- ఆ యర్జునునిఁ జూచి ఓర్వక శౌర్యముగల సత్యజిత్తుఁడను ద్రుపదుని సోదరుఁడు గొప్ప విల్లు కలవాఁడై అర్జునుని వేగముగ నెదుర్కొనెను.

7. తా:- ద్రుపదుని సోదరుఁడు ప్రయత్నించి వేగముగ నర్జునుని నూఱు పదునైన బాణములతోఁ గొట్టెను. అర్జునుఁడు మిక్కిలి కోపించి వాని నన్నింటిని నడుమనె బాణములతో విఱుగునట్లు కొట్టెను.

8. తా:- ఆ సత్యజిత్తుఁడు భీకరయుద్ధమునకు సత్త్వము లేనివాఁడై ధైర్యము చెడి పాఱిపోవునట్లుగా, వాని రథమును గుఱ్ఱమును సారథిని కుప్పలు వడునట్లుగా ననేకాస్త్రములను దెలిసిన యర్జునుఁడు కొట్టెను.

10. అకాండ=అసమయమందు; ఉద్ధుర=విజృంభించిన; దండధరుఁడ పోలెను = యముఁడువలె; అతి + ఉద్ధతుఁడై = మిక్కిలి గర్వము కలవాఁడై; ద్రుపదుఁడు; శర=బాణముల; మోక్షణ = విడుచుటయందలి; వేగ = వేగముచే; నిరంతర=ఎడతెరపిలేకుండ; మండలిత=గుండ్రముగాఁ జేయఁబడిన; ఉరు=గొప్పదైన; చాపదండున్=ధనుర్దండముగల; హరి నందనున్=అర్జునుని (ఇంద్రకుమారుని) తాఁకెను=ఎదురుకొనెను,

11. గురు = గొప్ప; అస్త్ర+ఏక విశారదుల్ = బాణవిద్యయందు ముఖ్యముగా పండితులైనట్టియు; బల, యుతుల్ = బలముతోఁ గూడినట్టియు; పాంచాల కౌంతేయులు = ద్రుపదుఁడు పాండవులును; ఒండొరులన్ = ఒకరొకరిని; మార్కొని = ఎదిరించి; ఏయుచున్నప్పుడు = [illegible], బాణములు ప్రయోగించు నపుడు; తదీయ = వారిసంబంధమైన; ఉగ్ర రణాంగణంబు = భయంకరమైన యుద్ధరంగము; దుస్తర = తరింపరాని; [illegible] = [illegible]; నిశాత = వాఁడియైన; సాయక = బాణము లనెడి; తమః = చీకటిచేత; సంఛన్నము+ఐనన్ = కప్పఁబడఁగా; అచ్చటన్ = ఆ యుద్ధరంగమునందు; యోధులు = వీరులు, యుద్ధము చేయువారు; పరస్పర యుద్ధంబులు, తక్కి = అన్యోన్య యుద్ధములు మాని; దిశా+భ్రాంత+ఆత్ముల్+ఐరి = దిక్కుల విషయమున భ్రాంతిపొందిన మనస్సు కలవారైరి (దిగ్భ్రాంతి నొందిరి.)

12. ధనుః+మధ్యము = ధనుర్మధ్యము; ఉద్యత = పైకెత్తఁబడిన; అసి పాణుండు = కత్తి చేతియందుఁ గలవాఁడై.

తా. అర్జునుఁడు కార్యమునందు సమర్థుఁడై మిక్కిలి క్షీణించిన గర్వముగల ద్రుపదుని రథముయొక్క ఇరుసునకుఁ గట్టి తెచ్చి గురువునకు (ద్రోణునకు) గురుదక్షిణగా నిచ్చి యాయనకు సంతోషమును గూర్చెను.

15. తా. నీ వెవరయ్యా! ద్రుపదమహారాజుగారా! దీనులై వీరిట్లు పట్టువడవలసి వచ్చెనా! ఇపుడు గొప్పరాజ్యము వలనఁ గలిగిన గర్వమనెడి చీకటి తొలఁగెనా?

16. తా. ఇప్పుడైన మమ్మెఱుఁగఁ గలిగితివా? అనుచు ద్రోణుఁడు ద్రుపదుని పరిహాసించి విడిచి పుచ్చెను. బ్రాహ్మణుల కోపమును, గడ్డిమంటయును దీర్ఘకాల ముండవు గదా.

## II. ప్రశ్నోత్తరములు

ప్ర. 1 : గురుదక్షిణయను పాఠ్యభాగ మే గ్రంథము లోనిది? కవి కాలమును, ఆతని ఇతర గ్రంథములను పేర్కొనుడు.

జ. : ఈ పాఠ్యభాగ మాంధ్ర మహాభారతము ఆదిపర్వమునందలి యాఱవ యాశ్వాసము లోనిది. కవియైన నన్నయభట్టు

క్రీ. శ. 1022 మొదలు 1063 వఱకు రాజమహేంద్రవరమును పాలించిన రాజరాజనరేంద్రుని యాస్థానమునం దుండెను. ఈయన భారతమున ఆదిసభాపర్వములను, అరణ్యపర్వమున మూఁడాశ్వాసములపై 142 పద్యములను రచించెను. ఆంధ్ర శబ్దచింతామణి అను వ్యాకరణమునుకూడ, నీతఁడు రచించె నందురు.

ప్ర.2: నన్నయభట్టు బిరుదములేవి ? ఆయన కవిత్వ మెట్లుండును ?

జ : నన్నయభట్టునకు ఆదికవియనియు, వాగనుశాసనుఁ డనియు బిరుదములు గలవు. వీరి కవిత్వమునందు లలితములు మనోహరములునగు సంస్కృతపదము లధికముగా నుండును. ప్రసన్నకథాకవితార్థయుక్తియు, అక్షరరమ్యతయు, నానా రుచిరార్థసూక్తినిధిత్వమును నీయన కవిత్వమునందలి ప్రధాన గుణములు. ఈయన కథ చెప్పుటయందు చాల నేర్పరి. ఈ కథలన్నియు రమణీయములు నీతిబోధకములు.

ప్ర. 3 : ప్రస్తుత పాఠ్యభాగమునకు ఆధారమైన మూలకథను తెలుపుఁడు :

జ. : ద్రోణుఁడు, ద్రుపదుఁడు చిన్ననాఁడు భరద్వాజాశ్రమమున సహాధ్యయన మొనర్చినవారు. విద్యాభ్యాసానంతరము ద్రుపదుఁడు పాంచాలాధిపతి యయ్యెను. ద్రోణుఁడు కురుకుమారులకు గురుత్వము వహించుటకుఁ బూర్వము దారిద్ర్యపీడితుఁడై చిన్ననాఁటి స్నేహితుఁడగుటచే ద్రుపదుఁ డేమైన సహాయ మొనర్చునని తలఁచి యాతనికడకేగెను. రాజ్యమదమున ద్రుపదుఁడు ద్రోణుని గుర్తింపలేదు. పైఁగా నగౌరవపఱచెను. అది మనమున నిడుకొని ద్రోణుఁడిప్పుడు తన శిష్యులచే ద్రుపదునిఁ బరాభవింపఁజేసి కక్ష తీర్చికొనెను.

ప్ర. 4 : యుద్ధమున భీమార్జునుల వీరవిహారమును వివరింపుఁడు.

జ. : (i) ద్రుపదార్జునుల యుద్ధమునందు భీముఁడు సైన్యమునకు ముందు భాగమున నడచుచు నేనుఁగుల సమూహములను

తన గదాఘాతములచే నొప్పించుచుండ నవి మావటీండ్రతోఁ గూడ పర్వతములవలె నేలఁగూలుచుండెను. అతఁ డేనుఁగులను గుఱ్ఱములను రథములను భగ్న మొనర్చి సామాన్య సైనికులను జంపనేల యని తలఁచి వారిని తఱిమివైచెను. అపు డర్జునుఁడు ద్రుపదుని యేన్గులను గుఱ్ఱములను భటులను తన శరపరంపరలచేఁ గూల్చుచుండ, సత్యజిత్తుఁడను ద్రుపదుని సోదరుఁ డాతఁని దాఁకెను. అతఁ డనేక బాణములను గురియింప నర్జునుఁడు వానిని నడుమనే తునియలుగా నొనర్చెను. అర్జునుఁ డాతని రథమును గుఱ్ఱమును సారథిని నేలఁగూల్ప నాతఁడు యుద్ధవిముఖుఁడై పాఱిపోయెను.

(ii) అపుడు యమునివలె భయంకరుఁడై ద్రుపదుఁడువచ్చి యర్జునుఁ దాఁకెను. మహావీరులైన వారిద్దరి రణమునుజూచి తక్కిన భటులు యుద్ధముమాని విభ్రాంతులై చూచుచుండిరి. ద్రుపదుఁ డొక్క బాణంబున నర్జునుని వింటిని విఱుగఁగొట్టఁగా నర్జునుఁ డొక ఖడ్గమునుగొని ద్రుపదు రథముమీఁదికి దుమికి యాతని నా రథమునొక్క యిరుసునకు గట్టితెచ్చి తన గురుఁడైన ద్రోణాచార్యునకు గురుదక్షిణగా నొసఁగెను.

ప్ర. 5: ద్రుపదార్జునుల ద్వంద్వయుద్ధమును తత్ఫలమును దెలుపుఁడు.

జ: పై ప్రశ్నలోని రెండవ పేరాను చూడుము.

ప్ర. 6: రథమునకుఁ గట్టి తేఁబడిన ద్రుపదునిఁజూచి ద్రోణుఁ డేమని పల్కెను?

జ: కట్టి తేఁబడిన ద్రుపదునిఁజూచి ద్రోణుఁడు పరిహాస పూర్వకముగా "ఓహో! వీ రెవరు? ద్రుపదమహారాజులా! అట్టి మహారాజులు దీనులై యిపుఁ డిట్లు పట్టువడవలసి వచ్చినదే! ఇపుడు రాజ్యగర్వము పోయినదా? ఇఁక నేని మేమెవ్వరమో తెలిసివచ్చినదా?" అనెను. పిమ్మట నాతనిని విడిచిపుచ్చెను.

ప్ర. 7: ఈ పాఠ్యభాగము వలన నేర్వదగిన నీతియేమి?

జ: ద్రోణ ద్రుపదులు బాల్యస్నేహితులు. తండ్రి పిదప ద్రుపదుఁడు మహారాజై యైశ్వర్యమత్తుఁడై యుండెను. ఒకప్పుడు

ద్రోణుఁడాతని సాహాయ్యమునుగోరి పోఁగా ద్రుపదుఁడు పూర్వస్నేహమును విస్మరించుటే కాక నీకు నాకు నెక్కడి స్నేహము పొమ్మని యవమానముగాఁ బలికెను. అవమానితుఁడైన ద్రోణుని సంతోషపెట్టుటకు అర్జునుఁడు యుద్ధమున ద్రుపదునోడించి కట్టి తెచ్చి గురువునకు దక్షిణగా నొసఁగెను. ద్రోణుఁ డాతని మాటలచే బరిహసించి విడిచిపుచ్చెను. ఈ పాఠ్యభాగమువలన నైశ్వర్యమత్తత కూడదని తెలియుచున్నది.

ప్ర. 8 : క్రింది వాని కర్థ సందర్భములను వివరింపుఁడు.

1. మహారాజ్య మదాంధకారమది వాసెనో కో ?
2. విప్రుల యలుకయుఁ దృణహుతాశనంబు దీర్ఘము గునె ?

జ : 1. ఈ వాక్యము గురుదక్షిణయను పాఠ్యమున ద్రోణుఁడు ద్రుపదుని పరిహసించుచు నాడిన వాక్యములలోనిది.

ద్రుపదుఁడు రాజ్యమదమున మున్ను తనకొసగ్గిన యవమానమును మనమున నిడుకొనియున్న ద్రోణుఁడు ద్రుపదుని పై కర్జునుని పంపెను. అర్జునుఁడాతని నోడించి కట్టి తెచ్చి గురువునకు దక్షిణగా నొసఁగెను. అడుపు ద్రోణుఁడు ద్రుపదునిఁ జూచి నవ్వుచు మీరు ద్రుపదమహారాజుగారా ? ఇట్లు దీనులై పట్టువడిరేమి ? ఇపుడా రాజ్య మదాంధకారము తొలఁగినదా ? ఇప్పుడైన మేమెవ్వరమో తెలిసినదా ? అని యెల్లసమాడెను.

జ : 2. ఈ వాక్యము గురుదక్షిణయను పాఠ్యభాగమున ద్రోణుఁడు చేతికిఁజిక్కిన ద్రుపదుని విడిచిపుచ్చెనని చెప్పుసందర్భమున కవి చెప్పినది.

ద్రోణుఁడు అర్జునునిచేఁ గట్టి తేఁబడిన ద్రుపదుని నుల్లసమాడి అంతమాత్రమవమానము చాలునని తలఁచి, యాతనిని విడిచి పుచ్చెను. తనకు జరిగిన యవమాన మెంతటిదైనను ద్రోణుఁడు దీర్ఘక్రోధము వహింపలేదు. దానికిఁ గారణ మాతఁడు బ్రాహ్మణుఁ డగుటయే. గడ్డికంటిన యగ్నివలె

బ్రాహ్మణునకు జనించిన కోపముకూడ కొలఁది కాలము మాత్రమే యుండునని దీని భావము.

## III. వ్యాకరణ విశేషములు

ప్ర. 9 : క్రిందివానికి విగ్రహవాక్యములు వ్రాసి యవి యే సమాసములో పేర్కొనుఁడు.

1. బాణవృష్టి : బాణము అనెడి వర్షము : రూపక సమాసము
2. ఆచార్యధర్మజులు: ఆచార్యుఁడును, ధర్మజుఁడును: ద్వంద్వసమాసము
3. ద్రుపదరాజవాహినీసముద్రంబు: ద్రుపదరాజుయొక్క సేనయనెడి సముద్రము : షష్ఠీతత్పురుషము; రూపకసమాసము
4. అశ్వసంహతి : గుఱ్ఱములయొక్క సమూహము : షష్ఠీతత్పురుషము
5. దండహస్తుఁడు : దండమును హస్తమందు గలవాఁడు : బహువ్రీహి
6. దంతిధ్వాంతము : ఏనుఁగు అనెడి చీఁకటి : రూపకము
7. వాఁడిశరంబుల్ : వాడియైన బాణములు : విశేషణ పూర్వపదకర్మధారయము
8. ఉగ్రాహవము : భయంకరమైన యుద్ధము : ,,
9. మహార్ణవము : గొప్పదైన సముద్రము : ,,
10. క్రియాదక్షుఁడు : క్రియయందు సమర్థుఁడు : సప్తమీతత్పురుషము
11. గురుదక్షిణ : గురువుకొఱకైన దక్షిణ : చతుర్థీతత్పురుషము
12. ప్రీతహృదయుఁడు: ప్రీతినొందిన హృదయముగలవాఁడు: బహువ్రీహి
13. తృణహుతాశనము : గడ్డియందలి నిప్పు : సప్తమీ తత్పురుషము
14. వాహోత్తమము: ఉత్తమమైనగుఱ్ఱము: విశేషణోత్తరపదకర్మధారయము

ప్ర. 10 : క్రిందివానిలోని వ్యాకరణ విశేషములను వివరింపుఁడు :

1. సుర + అరి = సురారి = సవర్ణదీర్ఘసంధి
2. అతి + ఉద్ధతి = అత్యుద్ధతి = యణాదేశసంధి
3. అస్త్ర + ఏకవిశారదులు = అస్త్రైక విశారదులు = వృద్ధిసంధి
4. ద్రుపదు + అనుజుఁడు = ద్రుపదుననుజుఁడు : షష్ఠీసమాసమునం 'ఉ' కార 'ఋ' కారముల కచ్చు పరమగునపుడు నుగాగమ మగును.
5. నెఱ + వడి = నెవ్వడి : అన్యంబులకు సహిత మిక్కార్యంబులు కొండొకచోఁ గానంబడియెడి. (ఈ కార్యమున తొలియచ్చు మీఁది వర్ణములకు లోపమును మీఁది హల్లునకు ద్విత్వమును)
6. పట్టు+పడన్=పట్టువడన్ : ప్రథమముమీఁది పరుషములకు గసడదవలు బహుళముగా నగు.
7. చంపనేలయని : సంధిలేనిచోట స్వరంబుకంటె బరంబయిన స్వరంబునకు యడాగమం బగు.

ప్ర. 11: క్రింది ప్రకృతులకు వికృతులు, వికృతులకుఁ బ్రకృతులు వ్రాయుఁడు.

| ప్ర | వి | ప్ర | వి |
|---|---|---|---|
| కుమారుఁడు | కొమరుఁడు; | ముఖము | మొగము |
| | కొమారుఁడు | రథము | అరదము |
| సింహము | సింగము; | పంక్తి | బంతి |
| సముద్రము | సంద్రము; | బీభత్సుఁడు | విభ్వచ్ఛుఁడు |
| దిశ | దెస | | |

ప్ర. 12: క్రింది వానికి నానార్థములు వ్రాయుఁడు :

కుమారుఁడు :- (1) దేవతల సేనానాయకుఁడైన కుమారస్వామి,
(2) తనయుఁడు

బింబము :- (1) ప్రతిబింబము (2) దొండపండు.

వాహిని :- (1) సేన (2) నది.

కరము :- (1) చేయి (2) ఏనుఁగు తొండము (3) మిక్కిలి. (దేశ్య)

కోటి :- (1) నూఱులక్షలు (2) సమూహము (3) వింటికొప్పు.

శరము :- (1) బాణము (2) నీరు (3) తెల్లగడ్డి.

హరి:- (1) విష్ణువు (2) ఇంద్రుడు (3) సింహము (4) గుఱ్ఱము (5) కప్ప

ప్ర. 13: క్రింది వానికి వ్యుత్పత్త్యర్థములు వ్రాయుఁడు :

భీముఁడు :- భయంకరమైనవాఁడు.

కరి :- కరముకలది - ఏనుగు.

దంతి :- దంతములు కలది - ఏనుగు.

బీభత్సుఁడు :- జుగుప్సవలనఁ బుట్టిన వికారముగలవాఁడు; అర్జునుఁడు.

సవ్యసాచి :- బాణములు వేయునపుడు రెండుచేతులయందు సమమైన వడి
కలవాఁడు

హరినందనుఁడు :- ఇంద్రకుమారుఁడు - అర్జునుఁడు.

ప్ర. 14 : (a) క్రింది వాని యందలి యలంకారములను పేర్కొనుము.

1. ద్రుపదరాజ వాహినీ సముద్రంబు
2. దంతి ధ్వాంతము
3. వాహోత్తమ తుహిన తతి
4. భటోదార తారా సంతానము
5. శరాంశూచ్చయ విభవములు

} ఇవి యన్నియు రూపకాలంకారములు

లక్షణము : ఉపమానమునందు ఉపమేయ ధర్మమును హృదయ
రంజకముగా నారోపించిన రూపకాలంకార మగును.

(*b*) ఆకాండోద్ధుర దండ ధరుఁడ వోలెను హరి నందనుఁడాఁకె ద్రుపదుఁ డత్యుద్ధతుఁడై (ఇం దుపమాలంకార మున్నది.)
లక్షణము : ఉపమానోపమేయము లందు కవి సమయసిద్ధమైనసాదృశ్య ముండిన నుపమాలంకారము.

(*c*) ద్రుపదు విడిచిపుచ్చె గురుఁడు; విప్రుల యలుకయుఁ దృణహుతాశనంబు దీర్ఘ మగునె. (ఇందు అర్థాంతరన్యాసాలంకారము కలదు.)
లక్షణము : విశేషమును సామాన్యము చేత గాని, సామాన్యమును విశేషము చేతఁగాని సమర్థించిన అర్థాంతరన్యాసమగును.

ప్ర. 15 : క్రింది పాదమును గణవిభజన మొనర్చి ఏ పద్యభాగమో తెలుపుఁడు.

| UUU | UIU | UII | III | IIUU | IUU | IUU |
|---|---|---|---|---|---|---|
| ధ్వాంతారా | తిప్రభుం | డైత | నరుచు | వెలిఁగెంద్ర | ణవ్యో | మవీధిన్. |
| మ | ర | భ | న | య | య | య |

ఈ గణములుగల యీ పాదము స్రగ్ధరావృత్తపాదము. 8-15 అక్షరములు యతి స్థానములు.

# ౨. హితోపదేశము

## I. అర్థాదులు

1. సభాసదులు=సభయందుండువారు; మానము=గర్వము; మత్సరము=ఈర్ష్య

2. తా :- పాండవులపాలు భూమిని వారికిఁ బంచియిచ్చుట కంటె ఉచితమైనపని లేదు. ఓ వాక్యవిదులారా! అంతకంటె ధర్మము, మిక్కిలి తగినది శక్యమైనది ఏదియో చెప్పుడు!

3. తా :- వాసుదేవుఁడు మఱియు ఓ మహారాజా వినుమని తన మనస్సున భేదభావములేకుండ చేయఁదగిన కార్యముయొక్క స్థితి తెలియునట్లుగ నిట్లు పలికెను.

4. తా :- వారి తండ్రిపాలు పాండవులకిచ్చి నీ పాలిరాజ్యమును నీవు నీ పుత్త్రులు మనుమలు ననుభవించుచు సుఖింపుఁడు. ఇదియె సకల బంధువులు, మిత్రులు, సుజనులు మెచ్చుకొనెడు మార్గము.

5. తా :- ఓ రాజా! ధర్మరాజుయొక్క న్యాయవర్తనమును, ధర్మమును సత్యనిష్ఠయు నీ వెఱుఁగవా? ఆతఁడు మిమ్మెట్లు అనుసరించి నడచెనో ఎఱుఁగవా? ఆతని బలిమి కలిమి నెఱుఁగవా?

6. పెంపు = అభివృద్ధి; పేరు = కీర్తి

7. తా :- ఆ యుధిష్ఠిరుఁడు రాజుల సమూహముయొక్క గర్వము నడచి వారు నిన్నుఁ గొల్చునట్లు చేయుదునని పూనుకొని దిగ్విజయ మొనర్చి గొప్ప ఐశ్వర్యముతో నెమ్మది నుండఁగా, నీ కుమారులు మంత్రులు శకునిని జూదమాడించి వారి సంపద నపహరించిరి. అంతతోఁ బోవక సభలో ద్రౌపదిని అవమానించిరికదా!

8. తా :- అట్లు జరిగినదానికి నీవును సమ్మతించితివి. ధర్మరాజు సత్యమునే యనుసరించి, కన్నీరొత్తుకొనుచు, భీమార్జునులు నిర్వీర్యులవలె నుండగా, భయంకరారణ్యమున దుఃఖదైన్యములతో వసించి, శపథము నిర్వర్తించియు, సిపుడు కలసిమెలసి యుండఁ గోరుచున్నాఁడు.

9. తా :- సుజనత్వమునకు గనివంటి వాఁడా (ఓ ధృతరాష్ట్ర మహారాజా) అజాతశత్రున కతఁడేసాటి. ఆతని శాంతత, వినయమును, గౌరవము నేరాజులందుఁ గలవో చెప్పుము.

10. తా :- ఓ రాజా! నీ బిడ్డలైన యిరుపక్షములు వారికి మేలుగోరి యింతవఱకుఁ జెప్పితిని. నీ కుమారుని బుద్ధియందలి పిసినిగొట్టుతనమును మాన్పి పాండవులను జేరఁదీయుము.

11. భూవర=ఓ ధృతరాష్ట్రమహారాజా; వారలు=ఆ పాండవులు; శాంతశూరులు=శాంతులును, వీరులును; (వారు పరమ శాంతులు. అయినను, అవసరము కలిగినపుడు వీరత్వమును నెఱపఁగల సమర్థులు అనిభావము) భవత్=నీ; చరణంబులు=పాదములు; కొల్వన్, పూని, ఉన్నారు=కొలుచుటకు సిద్ధపడి యున్నారు; అటుఁగాక=అట్లుకాకుండ, అది; మీకు; మనంబునకున్; అప్రియము ఏని=ఇష్టములేనిదైనచో; ఇంతకున్=ఈపాటికి; పోరికి=యుద్ధమునకు; వచ్చుచుండుదురు; రెండుతెఱంగులందు=ఈ రెండు పద్ధతులందును; ఆరయన్=ఆలోచింపఁగా; నీకు, ఏది, పథ్యము+అగు=ఇష్టమగునో; అవ్విధము, ఏర్పడ=స్పష్టముగా; నిశ్చయింపుమా!

## II. ప్రశ్నోత్తరములు

ప్ర. 1 : హితోపదేశమను పాఠ్యభాగ మే గ్రంథములోనిది? కవికాలమును నివాసమును దెల్పుకొనుడు.

జ : హితోపదేశమను నీ పాఠ్యభాగము ఆంధ్రమహాభారతము నందలి యుద్యోగపర్వము తృతీయాశ్వాసములోనిది. దీనిని రచించిన వారు తిక్కనసోమయాజి. ఈయన క్రీ. శ. 1250–1300 ప్రాంతమున నెల్లూరు పాలకుఁడైన మనుమసిద్ధి యాస్థానమునఁ గవియు, మంత్రియునై యుండెను.

ప్ర. 2 : తిక్కన సోమయాజి బిరుదములేవి? ఆయన రచించిన గ్రంథములేవి? వాని నెవరికంకితము చేసెను? ఈయన కవితా గుణములేవి?

జ : తిక్కనసోమయాజికి ఉభయకవిమిత్రుఁడనియుఁ, గవిబ్రహ్మ యనియు బిరుదములు గలవు. ఈయన భారతమున విరాట పర్వము మొదలు పదునైదు పర్వములను సంపూర్ణముగా రచించి హరిహరనాథుని కంకితము చేసెను. ఈ గ్రంథమును రచించుటకు ముందే నిర్వచనోత్తరరామాయణమును రచించి తన ప్రభువైన మనుమసిద్ధి కంకితమొనర్చెను.

ఈయన కవిత్వమునందు సంస్కృత శబ్దములకంటె నచ్చ తెనుఁగుమాటలు చాల హెచ్చుగానుండును. ఎంత గొప్ప భావమునైన తేటతెల్లములైన చిన్నచిన్న మాటలతో రస వంతముగా రచింపఁగల మహాకవి యీయన.

ప్ర. 3 : "ఇత్తెఱంగు మీకు మేలు క్రోధ మాన మత్సరంబులు విడిచి యిట్లు సేయుండు." — ఈ మాటలెవ్వ రెవ్వరితో ననిరి? వారెట్లు చేయవలెను? అపుడు వారికిఁ గలుగు మేలెయ్యది?

జ : పాండవుల పక్షమున శ్రీకృష్ణుఁడు రాయబారియై వచ్చి కౌరవ సభలో ధృతరాష్ట్రాదులు వినుచుండఁగా నాడిన మాటలివి. కౌరవులు పాండవులదెస కోపమును, గర్వమును, ఈర్ష్యను మాని వారినిఁ గొనివచ్చి వారి తండ్రిపాలు వారి కొసఁగ వలెను. ఇది వారు చేయవలసినపని. అట్లుచేయుట వలన

నిరు తెఱఁగులవారికి లోకమునకుఁగూడ మేలు కలుగును. లేకున్న బాండవులు యుద్ధము చేయక మానరు. అది యెవరికిని క్షేమముగాదు.

ప్ర. 4 : “మహారాజా విను”మని కౌరవసభలో శ్రీకృష్ణుఁడు పలికిన పలుకులను మీ సొంతమాటలలో వ్రాయుఁడు.

జ : కౌరవసభలో ధృతరాష్ట్రుఁడు వినుచుండఁగా శ్రీకృష్ణుఁడిట్లు పలికెను. పాండవులకు వారి తండ్రిపాలైన రాజ్యమునిచ్చి వైచి మీపాటు మీరు గైకొని సుఖముండుఁడు. ఇదియె యెల్లరు మెచ్చు తెఱఁగు. ఆ ధర్మజుని న్యాయధర్మవర్తనము వెనుక నిన్ననుసరించిన తెఱఁగు నీ వెఱుఁగుదువు. అతఁడు దిగ్విజయమొనర్చి సకలభూపతులు నిన్ను గొల్చునట్లొనర్చి ఇంద్రప్రస్థమున సుఖముండఁగా నీ కొడుకులాతని సంపద నక్రమముగ వశమొనర్చికొనిరి. ద్రౌపదిని భంగపెట్టిరి. ఆయన్నింటికి నీవును సమ్మతించితివి. ధర్మజుఁడు సత్యమును దప్పక సమయము ప్రకారము దీనుఁడై యరణ్యముల నివసించి వచ్చి యిపుడుకూడ పొందునే కోరుచున్నాఁడు. నిజమునకు అజాతశత్రుని బోలఁగల రాజు లోకమున లేఁడు. శాంతి వినయ గౌరవములం దాతని కాతఁడే సాటి. పాండవులు శాంతమూర్తులు. అయినను మహావీరులు. వారు నీ పాదములను గొల్చుచు సుఖముండ దలఁచిరి. నీకది యిష్టముగానిచో వారు యుద్ధమునకు సన్నద్ధులయియే యున్నారు. ఈ రెండు పద్ధతులలో నీకేది యిష్టమో స్పష్టముగ నిర్ణయించి చెప్పుము.

ప్ర. 5 : ఈ పాఠ్యభాగమును బట్టి శ్రీకృష్ణుని వాక్చాతుర్యము నెన్నుఁడి.

జ : శ్రీకృష్ణుఁడు మంచి రాజనీతిజ్ఞుఁడు. కౌరవుల దుష్ప్రవర్తనకు రోసిన పాండవ పక్షపాతి. పాండవుల యెడల తన పక్షపాతమును దెలుపుడు చేయకుండ యుభయుల శ్రేయస్సును దాను గోరుచున్నట్లు మొదట స్పష్టమొనర్చెను. పిదప ధర్మరాజు న్యాయవర్తనము నుగ్గడించి కౌరవులొనర్చిన దుర్నయము

లను బేర్కొన్నాఁడు. చివరికి పాండవులు కేవల శాంత మూర్తులే కాదనుకొనుచూ, అవసరమగుచో యుద్ధమునకును సిద్ధపడి యున్నారని తెలిసినాఁడు. ఇఁక కర్తవ్యమును నీవే నిర్ణయించుకొనుమని చెప్పెను. ఈ వాక్యములలోఁ బాండవుల పాలు వారికీయనిచో వారు యుద్ధము చేయుట తథ్యమని స్పష్టముగాఁ జెప్పినట్లైనది. ఇట్లు తాను చెప్పవలసిన దానిని చెప్పుటలోఁ, చివరికిఁ గర్తవ్యమును ధృతరాష్ట్రుని పాలొనర్చుటయే ... చాతుర్యము గోచరించుచున్నది.

ప్ర. 6 : "వారలు శాంతశూరులు" — ఎవరు ? సోపపత్తికముగ నిరూపించునది.

జ. : ఇందు పాండవులు శాంతశూరులని శ్రీకృష్ణుఁడు స్పష్టమొనర్చెను. కౌరవులు రాజ్యలోభులై మాయాద్యూతమునఁ బాండవుల సిరిసెల్ల హరించిరి. ద్రౌపదిని సభలో నవమానించిరి. పండ్రెండేండ్లరణ్యవాసమును, నొక యేడజ్ఞాతవాసమును గావించి బహుక్లేశములను పరమ శాంతముతో ననుభవించిరి. ఇన్ని కష్టము లనుభవించినను వారు రోషము తెచ్చుకొని కేవలము యుద్ధమే శరణ్యమని చెప్పుటలేదు. సంధినే కోరుచున్నారు. సంధియే ఉభయ పక్షములవారికి, లోకమునకు మేలొనగూర్చును. వారికి న్యాయము కలుగకున్నచో మాత్రము శాంతమును వదలిపెట్టి శూరులై రాజ్యమును గొనక మానరు. కావున శ్రీకృష్ణుఁ డన్నట్లు పాండవులు శాంతశూరు లగుచున్నారు.

## III. వ్యాకరణాంశములు

ప్ర. 7 : క్రిందివానికి విగ్రహ వాక్యములు వ్రాసి, సమాసనామములను బేర్కొనుడు.

అజాత శత్రుఁడు = పుట్టని శత్రువులు కలవాఁడు : బహువ్రీహి

మహావిభూతి = గొప్పదైన ఐశ్వర్యము : విశేషణపూర్వపద కర్మధారయము

క్రోధమాన మత్సరములు = క్రోధమును, మానమును, మత్సరమును : బహుపద ద్వంద్వము

రెండు తెఱఁగులు = రెండు మార్గములు : ద్విగు సమాసము

అప్రియము = ప్రియము కానిది : నఞ్ తత్పురుషము
కార్యదశ = కార్యముయొక్క స్థితి : షష్ఠీ తత్పురుషము
శాంతశూరులు = శాంతులు, శూరులును : విశేషణోభయపద కర్మధారయము
ఇంద్రప్రస్థ పురము = ఇంద్రప్రస్థమను పురము : సంభావనా పూర్వపద కర్మధారయము
సత్యనిష్ఠ = సత్యమునందలి నిష్ఠ : సప్తమీ తత్పురుషము

ప్ర. 8 : క్రిందివాని యందలి వ్యాకరణ విశేషములను వివరింపుఁడు.

1. సుఖులరై = సుఖులరు + ఐ :
   (a) నీవు, నేను అను శబ్దముల విశేషణములకు క్రమముగ వు, ను అనునవి చివర వైకల్పికముగఁ జేరును.
   (b) మీరు, మేము అను శబ్దముల విశేషణములకుఁ క్రమముగ రు, ము అనునవి చివర వైకల్పికముగఁ జేరును.
   (c) పై వు, ను, రు, ము అను నాగమములు చేరునపుడు ఉత్వమునకు అత్వమగును.
2. నీ వోడంబడితి : (నీ వోడం బడితివి — నీ వోడంబడితి)
   భూత తద్ధర్మములకు సంబంధించిన మధ్యమ పురుషైకవచన ప్రత్యయమగు 'వ' కారమునకు లోపము వికల్పముగ నగును.
3. కలవు సెపుము :
   ప్రథమముమీఁది పరుషములకు గ స డ ద వ లు బహుళముగా నగును.
4. ఏమన వచ్చు = ఏమి + అనవచ్చు
   ఏమ్యాదుల యిత్తునకు సంధి వైకల్పికముగ నగు.
5. అవ్విధము = అ + విధము; ఇత్తెలంగు = ఈ + తెలంగు
   (a) ఆ, ఈ, ఏ యను సర్వనామంబులు త్రికంబు అనబడు.
   (b) త్రికంబుమీఁది సంయుక్త హల్లునకు ద్విత్వంబు బహుళంబుగానగు.
   (c) ద్విరుక్తమగు హల్లు పరమగునపు డాచ్ఛికంబైన దీర్ఘంబునకు హ్రస్వంబగు.

ప్ర. 9 : క్రింది ప్రకృతులకు వికృతులు, వికృతులకుఁ బ్రకృతులు వ్రాయుఁడు.

| ప్ర | వి | ప్ర | వి |
|---|---|---|---|
| కార్యము | కర్జము | మతి | మది |
| సుఖము | సుగము | మత్సరము | మచ్చరము |
| గౌరవము | గారవము | సత్యము | సత్తెము |
| ధర్మము | దమ్మము | దూత్యము | జూదము |

ప్ర. 10 : క్రిందివానికి నానార్థములు వ్రాయుండు.

రాజు = భూపతి = చంద్రుడు
ధర్మము = న్యాయము = పుణ్యము = విల్లు
మానము = కొలత = గర్వము = చిత్తసమున్నతి
మిత్రుడు = సూర్యుడు = స్నేహితుడు
వనము = అడవి = నీరు = సమూహము = ఇల్లు

ప్ర. 11 : క్రిందివానికి వ్యుత్పత్త్యర్థములను వ్రాయుండు.

అజాతశత్రుడు : పుట్టని శత్రువులు గలవాడు = ధర్మరాజు
వాసుదేవుడు : వసుదేవుని కుమారుడు = శ్రీకృష్ణుడు
వృకోదరుడు : తోడేలు కడుపువంటి కడుపు గలవాడు = భీముడు
అర్జునుడు : తెల్లనివాడు = పాండవ మధ్యముడు

# ౩. కపట సన్న్యాసి

## I. అర్థాదులు

సార, పతివ్రతాచారగా=శ్రేష్ఠమైన పతివ్రత యొక్క వ్రతమను నాచారము కలది కదా!; హర=శివునియొక్క; చండ=తీక్ష్ణమైన, భయంకరమైన; కోదండ=వింటిని; హారణ=విలు మటియందు; వినోది=వినోదించినవాడు; దిక్+కరి=దిక్కరి=దిగ్గజము; పయోనిధి=సముద్రము; అంతరము=భేదము; అగ్రహ=కోపముచేత; ఉదగ్ర=భయంకరముగా; జనిత=పుట్టిన; ఉగ్ర=తీవ్రమైన; దృష్టిమై=చూపుతో; అనుపమ=సాటిలేని; ఆటోపుడై=వేగిరపాటుకలవాడై; మణిజూటపంక్తులన్=మణులతోఁగూడిన జడల ముడుల సమూహము; ఇన్మడింపన్=రెట్టింపఁగా; పల్లవించెన్=చిగిరించెను; పద్మరుచులైన=పద్మముల కాంతివంటి కాంతికలిగిన; దివ్య=శ్రేష్ఠములైన; అంబర=వస్త్రములయొక్కయు; ఆభరణ=నగలయొక్కయు; ఓఘ=సమూహముయొక్క, కాంతులు; అరుదార=ఆశ్చర్యముగా; ధృతి=ధైర్యము; తూలి=చెడి; అలఁత=శ్రమ.

## II. ప్రశ్నోత్తరములు

ప్ర. 1 : ఈ పాఠ్యభాగ మే గ్రంథము లోనిది ? కవి యెవరు ? ఏ కాలమువాడు?

జ. : కపట సన్న్యాసి యను నీ పాఠ్యభాగము రంగనాథ రామాయణము నందలి యారణ్యకాండము లోనిది. రంగనాథ రామాయణము ప్రసిద్ధమైన ద్విపద కావ్యము.

రంగనాథుఁడను కవి దీనిని రచించి యుండుటచే దీని కీ పేరు కలిగెనందురు. కాని గోన బుద్ధరాజను రాజకవి తన తండ్రియగు విట్ఠల ధరణీశు పేర దీనిని రచించినట్లుగా గ్రంథము నందే వ్రాయఁబడి యున్నది. ఈ విట్ఠలరాజు 14 వ శతాబ్దము ప్రథమార్థమున నుండెను.

ప్ర. 2 : సీత తన చేతితృణమును జూచుచు రావణునితోఁ బల్కిన పల్కు లేవి ?

ఓరీ! నేను పతివ్రతనని తలంపక యిట్లు పలుకుట మంచిది కాదు. శ్రీరామచంద్రుని భార్యనైన నన్ను నీవు కోరుట దేవతల కొఱకైన హవిస్సును శునకము గోరినట్లే యున్నది. ఇంక మాటాడక తిరిగిపొమ్ము. పోకుండ దుష్టముగాఁ బ్రవర్తింతువేని శ్రీ రాముఁడు నిన్ను నీ వంశమును గాల్చివైచును. నీకును శ్రీరామునకు నక్కకు సింహామునకు, దోమకు దిగ్గజమునకు, సముద్రమునకుఁ గాలువకు, కాకికి గరుత్మంతునకుఁ గల భేదమే కలదు. కావున బుద్ధిమంతుఁడవై తిరిగి లంకకుఁ బొమ్ము''–అని సీత రావణునితోఁ బలికెను.

ప్ర. 3 : రావణునకు శ్రీరామునకు గల యంతరమును సీత ఎట్లు పోల్చిచెప్పెను?

జ. : పై ప్రశ్నలోఁ జూచునది.

ప్ర. 4 : "అతి భీకరాకారుఁడై నిల్చుటయును" రావణుని భీకరాకారమును వర్ణింపుఁడు.

జ. : సీత ధిక్కరించి పలుకఁగా రావణుఁడు మిక్కిలి కోపముతో భయంకరముగాఁ జూచుచు, సన్న్యాసివేషమును వదలి, మన్మథావస్థలు పదియు రూపుగొన్నవో యన్నట్లు మణులతో నొప్పు పదితలలును, ఆయవస్థలతో రెట్టింపయిన కోర్కెలో యన నిరువది బాహువులు, వానియందు వివిధాయుధములు ప్రకాశించుచుండ రావణుఁడు నిజరూపముతోఁ బ్రత్యక్షమయ్యెను. అతఁడు ధరించిన శ్రేష్ఠములైన వస్త్రములు నాభరణములు మదనాగ్నులవలె ప్రకాశించుచుండెను. ఇట్టి యాతని భీకరాకారమును జూచి సీత మూర్ఛిల్లెను.

ప్ర. 5: రావణుఁ డపహరించికొని పోవుచుండ సీత యేమియొనర్చెను ?

జ. : సీతను రావణుఁడా కాశమార్గమునఁ గొనిపోవుచుండఁ గొంత వడి కామె మూర్ఛఁదేలి, కనులు విచ్చిచూచి, కంఠమెత్తి పలుమారు దైవమును నిందించి, తన ప్రాణేశ్వరుని బిలిచి, శ్రమ, కోపము, విచారములతోఁ గాంతిఁ దొఱఁగి యేడువఁ దొడఁగెను.

ప్ర 6: ఈ పాఠ్యభాగము ననుసరించి సీత శీలమును జిత్రించునది.

జ. : సీత పరమ పతివ్రతాశిరోమణి శ్రీరాముని బలశౌర్యములపై నత్యంత విశ్వాసము కలది. పరపురుషునితో మాటాడి యెఱుఁగని పవిత్రశీల. మాటాడవలసి వచ్చుచో నా పురుషునకుఁ దనకు మధ్య ఏ గడ్డిపోచనైన నడ్డముగానుంచి మఱి మాటాడును. రావణాది దుర్జనులన్న భయపడినను ధైర్యశాలిని.

రావణుని భీకరాకారమునుజూచి యామె మూర్ఛిల్లి వడగాలికి వనలతవలె పడిపోయె ననుటవలనను, ఆమె కంఠమెత్తి పలికినపుడు కొదమ కోయిల కూసినట్లున్న దనుటవలనను, ఆమె సుకుమార శరీరయు, శ్రావ్యకంఠయునని చెప్పవచ్చును.

## III. వ్యాకరణాంశములు

ప్ర. 7: క్రింది సమాసములకు విగ్రహ వాక్యములు వ్రాసి, సమాసనామములఁ దెల్పుఁడు.

1. పదియవస్థలు = పదియగు స్థితులు : ద్విగుసమాసము
2. కోర్కిపల్లవములు = కోరికలనెడు చిగుళ్ళు : రూపకసమాసము
3. చారులోచన = అందమైన కనులు గలది : బహువ్రీహి సమాసము
4. కొదమ కోయిల = పడుచుదైన కోయిల : విశేషణ పూర్వపద కర్మధారయము
5. ఇనకులాగ్రణి = ఇనకులమునందు శ్రేష్ఠుఁడు : సప్తమీ తత్పురుషము

ప్ర. 8: క్రింది వాని యందలి వ్యాకరణ విశేషములను వివరింపుఁడు.

1. అమ్మాట = అ + మాట

(a) ఆ, ఈ, ఏ యను సర్వనామములు త్రికంబు నాఁబడు
(b) త్రికంబుమీఁది యసంయుక్తహల్లునకు ద్విత్వంబు బహుళంబుగ నగు
(c) ద్విరుక్తంబగు హల్లు పరమగునపు డాచ్ఛికంబగు దీర్ఘంబునకు హ్రస్వంబగు

2. నీదుపురవరము :- యుష్మదస్మదాత్మార్థకంబుల కుత్తర పదంబు పరంబగు నపుడు దుగాగమంబు విభాష నగు.

ప్ర. 9: క్రిందివానిని విడఁదీసి సంధినామములు వ్రాయుఁడు :

1. ఆగ్రహోదగ్రజనితోగ్రదృష్టి=ఆగ్రహ+ఉదగ్ర+జనిత+ఉగ్ర+దృష్టి
2. ప్రాణేశుఁడు = ప్రాణ + ఈశుఁడు

సూ :- అ, ఆ లకు ఇ, ఈ లు పరమగునపుడు—ఏ
ఉ, ఊ లు పరమగునపుడు—ఓ
ఋ, ౠ లు పరమగునపుడు—అర్
అనువవి క్రమముగా ఆదేశమగును. ఇది గుణసంధి.

3. శిరశ్ఛేదము = శిరస్ + ఛేదము = శ్చుత్వసంధి.

సూ :- (సకార 'త' వర్గములకు 'శ' వర్ణ 'చ' వర్గములు పరమగునపుడు 'శ' వర్ణ, చ వర్గములు క్రమముగా నాదేశము లగును.)

4. ఇనకులాగ్రణి = ఇనకుల + అగ్రణి = సవర్ణదీర్ఘసంధి.

సూ :- అ, ఇ, ఉ, ఋ లకు వాని దీర్ఘములకు అవియే వర్ణములు క్రమముగాఁ బరమగునపుడు రెంటికి ఏకముగా దీర్ఘమగును.

ప్ర. 10: క్రింది ప్రకృతులకు వికృతులు, వికృతులకుఁ బ్రకృతులు వ్రాయుఁడు.

| ప్ర | వి | ప్ర | వి |
|---|---|---|---|
| సింహము | సింగము | ఆకాశము | ఆకసము |
| రథము | అరదము | కోకిల | కోయిల |
| అగ్ని | అగ్గి | మృత్యువు | మిత్తి |
| పుష్పము | పూవు, పువ్వు | | |

ప్ర. 11: క్రింది పదములకు నానార్థములను వ్రాయుఁడు.

సారము = జలము, ధనము, న్యాయము, శ్రేష్ఠము, బలిమి
వరము = శ్రేష్ఠమైనది, దేవతల వలనఁ బొందఁబడు కోరిక
ఇనుఁడు = సూర్యుఁడు, మగఁడు, రాజు
రుచి = షడ్రుచులలో నొకటి, కాంతి
అంబరము = ఆకాశము, బట్ట

ప్ర. 12: క్రింది దానిని గణ విభజన మొనర్చి యే పద్యభాగమో చెప్పి యతిని నిరూపింపుఁడు.

U U | | | U | | | U | | | |
అమ్మాట | విని సీత | యతిభీత | యగుచు
త | సల | సల | న

ఇందు మూఁడింద్ర గణములు ఒక సూర్యగణము కలవు. రెండింద్ర గణముల పిదప మూడవగణము ప్రథమాక్షరము యతిస్థానము. ఈ పై పాదమున అ - య లకు యతిమైత్రి. ఇది ద్విపదపాదము.

# ౪. విద్యాపరీక్షణము

## I అర్థాదులు

1. దైత్యకుల ముఖ్యుఁడు = రాక్షసవంశమున శ్రేష్ఠుఁడైన హిరణ్యకశిపుఁడు; మోదముతోడ=సంతోషముతో.

2. భవ+మహత్+అర్ణవ+తారకున్=సంసారమనెడు, గొప్పసముద్రమును దాటించువాఁడు; కామ+రోష+లోభ+ఆది+విరోధివర్గ+పరిహారకున్=కోరిక, కోపము, లోభము మొదలైన యంతశ్శత్రుసమూహమును విడిపించువాఁడును; కేశవ+చింతన+అమృత+ఆస్వాద+కఠోరకున్=శ్రీమహావిష్ణువును ధ్యానించుటయనెడి, యమృతమును గ్రోలుటచేతఁ బరిపక్వతనందినవాఁడు; కఠోర = matured; Full grown అని Apte; కలుష+జాల+మహా+ఉగ్ర+వనీ+కుఠారకున్=పాపముల సముదాయమనెడు మిక్కిలి భయంకరమైన అడవికి గొడ్డలి వంటివాఁడును నయిన; ప్రహ్లాద కుమారకున్=బాలుఁడైన ప్రహ్లాదుని; రమ్ము+అని; చీరఁబంచెన్=పిలువనంపెను.

3. దానవ విభుండు=రాక్షసరాజు-అయిన హిరణ్యకశిపుఁడు; ఉత్కంఠ=వేగిరపాటు; దీపింపఁగన్=హెచ్చగుచుండఁగా; వాత్సల్యసంపూర్ణుఁడై=పుత్రుని యందలి స్నేహముతో నిండిన వాఁడై, కొడుకున్; రమ్ము+అని; చేరఁజేరి=దగ్గరగాఁ బిలిచి; ఉత్సంగ+అగ్రమున్+చేర్చి = తొడ చివరిభాగమునఁ గూర్చుండఁజేసి; వత్సా=కుమారా!; ఉద్యోగము=నీ విద్యాప్రయత్నము; ఉత్సాహ+ప్రభు+మంత్ర+శక్తి+యుతము= ఉత్సాహశక్తి ప్రభుశక్తి మంత్రశక్తి అను శక్తులతోఁ గూడినదై; ఆరూఢ+సంవిత్+సంపన్నుఁడవు+ఐతివే=పొందఁబడిన జ్ఞానమనెడు సంపదతోఁ గూడిన వాఁడవు ఐతివా?; వేదంబులన్=శాస్త్రములన్; చదివితే=చదివితివా?— (చెప్పుము-అని 5 లోని క్రియాపదముతో నన్వయము.)

4. జనకులకున్=తండ్రులకు; తనయుల సంభాషణములు=బిడ్డల పలుకులు; అనుదిన సంతోషణములు=ప్రతిదినము సంతోషమును గూర్చునవి; జనిత+శ్రమ+తాప+దుఃఖ+సంశోషణముల్=కలిగిన యలసటను, బాధను, దుఃఖమును, ఇంకింపఁజేయునవి. (పోఁగొట్టునవి); కర్ణ+యుగళ + సద్భూషణముల్ = చెవుల జంటకు మంచి ఆభరణములు.

5. భద్రము=శుభకరము.

6. నిశాచర+అగ్రణీ = రాక్షస శ్రేష్ఠుఁడా! ఎల్ల శరీరధారులకున్ = సర్వ ప్రాణులకును; ఇల్లు+అను=గృహమనెడు; చీఁకటినూఁతిలోపన్; (అనఁగా నజ్ఞానమునందు) త్రెళ్లక=పడక; మీరు, మేము, అను=మీరు మేము (భిన్నులము) అనెడు; మతిభ్రమణంబునన్ = మనస్సుయొక్క చాంచల్యముచేత; భిన్నులై = భేదమునొందినవారై; ప్రవర్తిల్లక=సంచరింపక; సర్వమున్=సమస్తమును; అతని దివ్యకళామయము+అంచు = ఆతని దివ్యమైన కళలతో నిండినది అని తలఁచుచు; విష్ణునందు, ఉల్లమున్ = మనస్సును; చేర్చి, తారు + అడవిన్+ఉండుట = తాము (అనఁగా సర్వప్రాణులు) అడవియందుండుట; మేలు=మంచిది.

7. సల్లాపంబులు = సంభాషణము; నగుచు=నవ్వుచు

8. తా:- పసిబిడ్డలు ఎవ్వరే చాడిన దానినే పలుకుదురు. ఇది యిట్లని స్వతంత్రులై పలుకఁజాలరు. ఇతరుల బిడ్డ లెవ్వరీ బాలునకు గద్దించి శత్రు పక్షానుకూలమైన మాటలను బోధించిరోకదా!

9. తా:- కుమారా! నాకుఁ జాల నాశ్చర్యమగుచున్నది. ఈ బుద్ధి నీకే కలిగెనా? ఇతరు లీ దుర్నీతిని బోధించిరా? లేక రహస్యముగా గురువులే చెప్పిరా? ఈ రాక్షస వంశమునకు విష్ణుఁడు శత్రువు. ఆతనిని నీవేల వరింతువు?

10. తా:- దేవతలను దఱుముట, వారి నాయకులను బాధించుట, సిద్ధులను హింసించుట, మునీశ్వరులను బాధించుట, యక్ష కిన్నర గంధర్వాదుల నాశమొనర్చుట—ఇవి మన కులమునకుఁ దగినవి. అట్టివి మాని మోహముచేత గ్రుడ్డివాఁడవై హరి హరి యనుచు నేల చెడిపోవుచుంటివి?

11. మోహనిర్మూలనంబుసేసి = అజ్ఞానమును మొదలంట పోఁగొట్టి; తత్పరులయి=ఆసక్తులై; ఎఱుక = జ్ఞానము; మాయాకృతంబయిన = మాయచేఁ జేయఁబడిన; అసత్, గ్రాహంబు=చెడ్డజ్ఞానము,అజ్ఞానము.(గ్రాహము=knowledge)

12. తా:- కొందఱు మూఢులు మాయావశమున మేము తాము నను భేదభావము గలిగి సర్వాంతర్యామియు, జ్ఞానముచేతనే పొందఁబడువాఁడును అగు విష్ణువునుగూర్చి భాషింపఁజాలరు. ఆతనిని గూర్చిన ఆలోచనయందు బ్రహ్మ మొదలైన వేదవేత్తలే మూఢులై యుండ నితరు లాతని నెట్లు చూడఁజాలుదురు? (చూడఁజాలరు)

13. బ్రాహ్మణ+ఉత్తమ=బ్రాహ్మణశ్రేష్ఠా! (ఓ గురువరా). ఇనుము, అయస్కాంత, సన్నిధిన్ = సూదంటురాయి చేరువను, ఎట్లుభ్రాంతమగు = ఎట్లా కర్షింపఁబడునో, ఆవిధమునన్, దైవయోగమునన్, చేసి=దైవముయొక్క ప్రయత్నముచేత, చిత్తము=నా మనస్సు, హృషీకేశు సన్నిధిన్ = శ్రీమహావిష్ణువుదెస, కరఁగుచున్నది=ద్రవించుచున్నది (ఆకర్షింపఁబడు చున్నది)

14. మధుపము=తుమ్మెద, మదనములకు=ఉమ్మెత్తచెట్లకు, మందాకిని=గంగానది, వీచికలు=కెరటములు, తరంగిణులు=ఏళ్లు (సాధారణ నదులని భావము) లలిత=సుకుమారమైన, రసాల = మామిడి, పల్లవ = చిగుళ్లను, ఖాది=తినునది, చొక్కు=పరవశముగల, కుటజము=కొండమల్లె, పూర్ణ+ఇందు=పూర్ణిమాచంద్రుని యొక్క, చంద్రికా=వెన్నెలయందు, స్ఫురిత=ఎగిరెడు (ప్రకాశించెడు), సాంద్ర=దట్టమైన, నీహారములకు=మంచు (గురియు) ప్రదేశములకు.

తా :- మందార కుసుమములలోని మకరందమును గ్రోలు తుమ్మెద యుమ్మెత్తచెట్లకడకుఁ బోనట్లును, నిర్మలమైన గంగా తరంగములయం దూయెలలూగు రాజహంస సెలయేళ్లఁ జేరనట్లును, కోమలములైన మావిచిగుళ్లను దినెడి కోయిల కొండమల్లె చెంతకుఁ బోనట్లును, పున్నమవెన్నెలలో విహరించు చకోరపక్షి మంచుగురియు భూములకు బోనట్లును శ్రీహరి పాదధ్యానమనెడి యమృతమును గ్రోలుటచే మదించిన నా మనస్సు ఇతర విషయముల దెస కెట్లు మరలును?

16. తా:- శత్రువుల కలంకారము వంటివాఁడా! స్వీయవంశమును నిందించువాఁడా! (ప్రహ్లాదా!) నీ వైదేశ్లవాఁడవు. తర్కమున కాస్పదమైన మాటలనే పలికెదవుగాని మేము చెప్పిన శాస్త్రములలోని విషయమేమియుఁ జెప్పవు. ఈ రాక్షసేంద్రునెదుట మేము (సిగ్గుచే) తలలు వంచుకొనునట్లు చేసితివి.

17. తా:- రాక్షస రాజునకు వీఁడు కుమారుఁడు గాఁడు. మరి శత్రువు. రాక్షస వంశమనెడు మంచిగంధపుఁదోటయందు ముండ్లచెట్టువలె పుట్టినాఁడు. ఎల్ల పుడుఁ రాక్షసవంశమునకు యముఁడైన విష్ణువునే ధ్యానించు చున్నాఁడు. వీఁడు బోధించుటవలన మనలఁ జేరఁడు. దండింపనేవలయు. కావున పట్టుకొని కొట్టుఁడు.

18. తా:- ఓ రాక్షసరాజా! ఇఁక నీ పాదములు సాక్షిగా నీ బిడ్డను నైపుణ్యమునిూఁదఁ జదివింతుము. కోపింతుము, దండింతుము. జరిగిన దానికి మా మీఁద కోపింప వలదు.

19. వెఱపు = భయము

## II. ప్రశ్నోత్తరములు

ప్ర. 1 : విద్యాపరీక్షణమను నీ పాఠ్యభాగము ఏ గ్రంథము లోనిది ? కవి, ఆయన కాలము, నివాసము పేర్కొని, ఆయన సమకాలమువాఁడైన యింకొక ప్రసిద్ధ కవిని చెప్పుఁడు.

జ. : విద్యాపరీక్షణమను నీ పాఠ్యభాగము ఆంధ్ర మహాభాగవతము లోని సప్తమ స్కంధములోని ప్రహ్లాదచరిత్ర లోనిది. సంస్కృతమున వ్యాసమహర్షి వ్రాసిన భాగవతమును బమ్మెర పోతనామాత్యుఁడు తెనిఁగించెను. ఈయన ఏకశిలానగరవాసి (ఓరుగల్లు - వరంగల్లు). ఈయన క్రీ. శ. 15వ శతాబ్దము నుత్తరార్థమునం దుండెను. శ్రీనాథ కవిసార్వభౌముఁ డీయనకు సమకాలమువాఁడు.

ప్ర. 2 : పోతన బిరుదములేవి? ఆయన యితర గ్రంథములేవి? ఆయన కవిత్వ మెట్లుండును?

జ. : పోతనకు సహజపాండిత్యుఁడను బిరుదము గలదు. భోగినీ దండకము, వీరభద్ర విజయము నీతని యితర గ్రంథములు.

ఈయన కవిత్వము ప్రసాద మాధుర్యములతో నొప్పు చు, శబ్దార్థాలంకారములతో మనోహరమై లలితపద గంధముతో పండితులకు సామాన్యులకుఁగూడ హృదయంగమమైయుండును.

(*Note*:- విశేషములకు Text Book చూచునది.)

ప్ర. 3 : "దైత్యకులముఖ్యుఁడు రమ్మని చీరఁబంచె" ఎవరిని? అతఁడెట్టివాఁడు?

జ. : దైత్యకుల ముఖ్యుఁడైన హిరణ్యకశిపుఁడు ప్రహ్లాదకుమారుని రమ్మని పిలువనంపెను. ఆ ప్రహ్లాదకుమారుఁడు పుట్టుకయనెడి సముద్రమును తరింపఁజేయువాఁడు, అరిషడ్వర్గమును బోద్రోలువాఁడు, అనవరతము శ్రీవిష్ణు చింతన యనెడు అమృతమును గ్రోలుటచేఁ బరిపక్వత నందినవాఁడు. పాపములనెడు మహారణ్యమునకు గొడ్డలివంటివాఁడు.

ప్ర. 4 : ప్రహ్లాదునిఁ జేరఁజీరి హిరణ్యకశిపుఁడేమని పలికెను?

జ. : హిరణ్యకశిపుఁడు వాత్సల్యమునఁ గొడుకును దొడపై నిడుకొని, "నీ విద్యాప్రయత్నము త్రిశక్తియుతమై విజ్ఞాన సంపన్నుఁడవైతివా! వేదశాస్త్రములను చదివితివా? బిడ్డల సంభాషణములు తండ్రులకు నిత్య సంతోషదాయకములు. శ్రమను, బాధను, దుఃఖమును బోఁగొట్టును. చెవులకు అందమైన ఆభరణములవలె నొప్పును. కావునఁ బుత్రా! నీకేది శుభకరమో చెప్పుము—" అని పలికెను.

ప్ర. 5 : ప్రహ్లాదుఁడు తండ్రిసమక్షమున నొనర్చిన ప్రతిపక్షాను రూపసల్లాపమేమి?

జ. : హిరణ్యకశిపుఁ డుత్కంఠతో "బుత్త్రా నీ కెయ్యది భద్రంబై యున్నది చెప్పు" మని యడుగఁగా నాతఁడిట్లనెను. ప్రాణులందఱు గృహమునఁ దగిన యజ్ఞానమనెడు చీఁకటి నూతిలోఁ

బడి పోక, మీరు మేము వేర్వేరను భేదబుద్ధిచే భిన్నులై సంచరింపక, జగత్తు సర్వము విష్ణుమయమని యెఱిఁగి, యా దేవునియందే మనస్సు నర్పించి యడవిలోనుండుట క్షేమంకరము.—అని చెప్పెను.

ప్ర. 6: కుమారుఁ డాడిన ప్రతిపక్షాను రూపసల్లాపములను విని హిరణ్యకశిపుఁ డేమని పలికెను?

జ. : శిశువులు ఇది యిట్లని పలుకఁ జాలరు. ఎవ్వరేమనిన నట్లే యందురు. ఇతరుల బిడ్డలు నాకుమారునకు శత్రుపక్షపు మాటలను బోధించిరేమో—కుమారా! నాకుఁ గడు నాశ్చర్యమగుచున్నది. ఈ బుద్ధి నీకేపుట్టెనా? ఇతరులెవ్వరైన బోధించిరా? లేక రహస్యముగా గురువులే యిట్లు బోధించిరా? ఈ దనుజవంశమునకు వైకుంఠుఁడు పరమశత్రువు. అతనిని నీ వేల వర్ణింతువు? కులోచితముగ దేవతలను, సిద్ధులను, మునులను, యక్షగంధర్వాదులను బాధించుటో నాశంబొనరించుటో చేయవలెఁగాని యజ్ఞానమున హరి గిరి యనుచు నేల చెడిపోవుచున్నావు?—అని హిరణ్యకశిపుఁడు కుమారునితోఁ బలికెను.

ప్ర. 7: ఇతరులు విష్ణుదర్శింప నేరరని ప్రహ్లాదుఁడెట్లు నిరూపించెను?

జ. : 12వ పద్యము తాత్పర్యమును జూచునది.

ప్ర 8: "చిత్తమేరీతి నిరతంబు జేర నేర్చు" ఈ మాట లెవరివి? దీనిని అతఁడెట్లు సమర్థించెను?

జ. : నిరంతరము శ్రీహరి పాదపద్మములను ధ్యానించుటయను నమృతమును గ్రోలుటయందే పరవశమైయున్న మనస్సు గలిగిన ప్రహ్లాదుఁడు, తన మనస్సుయొక్క స్థితి యెట్లున్నదో వర్ణించి చెప్పుచు నిట్లనెను.

"అయస్కాంత సమీపమున నినుమెట్లు లాకర్షింపఁబడునో యావిధముననే దైవయోగమున నామనస్సు శ్రీమహావిష్ణు సన్నిధిని ద్రవించుచున్నది. మందార కుసుమములలోని మక

రందమును గ్రోలు తుమ్మెద యుమ్మెత్తచెట్లకడకుఁ బోని విధమున, పవిత్రగంగా తరంగముల నూఁగులాడు రాయంచ సెలయేళ్లను జేరనట్లును, లలితములైన మావిచిగుళ్లను భుజించు కోయిల కొండమల్లెచెంతకుఁ బోనట్లును, పున్నమ వెన్నెలలో విహరించు చకోరము నీహారభూములకుఁ జననట్లును, నాహృదయము ఇతరవిషయముల దెస మ్రొగ్గకున్నది." అని సమర్థించెను.

ప్ర. 9: "మాకు నాదలల్ వంచుకొనంగఁ జేసితివి" అర్థసందర్భములను వివరింపుఁడు

జ. : ఈ మాటలు విద్యాపరీక్షణమను పాఠ్యభాగమున ప్రహ్లాదుని విద్యాగురుఁడైన పురోహితుఁడు ప్రహ్లాదునితో నన్నవి.

హిరణ్యకశిపుఁడు ప్రహ్లాదుని రావించి నీవేమి చదివితివని యడుగఁగా నాతఁడు విష్ణుభక్తినిగూర్చియు, తన హృదయ మెట్లు విష్ణుసన్నిధిని ద్రవీభూతమగుచున్నదియు ఇతర విషయము లెవ్వియుఁ దన కాకర్షకములు కావనియు జెప్పెను. ప్రతిపక్షానురూపంబులైన యామాటలను విని దానవభర్త కోపించెను. పిమ్మట నా బాలునిజూచి గురుఁడు తాను జెప్పిన శాస్త్రములలోని యొక్క విషయమైనఁ జెప్పక ఏవియో తార్కిక విషయములను, శత్రుహిత వాక్యములను బల్కి రాజునెదుట తనకు సిగ్గుగలిగించితివనియు, గావున దల వంచుకొనునట్లొనర్చితివనియుఁ బ్రహ్లాదునిపైఁ గోపించెను.

## III. వ్యాకరణాంశములు

ప్ర. 10: క్రింది సమాసములకు విగ్రహవాక్యములు వ్రాసి, సమాసనామములఁ బేర్కొనుఁడు.

1. ఉత్సాహప్రభుమంత్రశక్తులు = ఉత్సాహశక్తి, ప్రభుశక్తి, మంత్రశక్తులు : బహుపద ద్వంద్వసమాసము
2. మోహాంధుఁడు = మోహముచేత గ్రుడ్డివాఁడు : తృతీయా తత్పురుషము
3. వేదజ్ఞుఁడు = వేదములను దెలిసినవాఁడు : ద్వితీయా తత్పురుషము
4. రాజసేవకుఁడు = రాజుయొక్క సేవకుఁడు : షష్ఠీ తత్పురుషము

5. వివిధోపాయములు = వివిధమైన ఉపాయములు : వి॥ పూ॥ కర్మధారయము

6. మోహనిర్మూలనము = మోహముయొక్క నిర్మూలనము : షష్ఠీ తత్పురుషము

7. అంబుజోదరుఁడు = అంబుజము నుదరమందు గలవాఁడు : బహువ్రీహి సమాసము

8. దైత్యచందనము = దైత్యులనెడి చందనము : రూపకసమాసము

ప్ర. 11: క్రిందివానిని విడఁదీసి సంధులను పేర్కొనుఁడు.

1. మహాత్ + (హా) అర్ణవము = సవర్ణదీర్ఘసంధి
2. మహాత్ + (హా) ఉగ్రము = గుణసంధి
3. దానవ + ఇంద్రుఁడు = గుణసంధి
4. చింతనా + అమృతము = సవర్ణదీర్ఘసంధి

ప్ర. 12: క్రిందివాని యందలి వ్యాకరణ విశేషములను వివరింపుఁడు.

1. సర్వమున్నతని = (సర్వమున్ + అతని) :- ద్రుతమున కచ్చుపరమగు నపుడు కొన్నిచోట్ల ద్విత్వమగును.
2. హరియంచున్ గిరియంచు :- నిందయం దామ్రేడితంబు నాద్యక్షరము లకు హ్రస్వదీర్ఘములకు గిగీలగు.
3. నేర్తురే :- 'చు' వర్ణంబు తోడి 'దు' గ్దకారంబు 'త' కారంబగు.
4. భాషించెను :- లిట్లోట్లుల 'వ' కారంబునకు లోపంబు విభాషనగు.
5. ఇట్టిట్టని = ఇట్టు + ఇట్టు + అని :- అచ్చున కామ్రేడితంబు పరంబగు నపుడు సంధి తఱచుగనగు.
   ద్విరుక్తముయొక్క పరరూప మామ్రేడిత మనంబడు.
   ఉత్తున కచ్చుపరమగునపుడు సంధి యగును.
6. ఎయ్యది :- త్రికసంధి చూడుఁడు.

ప్ర. 13: క్రింది ప్రకృతులకు వికృతులు, వికృతులకుఁ బ్రకృతులు వ్రాయుఁడు.

| ప్ర | వి | ప్ర | వి |
|---|---|---|---|
| కుఠారము | గొడ్డలి | హంస | అంచ |
| విష్ణుఁడు | వెన్నుఁడు | ప్రజ్ఞ | పగ్గె |
| బ్రహ్మ | బమ్మ | కులము | కొలము |
| కోకిల | కోయిల | బ్రాహ్మణుఁడు | బాపఁడు |
| యక్షులు | జక్కులు | రాక్షసుఁడు | రక్కసుఁడు |
| గుణము | గొనము | ఆజ్ఞ | ఆన |

ప్ర. 14: క్రింది పదములకు నానార్థములు వ్రాయుండు :

1. మంత్రము : పంచాక్షరి మొదలగు మంత్రము, రహస్యము
2. పక్షము : 15 దినముల కాలము, రెక్క, ప్రక్క, చెలికాండు
3. పరుడు : పరమాత్ముడు, అన్యుడు, శత్రువు
4. గ్రాహము : చెఱ, గ్రహించుట, మొసలి
5. రాజు : భూపాలుడు, చంద్రుడు, శ్రేష్ఠుడు

ప్ర. 15: క్రిందివానికి వ్యుత్పత్త్యర్థములను వ్రాయుండు :

1. హృషీకేశుడు : ఇంద్రియములకు ప్రభువు – విష్ణువు
2. మధుపము : మధువును గ్రోలునది – తుమ్మెద
3. తరంగిణి : తరంగములు కలది – నది – ఏఱు

## ౨౨. విజ్ఞప్తి

### I. అర్థాదులు

1. శాంతసంరంభంబుగా = శాంతించిన యాటోపమగునట్లుగా, తీఱమి కొలంది=అశక్యతయొక్క పరిమితి.

2. తా :– ఓ కృష్ణా! తనకుఁ గానుకలు చాలవని కోపించఁగా నొక పేరూరు లేని రాక్షసునకు నడఁగి యుంటిని. తన విడిదికి రంభను పంపలేదేమని తిట్టిన యొక యంబేదరాక్షసునకు నమస్కరించి యూరకుంటిని. తనకుఁ బెట్టుబడిక మీాయలేదని దూషించిన యొక యల్పరాక్షసునిఁ బూజించితిని. తన కమ్మృతమునిచ్చి పంపలేదేమని గద్దించిన లుబ్ధరాక్షసునితోఁ బ్రియవచనము లాడితిని. ఇట్టులు వారి వలన నేను పడినపాటు లింకెవ్వరు నెక్కడను బడరు. నీ కేమని చెప్పుదును. ఎంత పాప మొనర్చిన జంతు వింద్రుడగునో యని యపుడు తలఁచితిని.

3. వారిజనేత్ర=తామరల (రేకుల) వంటి కన్నులు కలవాఁడా, కృష్ణా! నీను ఇపుడు వచ్చుచునుండి = నా నగరమునుండి నీ కడకు వచ్చుచుండి, అలౌకిక= లోకమున కతీతమైన, అద్భుత=ఆశ్చర్యకరమైన, శ్రీ=శోభతో, రుచిర=ఒప్పిద

మైన, త్వదీయ=నీ, నగరీ=పట్టణపు, గరిమ=గొప్పదనముయొక్క, అతిశయ= ఆధిక్యమును, అవలోకలీలా=చూచుట యనెడు క్రియ యందలి, రస=రుచిచేత, దూర=దూరముగా, ధూత=విడువఁబడిన, సకలవ్యథ చిత్తుఁడనై=సకల బాధలు గలిగిన మనస్సు కలవాఁడనై, యథాపురాకారతన్=ఎప్పటి పూర్వరూపముతో, నీకుఁ దోఁచెదనో కాని = నీకుఁ గనబడు చున్నానేమోకాని, తనుద్యుతిన్ = శరీర కాంతిని, పానితిన్ చుమీ=పోఁగొట్టుకొంటిని సుమీ !

5. తా :- తనవెంట గుంట్రూడాళ్ల వంటి చాలమంది రక్కసులు గర్వము పరాక్రమము మెఱయుచుండ వచ్చి ద్వారపాలకులను పరా క్రమము చేయునట్లు తన్నఁగా, నా రాక్షసుఁడు, గర్వము, అతి సంతోషము, బింకము ప్రకాశించుచుండఁగా వచ్చి నా యున్న తాసన మునఁ గూర్చుండెను.

6. తా.- ఆ రాక్షసుని సైనికులు సభలోని మునీశ్వరులను రెక్కలుపట్టి యావలికి నెట్టుచు వారింపరాని వారై తమకుఁ దామే వారియాసనములఁ గూర్చుండిరి. మునీశ్వరులు దేవతలు జడలతో నక్కడక్కడ గిక్కురుమనకుండ నొదిగి కూర్చుండిరి.

7. తా.- ఓ కృష్ణా! అప్పుడా దేవతలయొక్కయు మునుల యొక్కయు శ్రమనుగూర్చి యాను గాదని చెప్పుటకుఁగూడఁ జాలక నామనసు కలఁతపడెను. ఈ దానవుఁడు కడు దుర్మార్గుఁడు. అధిక్య మతిశయించునట్లుగా జుట్టుముట్టి మమ్మిద్దఱను బట్టుకొనిన నింక దిక్కేమికలదు ? (ఇద్దఱు అనఁగా తాను, శచియును - "ఇందఱు" అనియును జెప్పవచ్చును.) నా యభిప్రాయమున నది ప్రమాదముతోఁ గూడిన యొక మోసము - అని కలుగుచున్న శంకతో - క్రింది వచన మున గల క్రియాపదములతో నన్వయము. మొత్తముమీద ఈ పద్యమున అన్వయము క్లిష్టముగా నున్నది.

8. ఉప్పతిల్లెడు=సంభవించెడు; మదికలంక = మనస్సుకలఁత; సంభావ నలు=సన్మానములు.

9. తా : - (ఇంద్రా!) నా యిచ్చకు వలసినట్లు మంచి మంచి వస్తువులను సమర్పింపట్టి యనుభవించుచు, ప్రభుత్వము చేయకుండ పరు లిచ్చినదానిని నేఁటి యుండవలసిన దైన్యము నాకేల?

10. తా :– నీ మంచితనపు నటనలచే నేను మొగమోడి మెలుఁగనట్లుండితినిగాని నీ ఫలితములేని తియ్యందనము నా కెందుకు? న్యాయము నలుఁగిన వాఁడవైనచో నొక విషయమును వినుము.

11 తా :– ఇంద్రా! నీ విచ్చటనుండి స్వర్గము నెంతకాలము పాలించితివో నేను నంతకాలము పాలించుట న్యాయము. మీకును దానవజాతికిని కశ్యప మునీశ్వరుని సంతానమగుట సమానమేకదా! ఇది యంతయును నెఱిఁగి నీవు రాజ్యము లేకుండ నెచ్చటికైన బొమ్ము.

12. తా :– ఇంద్రా! ఇట్లు చేయకున్న మీ రందఱు నా చేతిలోనివారే! ఇఁకఁ జెప్పనేల? ఇపుడె పట్టుకొని త్రోసివైచెదను'' (శిక్షించెదను) అనఁగా నేను నవ్వుచు నా రాక్షసునితో:

13. తా :– శిక్షల కేమి లెమ్ము. నీవు మేము పరస్పర స్నేహమున నుండునట్టి విధానమును నడపవలయునుగాని యెడఁబాసి మైత్రిని పోనాడుకొనుట మంచిదా? ఇట్లు (నన్ను) తొందరపెట్టుట తగునా?

15. తా:- ఓ కృష్ణా! మా భాగ్యమేమోకాని యా రాక్షసుఁడు సంతోషముతో నంగీకరించెను. ఆ మునీశ్వరుని సత్కృపవలన నప్పటికి మేమును బులినోటనుండి జాఱిపడిన మాంసమువలె (అతని నుండి) విడివడి, తలపట్టిచూచుకొనుచు, నాపద తప్పెననుకొనుచు మెల్ల మెల్లగా స్వర్గమునకుఁ బోయితిమి.

16. తా:- కృష్ణా! ఆ రాక్షసుఁడు గర్వాతిశయమున నెపుడు మమ్మేమి చేయునో తెలియరాదు. సురరాజ్యము వలసి సుఖమునందలి యాశ స్పష్టముగా విడిచిపెట్టితిని. ఈ పై నీవు తల

నిండునంత ధనముపోసినను నే నటు అడుగుపెట్టుటకైన భయపడుచున్నాను. (అర్థము = ధనము) అని నిన్నే సేవించుచుండెదను.

## III ప్రశ్నోత్తరములు

ప్ర. 1: "విజ్ఞప్తి" యను మీ పాఠ్యభాగ మే గ్రంథములోనిది? కవియెవరు? ఆతని కాలమేది?

జ. : విజ్ఞప్తియను నీ పాఠ్యభాగము పింగళి సూరనార్యుఁడు రచించిన ప్రభావతీ ప్రద్యుమ్నమను ప్రబంధమున దలి ప్రథమాశ్వాసములోనిది. సూరన శ్రీకృష్ణదేవరాయులవారి యాస్థానమున నుండెనని కొందఱందురు. కాని యాతఁడు క్రీ.శ. 16 వ శతాబ్దము తుదిని 17 వ శతాబ్దము మొదట నుండెనని చరిత్రాధారములను బట్టి పండితులు నిర్ణయించిరి.

ప్ర. 2: పింగళి సూరన రచించిన యితర గ్రంథము లేవి? ప్రభావతీ ప్రద్యుమ్నము నెవరి కంకిత మొనర్చెను? ఈతని కవిత్వ విశేషము లేవి?

జ. : సూరన గరుడ పురాణము, రాఘవ పాండవీయము, గిరిజా కల్యాణము, కళాపూర్ణోదయము, ప్రభావతీ ప్రద్యుమ్నము నను గ్రంథములను రచించెను. వీనిలో గరుడ పురాణము, గిరిజా కల్యాణములు నామమాత్రావశిష్టములు. తక్కినవి దొరకుచున్నవి.

ఈతని కృతులలోఁ బ్రభావతీ ప్రద్యుమ్నమే కడపటిది. తన పూర్వగ్రంథములలో నెచ్చటను దన పితృ పితామహాదుల వర్ణన లేకుండుటవలన, నీ గ్రంథమును తన తండ్రికి కృతి యిచ్చుచున్నాఁడనని యాతఁడు గ్రంథమునందే చెప్పుకొనెను.

సూరనార్యుఁడు బహుముఖ ప్రజ్ఞాశాలి. ఉభయ భాషల యందును నపార పాండిత్యముగలవాఁడు. ఈతని యద్భుత కల్పనాచాతురికిఁ గళాపూర్ణోదయమే సాక్ష్యము. సంభాషణ శైలిలో రచించుటయం దీతఁడు తిక్కనతోఁ బోల్పఁదగిన వాఁడు. అచ్చటచ్చట నన్వయ క్లిష్టత గోచరించినను,

మొత్తముమీద సీతని కవిత సరళమైన పదగుంభనముతో, చక్కని యలంకారములతో, తీర్చి దిద్దఁబడిన పాత్రలతో, సంభాషణ శైలితో మనోహరమై యుండును.

ప్ర. 3 : క్రిందివాని యర్థసందర్భములను వివరింపుఁడు :

1. ఎంత పాపంబుచేసిన జంతువొక్కొ యింద్రుఁడగునని యపు డాత్మ నెన్నుకొంటి !

ఈ వాక్యము పిజ్జ్ఞప్తియను పాఠ్యభాగమున నింద్రుఁడు వాసుదేవునితోఁ దాను వజ్రనాభదైత్యుని వలనఁ బడిన పాటులను దెల్పు సందర్భము నందలిది.

వజ్రనాభుఁడను దైత్యుఁడు దేవేంద్రునిపై దాడి వెడలి రాఁగా నాతని నెదిరించుటకు జాలక యింద్రుఁడు మంచిమాటలచే దాత్కాలికముగ శాంతింపఁజేసి, నగరమున విడియించి కావలసినవాని నిచ్చుచు నుండెను. ఐనను నా దైత్యులు తమకు కానుకలు చాలలేదని, తమ విడిదికి రంభను బంపలేదని, తమకుఁ బెద్దటిక మీాయలేదని, అమృత మొసఁగలేదని - మొదలైన కారణములతోఁ గోపించుచు దూషించుచు నుండిరి. దేవతలకుఁ బ్రభువయ్యు నింద్రుఁడు వారి నేమియుఁ జేయఁజాలకుండెను. కాని యీాయవమానములకు సిగ్గుపడి, యింద్రుఁడగుట యెంత ఘోరమైన పాపమునకు ఫలమో (ఎంత పాప మాచరించినజంతు వింద్రుఁడగునో) అని విచారించు చుంటినని ఆ విషయములను శ్రీకృష్ణునితో మొరపెట్టుకొనెను.

2. యథాపురాకారత నీకుఁ దోఁచెదనోకాని తనుద్యుతిఁ బాసితింజుమీ. (సందర్భము పైవలెనే)

వజ్రనాభుఁడు ససైన్యుఁడై యమరావతిపై దాడివచ్చి ఇంద్రుని పదభ్రష్టుని జేయనెంచి యేవో నెపములు పెట్టి కోపించుచు దూషించుచుఁ జాల నవమానించెను. ఈ యవమానము వలనను, ఆపదను శంకించుటవలనను, నింద్రుఁడు

చాల కలఁతఁజెందిన మనస్సు కలవాఁడయ్యెను. శ్రీకృష్ణునితోఁ దన పడిన పాటులు చెప్పుకొనుచు దాను వచ్చునప్పుడు కృష్ణుని ద్వారకానగరముయొక్క యలౌకికాద్భుత శోభాసంపదలను దిలకించుటచేత గలిగిన యానందము వలనఁ బూర్వమువలె కనబడుచున్నాఁడే కాని, నిజమునకు శరీర కాంతిని పోఁగొట్టు కొన్నట్లు విన్నవించెను.

ప్ర. 4 : వివిధోపచారములను గొనుచుండిన వజ్రనాభుఁ డొకనాఁడేమి చేసెను ?

జ : ఇంద్రుఁడు చేయుచుండిన వివిధోపచారముల ననుభవించుచు వజ్రనాభుఁ డొకనాఁడు సైనికులతో నింద్రుని మందిరమునకు వచ్చెను. తాను వచ్చినట్లు లోనికి వార్తనంపెను. గుండ్రాల వంటి యాతని సైనికులు విజృంభించి ద్వారపాలకులను దండింపఁగా, వజ్రనాభుఁడు గర్వముతోఁ బ్రవేశించి యింద్రుని సింహాసనమునఁ గూర్చుండెను. ఆతని సైనికు లచ్చటనున్న దేవతలను, మునీశ్వరులను తెక్కలబట్టి బయటకు నెట్టివైచి తత్తదాసనముల నాక్రమించిరి.

ప్ర. 5 : తనకుఁ బరివారమునకు మర్యాదలొనర్చుచున్న ఇంద్రుని గాంచి వజ్రనాభుఁ డేమని పలికెను ?

జ : తనను వస్త్రాభరణాదులతో గౌరవించుచున్న ఇంద్రునిజూచి వజ్రనాభుఁడు చాలు చాలునని నివారించి, "నా కోరికకు దగినట్లు కావలసిన వస్తువులను నీవు నా కనుభవింప నిచ్చుచున్నావు. కాని ప్రభుత్వము లేకుండ నితరుఁ డిచ్చువరకు వేఁచి యుండవలసిన దైనము నా కేల ? నీ మంచితనపు నటన లిఁకఁజాలును. నీవు న్యాయము నెఱిఁగినవాఁడవైనచో నొక్క విషయమును జెప్పెదను, వినుము. మనము కశ్యపుని సంతానమగుటచే, నీవు స్వర్గము నెంతకాలము పాలించితివో నేనును అంతకాలము బాలించుట న్యాయము. ఆలోచించి నీవింక రాజ్యమును విడిచి యెందేనేగుము. ఇట్లు చేయని యెడల మిమ్మిప్పుడే నిగ్రహింతును," అనెను.

ప్ర. 6 : రాజ్యమును విడిచి పొమ్మని పలికిన వజ్రనాభునకు దేవేంద్రుఁడేమి సమాధానము చెప్పెను? దాని ఫలితమేమి ?

జ. : తనను రాజ్యమువిడిచి పొమ్మనిన వజ్రనాభునితో దేవేంద్రుఁడు, ఓ యనఘా! మన మన్యోన్యము మైత్రి పెంపొందు మార్గమున నడువవలయుఁగాని యెడబాసి పోరాడు. నన్ను తొందర పెట్టుట నీకు న్యాయముగాదు. మన వివాదమును దీర్ప కశ్యపమునీంద్రుఁడే యర్హుఁడు. కావున మన మాతని కడకుఁ బోవుదమనెను.

వజ్రనాభుఁ డంగీకరింప నిరువురు కశ్యపునికడ కేఁగిరి. కశ్యపుఁడపుడు చేయుచున్న యజ్ఞము సమాప్తమైన పిమ్మట వారి వివాదమునువిని తీర్చెదననెను. వజ్రనాభుని శాంతుఁజేసి తాత్కాలికముగా నతని పట్టణమునకు మఱలిపోవున ట్లొనర్చెను.

ప్ర. 7 : "తియ్యని నోరం జేఁదు మేయుట నాయంబుగాదు" — ఈ మాట లెవ రెవరితో ననిరి ? సందర్భపూర్వకముగ వివరించునది.

జ. : ఈ మాటలు "విజ్ఞప్తి" యను పాఠ్యభాగమున నింద్రుఁడు వజ్రనాభునితోఁ బలికినవి.

దేవేంద్రుఁ డొసఁగిన సపర్యలుగొనుచు గొన్ని దినము లుండి వజ్రనాభుఁ డొకనాఁడు దేవేంద్రుని మందిరమున నాతని సింహాసనముపై గూర్చుండి తాను స్వర్గమును బాలింప వలెననియు, నాతఁడు (ఇంద్రుడు) రాజ్యమును వదలి పోవలయు ననియు జెప్పెను. లేనిచో శిక్షింతుననెను. అది విని దేవేంద్రుఁడు తొందరపడవలదనియు, దమ వివాదమును గశ్యపుని కెఱిఁగించి నాకాధిపత్యము నొసంగవలసిన నొసంగెదననియుఁ జెప్పెను. అంతవఱకుఁ దొందరపాటు వలదని ప్రార్థించుచు, నా మాటవిని, తొలుత నెట్టి సైరణ వహించితివో దానిని చివరివఱకు నడుపుము. నడపక విడిచిపెట్టుట తీయని నోరం జేఁదు మేయుటవంటిది. అది నీయట్టి గట్టివార కుచితముగాదు. అనెను.

ప్ర. 8 : (1) పులినోరికండ ఁడిపడ్డగతి". (2) తలపట్టి చూచుకొను"— ఈ జాతీయములను సందర్భపూర్వకముగ వివరింపుఁడు.

జ. : (1) పులి తన నోటికిఁ జిక్కిన మాంసఖండమును పొరపాటునఁగూడ విడిచిపెట్టదు. అట్టిచో నా మాంసము ఒకానొకవేళ దాని నోటినుండి జారిపడుట గొప్ప అదృష్టమువలన మాత్రమే జరుగును. సామాన్యముగాఁ దప్పని యపాయము అదృష్టవశమునఁ దప్పిపోయినదని చెప్పునపుడు ఈ జాతీయము మిక్కిలి సందర్భశుద్ధమై యర్థపుష్టినిఁ జేకూర్చును. పాఠ్యభాగమునఁ గశ్యపుని వాక్యమును విని తాత్కాలికముగనైన వజ్రనాభుఁడు స్వర్గము నాక్రమించుకొనుట మాని, స్వనగరమునకు మఱలిపోయెను. ఆతఁడొక పులిగా, వాని వలని యపాయమునుండి యదృష్టవశమున దప్పించుకొనఁగలిగిన తానొక మాంసఖండముగాఁ నింద్రుఁడు పోల్చుకొని యీ జాతీయమును వాడుట యీ సందర్భమున కెంతయుఁ దగి యున్నది.

(2) ఏదైన ఆపద కడచిపోయినపు డీ జాతీయము నుపయోగింతురు. (తలతడిమి చూచుకొను) సర్వేంద్రియములలో శిరస్సు ప్రధానము. ఆపదలో దాని కపాయము కలుగకుండ జాగ్రత్తపడుట సహజము. ఆ ప్రమాదము కడచిపోయినపుడు సర్వప్రధానమైన శిరస్సు స్వస్థానమున నిరపాయముగా నున్నది గదా అని పట్టుకొని చూచుకొని యానందించుట సహజము. కనుక నిట్టి సందర్భమున నీ జాతీయము తగియుండును.

పాఠ్యభాగమున వజ్రనాభుడు కశ్యపునిమాట ననుసరించి స్వర్గము నాక్రమించుట మాని మఱలిపోయెను. ఆ యాపద యట్లు కడచిపోయినందుకు దేవేంద్రుఁడు మిక్కిలి సంతసించి తలపట్టుకొని చూచుకొనెననుట యెంతయు సముచితమై యున్నది.

# III. వ్యాకరణాంశములు

ప్ర. 9: క్రింది సమాసములకు విగ్రహవాక్యములు వ్రాసి, సమాసనామములు పేర్కొనుడు.

1. చండదానవుడు = తీవ్రస్వభావుడైన దానవుడు : వి॥ పూ॥ కర్మధారయము
2. మందిరద్వారము = మందిరముయొక్క ద్వారము : షష్ఠీ తత్పురుషము
3. సభామునిముఖ్యులు = సభయందలి మునిముఖ్యులు : సప్తమీతత్పురుషము
4. అంబుజనాభుడు = అంబుజము నాభియందు గలవాడు : బహువ్రీహి
5. ఒక దానవుడు = ఒక్కడైన దానవుడు : ద్విగు సమాసము

ప్ర. 10: క్రింది ప్రకృతులకు వికృతులు, వికృతులకు ప్రకృతులు వ్రాయుడు.

| ప్ర | వి | ప్ర | వి |
|---|---|---|---|
| ద్వారము | దోరము, దువారము | యజ్ఞము | జన్నము |
| రాక్షసుడు | రక్కసుడు | ఇచ్ఛ | ఇచ్చ |
| న్యాయము | నాయము | గర్వము | గరువము |
| ఆశ | ఆస | | |

ప్ర. 11: క్రిందివానిని విడదీసి సంధులను పేర్కొనుడు.

మత్ + మతి = మన్మతి : అనునాసికసంధి

అలౌకిక + అద్భుతము = అలౌకికాద్భుతము : సవర్ణదీర్ఘసంధి

మద + ఉద్ధతి = మదోద్ధతి : గుణసంధి

ప్ర. 12: క్రిందివాని యందలి వ్యాకరణ విశేషములను వివరింపుడు.

1. నీ పలికినట్లు = (నీవు పలికినట్లు) :- కర్తృపద ప్రథమకు షష్ఠియగు.
2. అరముపోసితి :-
   (a) ప్రథమమీది పరుషములకు సరళములు బహుళముగనగు.
   (b) లిఙ్లోట్లుల వకారంబునకు లోపంబు విభాషనగు.
3. ఏలితిచ్చుట = (ఏలితి + ఇచ్చుట) = ఏలితివి + ఇచ్చుట :- మధ్యమ పురుషక్రియలయం దిత్తునకు సంధియగు.
4. వచ్చుచునుండి :- ప్రథమేతర విభక్తి శత్రర్థ 'చు' వర్ణంబు లందున్న యుకారమునకు సంధి వైకల్పికము.
5. మంచితనపునటన = (మంచితనము + నటన) :- కర్మధారయ సమాసంబులందు 'ము' వర్ణకంబునకు 'బుంపు' అగు.

ప్ర. 13: క్రింది పాదమును గణవిభజన మొనర్చి యతి నిరూపించి యే పద్యపాదమో తెలుపునది.

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఇంతయుం | గని రా | జ్యహీన | తనైగు | మెచ్చటి | కేనియున్ |
| ర | స | జ | జ | భ | ర |

ఇ – ఏ లకు యతి చెల్లును. 11 వ యక్షరము యతిస్థానము. ఇది మత్తకోకిల పద్యపాదము. ఇందలి మొదటి గురువులను రెండు లఘువులుగఁ జేసిన తరలావృత్తమగును.

# ౬. తీర్థయాత్ర

## I. అర్థాదులు

1. సునాసీరసూనుండు = ఇంద్రునికుమారుఁడు – అర్జునుఁడు; నిమజ్జత్ = మునుఁగుచున్న; జన = జనులయొక్క; ఓఘ = సమూహమునుండి; ఉత్పతత్ = ఎగురుచున్న; పంక = పాపములనెడు; శంకా = సందేహమును; కర = కలిగించుచున్న; ఆత్మ = తనయొక్క; ఊర్మి = కెరటములయందు; నిర్మగ్న = మునిఁగిన; నీరేజ = పద్మముల యొక్క; రేఖా = సమూహమునుండి; ఉన్నమత్ = పైకెగురుచున్న; భృంగ = తుమ్మెద లచే; నేత్ర + ఉత్సవ + శ్రీని = కన్నులకు పండువు చేయుచున్న శోభగలదానిని; గంగాభవానిన్ = గంగాదేవిని; చూచెన్ = చూచెను.

తా :– తన కెరటములయందు పద్మములు మునుఁగుటచే అందలి తుమ్మెదలు పైకెగిరిపోవుచుండఁగా అవి తనయందు మునిఁగిన జనుల పాపములు వారిని వదలి పైకెగసిపోవుచున్నవో యన్నట్లు నేత్రోత్సవము చేయుచున్న గంగానదిని అర్జునుఁడు చూచెను.

2. తోయధి వరసీమంతినిన్ = సముద్రుని శ్రేష్ఠమైన భార్యను, అ + త్రి + జగత్ + దివ్యంతిన్ = ఆ మూఁడు లోకములను ప్రకాశింపఁజేయు దానిని, భాగీరథీ స్రవంతిని = గంగానదిని, సంతోష బాష్ప ధారలు = ఆనంద బాష్పధారలు, దొంతరలు కాన్ = పరంపరలు అగుచుండఁగా, చూచి, పొగడెన్, (కర్త పై పద్యములోని సునాసీర సూనుండు)

3. జాహ్నవీ = ఓ గంగానదీ, తేజ + అసహ్యన్ = కాంతిచేత సహింప శక్యముగాని వానిని, శరజన్మన్ = కుమారస్వామిని, అపర్ణ = పార్వతి, తా = తాను, సైరింపక + ఉండఁగా = సహింపలేకుండఁగా, భవత్ = నీ, గర్భంబునన్ తాల్చి =

భరించి, కాంచి=కని, అల=ఆ, నీహార+క్షమా+భృత్+కుమారీ+సాపత్న్యము= మంచుకొండయొక్క (హిమవంతునియొక్క) కుమార్తెయొక్క సవతి తనమును, కన్న = పొందిన, మోహపు+పురంధ్రీ+రత్నము = వలఁపుగలిగిన స్త్రీరత్నమవు, ఈవు+అ=నీవే, ఔదువు = అగుదువు : (శివునికిఁ బ్రియతమమైన భార్యవగుదువు అనిభావము.) కావేన్=అట్లుకావేని, సర్వజ్ఞుఁడు=శివుఁడు, తలపైన్=శిరస్సుమీద, నిన్ను, ఎక్కించుకోన్=ఎక్కించుకొనుట, ఏల ? = (ఏల ఎక్కించుకొనును ?)

తా :- పార్వతి మహాతేజస్సంపన్నుఁడైన కుమారస్వామిని గర్భమున భరింపలేక గంగలో విడిచెను. గంగ యాతనిని భరించెను. ఈ విధముగా పార్వతికి సపత్నియైన గంగ శివునికి అధిక ప్రీతి పాత్ర యయ్యెను. కావుననే శివుఁ డామెను శిరమున నెక్కించుకొనెను.

(శివుఁడు పార్వతితో సరససల్లాపములనుండ నటకు కపోత రూపమున నగ్ని వచ్చెను. శివబీజము అగ్నియందుఁ జొచ్చెను. అగ్ని దానిని భరించలేక గంగలో విడిచెనని పూర్వకథ. అదే యీ గ్రంథమున నిట్లు చెప్పఁబడినది.)

4. కల్లోలవతీ + మతల్లి = నదులలో శ్రేష్ఠురాలా, గంగా, తల్లి; ఆ తెల నిదొర=ఆ శివుఁడు; పెల్లు=అధికముగ; సెగన్+చల్లు+విసము=మంటల సెగ జిమ్ము కాలకూటమును; కుతిక, మోవన్, తిని=కంఠము నిండునట్లు గాఁదిని; బ్రతుకుట= జీవించియుండుట; నీ చల్లఁదనంబునన్, కాదే=నీ చల్లఁదనము వలననే కదా !

5. మా అవ్వా=మా తల్లీ; (పువ్వు+ఆరు+బోడివి+ఐ) పువ్వారుబోడివై= మనోజ్ఞురాలైన స్త్రీవై; సరి+వివ్వారు+అనన్ = (అతనికి) సాటియైనవా రెవ్వ రన్నట్లుగా; భీష్మున్, కాంచి=భీష్మునిఁగని; ఇంపు+ఒందితివి=శోభను గాంచితివి; అ+వావి=ఆ చుట్టరికమును; ఎఱుఁగుదువే=ఎఱుఁగుదువా ?; నను, పోషింపన్ = కాపాడుటకు; నీకున్, పాడి=న్యాయము; అగున్=అగును.

6. ఈగతిన్ = ఈవిధముగా; సకల, శుభంబులు, ఇమ్ము, అనుచున్; సన్నుతుల్=పొగడ్తలు; చేయన్=చేయఁగా; అస్రవంతిక=ఆ నది; దయన్, తెల్పెన్, పంచిన గతిన్=పంపిన విధముగా; ఉదంచత్=ప్రకాశించుచున్న; ఊర్మికానికర= కెరటముల సమూహమునందు; విలోల=చలించుచున్న; ఖేలత్=క్రీడించుచున్న; అళిన్=ఆడుతుమ్మెదలయొక్క; కలగాన=అవ్యక్త మధురగానములతో; లసత్= ప్రకాశించుచున్న; ప్రఫుల్ల=వికసించిన; హల్లక=చెంగలువల నెడి; సుఖడోలికా= సుఖకరమైన యూయలలయందు; విహృతి=విహరించుటయందు; లాలస=ఆసక్తి కల; బాలసమీరము=పిల్లగాలి; అయ్యెడన్=అక్కడ; చనుదెంచెన్=వీఁచెను.

7. చనుదెంచినన్=వీవఁగా (అపిల్ల గాలి); ఆ+జననాయకుఁడు=ఆరాజు-అర్జునుఁడు; హా (హాయి+అని=అనియైన చెప్పనగును)అని; అలరుచు=సంతసించుచు; విశారదున్=విశారదుని (అర్జునుని చెలికాఁడు) కని; ఈ, అనుకూల, మారుత, ఆగతి=ఈ అనుకూలమైన గాలియొక్క రాక; కనుఁగొనన్=చూడఁగా; ఆమోద సూచకంబయినదిగా=సంతోషమును సూచించునదై నదిగాదా! (9 పద్యములోని అనుచు క్రియ)

8. ఈ గంగా తీర్థము = ఈ గంగా జలము; తలన్ =తలమీఁద; చిలికిన వాఁడు; ఈశ్వరుండు=ఈశ్వరుఁడే, (తలను ధరించినవాఁ డీశ్వరుఁడే-అని యొక భావము; తలను జిలికినవాఁడు ఈశ్వరునంతటి గొప్పవాఁడగునని యొక భావము), చేరెఁడు=చెరెఁడునీటిని; లోఁగొఁగలిగినన్=లోనికిఁ గొనఁగలిగినచో; తరఁగలన్=కెరటములలో; తేలన్+కలిగినన్=తేలఁగలిగినచో (అందు మునుఁగఁ గలిగినచో); తత్+మహిమలు=ఆ మహిమలు; ఎన్నన్+కాన్+తరము+అగునె=గణింప శక్యమగునా ?

9. గంగానదిలో, మునుకలు = స్నానములు; ఒనరించుటకన్నన్, భాగ్యము+ఉన్నదే=భాగ్యమున్నదా; అనుచు, పరిజనములు=సేవకులు; కైలాగు+ఒసంగ = కైదండ యొసఁగఁగా; మును కలుగంగా = ముందరయగునట్లుగా దిగి; స్నాన+ఉన్ముఖుఁడై=స్నానమునకు సన్నద్ధుఁడై,

10. గుడాకేశుండు=అర్జునుఁడు; తమి=కోరిక; నిగుడన్ =అతిశయింపఁగా నదీ, విమల, వారిన్=ఆ నదియొక్క పరిశుద్ధమైన నీటియందు; అమరన్=ఒప్పునట్లు; ఆడుచున్, ఉంటన్=క్రీడించుచుండుటచే; తత్+కచా+మేచకము+ఐ=అతని జుట్టుచే నల్లనిదై; ఆ నది=ఆగంగ; యమునానదిన్, కూడిన, తోయమునాన్= నీరోయున్నట్లు; తనరెన్=ప్రకాశించెను; గంగానదినీరు ధవళము; యమునానదినీరు నీలము అని సంప్రదాయము.

11. నముచి + ద్విషత్ + తనయుఁడు = నముచి (యను రాక్షసుని) విరోధియైన యింద్రుని కుమారుఁడు (అర్జునుఁడు); ఆశ్రిత = ఆశ్రయించినవారికి; కల్ప, మహీ, రుహంబు, + అనన్=కల్పవృక్షమో అన్నట్లు; అచ్చటి, తైర్థిక= యాత్రికులైన; భూసుర, సంఘము, ఎల్ల=బ్రాహ్మణ సమూహమెల్ల; డెందాన= మనస్సున; మోదంబు చెందఁగన్ = సంతోషము నొందఁగా; ఎన్నియే=ఎన్నేని; దానములు; ఒనర్చి=చేసి; దృఢవ్రతచర్య=స్థిరమైన నియమముయొక్క క్రియతో; నిత్యమున్=ప్రతిదినమును; తానము చేయుచున్=స్నానమొనర్చుచు; అందు=అచ్చట; హరికథాశ్రవణంబు, ఒనరించుచు, ఉండెన్=విష్ణుకథల వినుచుండెను.

# III. ప్రశ్నోత్తరములు

ప్ర. 2: "తీర్థయాత్ర" యను మీ పాఠ్యభాగ మే గ్రంథములోనిది? కవి, కాలము-ఇతర గ్రంథములు - తెలుపుఁడు.

జ.: తీర్థయాత్రయను పాఠ్యభాగము చేమకూర వేంకటకవి రచించిన విజయవిలాసమను ప్రబంధమునందలి ప్రథమాశ్వాసము లోనిది. వేంకటకవి క్రీ.శ. 17 వ శతాబ్దము పూర్వార్థమున తంజావూరు పాలకుఁడైన రఘునాథభూపాలుని యాస్థానకవియై యుండెను. యీ గ్రంథము నా ప్రభువునకే యంకితమొనర్చెను. ఈతని మరియొక ప్రబంధము - సారంగధర చరిత్రము.

ప్ర. 2: వేంకటకవి కవిత్వవైభవ మెట్టిది?

జ.: పాఠ్యగ్రంథములోని పరిచయములో మూఁడవ పేరా చూడుడు.

ప్ర. 3: గంగాభవాని యెట్లు నేత్రోత్సవము గూర్చుచున్నది?

జ.: 1 వ పద్యము తాత్పర్యమును జూడుఁడు.

ప్ర. 4: శివుఁడు గంగను తలపై నెక్కించుకొనుటకుఁ గారణమేమని కవి యూహించెను?

జ.: మహా తేజస్సుతో సహింప శక్యముగానివాఁడుగా నున్న కుమారస్వామిని పార్వతి భరింపలేకపోయెను. గంగాదేవి ఆతనిని తన గర్భమున ధరించి, శివునికి పార్వతికంటె నధికురాలైన వలపుల భార్యయైనది. కావుననే శివుఁడామెను తలపై నెక్కించుకొనెను. అని కవి చమత్కరించెను.

ప్ర. 5: అర్జునునకు గంగకుఁగల వావి యెట్టిది?

జ.: శంతనుని కుమారుఁడు విచిత్రవీర్యుఁడు. విచిత్రవీర్యుని కుమారులు ధృతరాష్ట్ర, పాండురాజులు. పాండురాజు కుమారుఁడు అర్జునుఁడు. గంగాదేవి శంతనునిభార్య. కాఁగా నర్జునుఁడు గంగకు మునిమనుమఁడు,

ప్ర. 6: గంగా మహత్త్వమెట్టిది?

జ.: గంగానదీమతల్లి జలమును తలపైఁ జిలికిన మాత్రమున నెవ్వఁడైన నీశ్వరుఁడంతవాఁడగును. చేరెఁడు జలమును గ్రోలినను, ఆ నదీతరంగములలో గ్రుంకులిడినను ఆ మహిమ గణింప శక్యముగాదు.

ప్ర. 7: అర్జునుఁడు గంగాతీరమున నెట్లు కాలము గడిపెను?

జ.: అచ్చటి తైర్థిక బ్రాహ్మణులకుఁ గల్పవృక్షమువలె ననేక దానములొనర్చుచు, స్థిరనిష్ఠతోఁ బ్రతిదినము గంగాస్నానము చేయుచు, విష్ణుకథలాకర్ణించుచు అర్జునుఁడు గంగాతీరమునఁ గాలమును బుచ్చెను.

ప్ర. 8: "యమునానదిఁగూడిన తోయమునా-తనరె" సందర్భపూర్వకముగ దీనిని వివరింపుఁడు.

జ.: కోరిక దీరునట్లుగా నర్జునుఁడు గంగానదిలోఁ గ్రీడించుచు స్నానము చేయుచుండెను. ఆతని దీర్ఘనీలకేశపాశము స్వచ్ఛగంగాజలమునఁ దేలుచుండఁగా నా ప్రదేశమున యమునా జలము వచ్చి కలిసెనో యన్నట్లుండెనని కవి యుత్ప్రేక్షించెను. గంగాజలము స్వచ్ఛముగను, యమునాజలము కృష్ణవర్ణముగా నుండుట ప్రసిద్ధము. తనరె- ఈ తనరినది గంగాజలము.

ప్ర. 9: "తమినిగుడ ..." ఇత్యాది పద్యమునందలి యలంకారమును దెల్పుఁడు.

జ.: ఈ పద్యమున నుత్ప్రేక్షాలంకారము గలదు. ధర్మసామ్యము చేత ఉపమేయమును ఉపమానముగా భావించిన ఉత్ప్రేక్ష యగును.

ఇచ్చట అర్జునుని కేశములచే నాక్రమింపఁబడిన గంగా జలము ఉపమేయము. యమునాజలములోఁగూడిన గంగా జలము ఉపమానము. నలుపు తెలుపు కలిసినట్లుండుట యీ యుపమానముయొక్క ధర్మము. ఆ ధర్మము ఉపమేయము

నందున్నట్లు భావింపఁబడుచున్నది. కావున నిది యుత్ప్రేక్షాలంకారము.

(6 పద్యములోఁ గూడ ఉత్ప్రేక్షాలంకారము గలదు.)

## III. వ్యాకరణాంశములు

ప్ర. 10: క్రిందివానికి విగ్రహవాక్యములు వ్రాసి యవి యే సమాసములో పేర్కొనుఁడు.

1. నేత్రోత్సవము=నేత్రములకు ఉత్సవము : షష్ఠీ తత్పురుషము
2. ఆమోదసూచకము=ఆమోదమును సూచించునది : ద్వితీయాతత్పురుషము
3. పురంధ్రీరత్నము=పురంధ్రులలో రత్నము : షష్ఠీ తత్పురుషము
4. పూఁబోఁడి=పూవువంటి మేను కలది : బహువ్రీహి
5. బాష్పధారలు=బాష్పములయొక్క ధారలు : షష్ఠీ తత్పురుషము
6. యమునా నది=యమున అను నది : సంభావనా పూర్వపద కర్మధారయము
7. కచామేచకము=కచముచేత నంతట మేచకమైనది: తృతీయా తత్పురుష

ప్ర. 11: క్రింది రూపములయందలి వ్యాకరణ విశేషము తెలిఁగింపుఁడు.

1. పువ్వారుఁబోఁడి :- బహువ్రీహిని స్త్రీవాచ్యంబగుచో ఉపమానంబు మీఁది 'మేను' నకు 'బోడి' యగు.
2. మోహపుఁ బురంధ్రి = మోహము+పురంధ్రి :- భర్తృహరి సుభాషిత పద్యముల నోట్సులో 8 వ పద్యమునఁగల "నీచపుఁ బ్రాణి" రూప సాధనవలె దీనికిఁ గూడ చూచుకొనునది.
3. డెందాన = డెందము + న :- లు, ల, న లు పరంబగునపు డొకా నొకచో ముగాగమంబునకు లోపంబును, తత్పూర్వస్వరంబునకు దీర్ఘంబును విభాషనగు.
4. చేరెఁడు = చేర + ఎఁడు :-
   (a) పరిమాణార్థంబున 'కే' కత్వంబునం 'డెఁడు' వర్ణకంబగు.
   (b) అంద్వవగాగమంబులం దప్ప నపదాది స్వరంబు పరంబగునపుడు అచ్చునకు సంధియగు.

ప్ర. 12: క్రింది ప్రకృతులకు వికృతులు, వికృతులకుఁ బ్రకృతులు వ్రాయుఁడు.

| ప్ర | వి | ప్ర | వి |
|---|---|---|---|
| శ్రీ | సిరి | కథ | కత |
| విషము | విసము | స్నానము | తానము |
| సుఖము | సుకము | రత్నము | రతనము |
| సంతోషము | సంతసము | | |

ప్ర. 13: క్రింది శబ్దములకు వ్యుత్పత్త్యర్థము తెలియఁగింపుఁడు.

సీమంతిని :- పాపట కలది = స్త్రీ

సునాసీరుఁడు :- మంచి సేనాముఖము గలవాఁడు = ఇంద్రుఁడు

కల్లోలవతి :- కల్లోలము కలది = నది

గుడాకేశుఁడు :- నిద్రకు ఈశుఁడు = అర్జునుఁడు

ప్ర, 14 : క్రింది పాదమునకు గణవిభజనమొనర్చి యతి నిరూపించి ఏ పద్యపాదమో తెలుపుఁడు :

| "సునాసీ | రనూనుం | డు నూచెన్ | నిమజ్జత్" |
|---|---|---|---|
| య | య | య | య |

పాదమునకు నాలుగు య గణములు. 1-8 అక్షరములకు యతి మైత్రి. ఇది భుజంగ ప్రయాత వృత్తము.

# ౨. మూర్ఖపద్ధతి

## I. అర్థాదులు

1. బోద్ధలు=బోధించువారు; మత్సర = ఈర్ష్యచేత; పూర్ణ = నిండిన; మతులు=మనస్సుకలవారు; ప్రభువులు=రాజులు; ఎన్నన్=గణింపఁగా; ప్రబల=అధికమైన; గర్వ=గర్వముచే; విదూషితుల్=దూషింపఁబడినవారు; ఇతరమనుజులు, అబోధ + ఉపహతులు = అజ్ఞానముచేఁ గొట్టఁబడినవారు; కాన = కావున; సుభాషితంబు=నీతి (మంచిమాట); భావమున=మనస్సునందు; జీర్ణమయ్యె=జీర్ణించి పోయెను (హరించి పోయెను.)

2. తా:- తెలియని మనుష్యునకు శ్రమలేకుండఁ దెలుప వచ్చును. తెలిసినవానికి మిక్కిలి సుఖముగఁ దెలుపవచ్చును. కాని తెలిసియుఁ దెలియనివానికి (మూర్ఖునికి) నచ్చఁజెప్పుటకు బ్రహ్మకుఁ గూడ వశముగాదు.

3. మకర + ముఖ + అంతరస్థము + అగు=మొసలినోటి లోపలి భాగమునం దున్నదియగు; మానికమున్=మాణిక్యమును; పెకలింపవచ్చున్=బలవంతముగా వెలికి లాగవచ్చును; పాయక=విడువక; చలత్ + ఊర్మికా + నికరము + ఐన = చలించుచున్న కెరటముల సమూహము గలది యగు; మహత్ (హా) + ఉదధిన్=మహాసము

ద్రమును; దాఁటవచ్చు; సర్పమునైనన్ = త్రాచుపామునైనను; మస్తకమునన్ = శిరస్సునందు పూవుదండవలె; ధరింపవచ్చు; (కాని) మచ్చిక + ఘటియించి = కూర్మి గూర్చి; మూర్ఖజనచిత్తమున్ = మూఢజనుల మనస్సును; తెల్పన్ = బోధించుటకు; ఏరికిన్ = ఎవరికైనను; అసాధ్యము = సాధ్యము కానిది.

4. తివిరి = ప్రయత్నించి; తవిలి = అనుసరించిపోయి; సాధింపవచ్చున్ = సంపాదింపవచ్చును.

తా :– ప్రయత్నించి యిసుకనుండియైనఁ దైలమును బిండవచ్చును. అనుసరించిపోయి యెండమావులలోనైన నీరు ద్రావవచ్చును. తిరిగి తిరిగి కుందేటికొమ్ము సాధింపవచ్చును. (ఇట్టి అసాధ్యకార్యములనైనఁ జేయవచ్చునుగాని) మూర్ఖుల మనస్సు ననురక్తముగాఁ జేయ శక్యముగాదు. (అనఁగా నిది పై కార్యములకంటె అసాధ్యమని భావము).

5. ఈ + ధరణిన్ = ఈ భూమియందు; ఎవ్వఁడు; సుధా + ధారా + అనుకార + ఉక్తులన్ = అమృతధారల ననుకరించు మాటలచే; మూర్ఖులన్ + తెల్పన్ = మూర్ఖులకు బోధించునో (బోధింప యత్నించునో); వాఁడు; కరిరాజున్ = ఏనుఁగుల రాజును (గజశ్రేష్ఠమును); బిస + తంతు + సంతతులచేన్ = తామర తూండ్లలోని దారముల సమూహముచే; కట్టన్ = కట్టివైచుటకు; విజృంభించున్ = చెలరేఁగును (ప్రయత్నించును); శిరీషపుష్పములచేన్ = దిరిసెన పూవులచే; ఉరువజ్రంబు = పెద్ద వజ్రమును; భేదింపన్ = పగులఁగొట్టుటకు; ఊహించున్ = ఆలోచించును; లవణ + అబ్ధికిన్ = ఉప్పు సముద్రమునకు; తీపు + రచింపన్ = తీపి కలిగించుటకు; మధు + కణంబున్ + చిందన్ = తేనె చుక్కను చిలుకుటకు; యత్నించును. (అనఁగా మూర్ఖులకు నచ్చఁజెప్పఁ జూచుట, ఆ యా యసాధ్యకార్యముల నా యా విధముల సాధింపఁ జూచుటవలె వ్యర్థప్రయత్నమని భావము.)

6. కమలభవుఁడు = పద్మమునందుఁ బుట్టినవాఁడు (బ్రహ్మ), స్వవశము = తన వశము నందుండునది, హితము = మేలు గూర్చునది, మూఢతా + ఆచ్ఛాదనంబు = మూఢతను గప్పిపుచ్చునదిగాను, ఈగతిన్ = ఈవిధముగా, నిర్మించెన్ = సృష్టించెను (దీనికిఁ గర్మ 'మౌనము'), మూఢమానవులకు = మూఢులైన మనుష్యులకు, సర్వ + విదులు + అగు + సుజనుల + సభలలోన = అన్నియుఁ దెలిసినవారగు సుజనుల సభలలో, మౌనమె = మాటాడకుండుటయె, విభూషణము = అలంకారము, (అనఁగాఁ బండితులున్న సభలలో మూఢుఁడు మౌనము వహించుటే గౌరవాస్పదము. లేకున్నఁ బరిహాసము కలుగునని భావము.)

7. ఈ పద్యమున నేను అను కర్తృపదమును దెచ్చి పెట్టుకొనవలెను. తొల్లి=పూర్వము, మునుపు, తెలివి+ఒకింత+లేనియెడ=తెలివి కొంచెమైన లేనప్పుడు, కరిభంగి=ఏనుఁగువలె, దృప్తుఁడనై=గర్వించినవాఁడనై, సర్వము+ఎఱ+తెలిసితిని+అంచు=అన్నియుఁ దెలిసికొంటిని అనుచు, గర్వితమతిన్=గర్వముఁ జెందిన మనస్సుతో. విహరించితిన్=సంచరించితిని, ఇప్పుడు, ఉజ్జ్వలమతులు+ఐన+పండితుల సన్నిధిన్ = ప్రతిభావంతులైన పండితులదగ్గర, ఇంచుక బోధశాలినై=కొంచెము బోధకలవాఁడనై, తెలియనివాఁడనై = నాకేమియుఁ దెలియదను భావము కలవాఁడనై, మెలఁగితిన్, నితాంత + గర్వమున్ = అధికమైన (పూర్వపు) గర్వముకూడ, గతము+అయ్యెన్=పోయెను.

(విశేషము :- ఏమియుఁ జదువుకొననప్పుడు చదువులలోతుపాతులు తెలియక సర్వము నేనెఱుఁగుదునను గర్వముండును. పండితుల దగ్గరఁజేరి చదువుకొనుట ప్రారంభించిన పిదప, అంతవఱకుఁదా నెఱిఁగినది అత్యల్పమనియు, ముందు తెలిసికొనఁదగినదే అపారముగ నున్నదనియు గ్రహించును. అట్లు గ్రహించినంతనే వెనుకటి గర్వము పోవును.)

8. క్రిమి+సముదాయ+సంకులము=పురుగుల సమూహముతో నిండినది; కేవల నింద్యము=పూర్తిగా నిందింపఁదగినది; పూతి, గంధ హేయమును=దుర్గంధముచే విడువఁదగినది; నిర్+ఆమిషంబును=మాంసము లేనిదియునగు; ఖర+అంగ+భవంబు+అగు=గాడిద శరీరమున జనించినదగు; ఎమ్మున్=ఎముకను; తాన్, నములుచు, పక్క, చెంతన్+ఉన్న=సమీపమున నున్న; సురనాథుని=దేవేంద్రుని; కన్గొని=చూచి; సిగ్గుఁజెందదు; నీచపుఁబ్రాణి=నీచజంతువు; ఏ+ఎడన్=ఎక్కడనైనను; నిజ+స్వభావము=తన స్వభావము; అల్పము+అని=నీచమని; తలంపదు. (నీచులు నీచకార్యములందే ఆసక్తికలవారై, పెద్దల యెదుటనైనను ఆ కార్యమును మానరు. నీచులు తమ స్వభావమునందలి అల్పత్వమును గ్రహింపరు అని భావము.)

9. గంగా+కూలంకష=గంగానది; ఆకాశంబునన్+ఉండి=ఆకాశమునుండి; శంభుని శిరంబు=ఈశ్వరుని శిరమును; అందుండి=ఆ శిరస్సునుండి; శీతాద్రి=చలిమలను (హిమవత్పర్వతము); సుశ్లోకంబు+ఐన=కీర్తిమంతమైన; హిమ+అద్రి+నుండి=హిమవత్పర్వతమునుండి; భువి=భూమిని; భూలోకంబునందుండి; అస్తోక+అంబోధి=అపారమైన సముద్రమును; పయోధినుండి=సముద్రమునుండి; పవన+అంధః+లోకమున్ = గాలియే యాహారముగాగల నాగుల లోకమును; చేరెన్=చేరెను; (ఇట్లు) వివేక+భ్రష్ట+సంపాతముల్=జ్ఞానమునుండి జాఱినవారిపాట్లు; పెక్కుభంగులు=పలురకములు - (గా నుండును)

10. అగ్ని = నిప్పును, జలమునన్=నీటిచేతను, చండమయూఖుని = సూర్యుని, ఛత్రమునన్=గొడుగుచేతను, వృష, గర్దభంబులన్=ఎ , గాడిదలను, దండతాడనంబులన్ = కఱ్ఱతోఁ గొట్టుటచేతను, పొల్పు+అగు. మత్త+కరి+ఇంద్రమున్=స్థైర్యముతోనున్న మదించిన శ్రేష్ఠమైన ఏనుఁగును, సృణిన్=అంకుశము చేతను, చెలఁగెడు రోగము=వ్యాపించుచున్న రోగమును, ఔషధముచే=మందుచేతను, విషమున్, తగు, మంత్ర, యుక్తిన్=ఉచితమైన మంత్రోపాయము చేతను, ఇమ్ములన్=సుఖముగా, తఁగన్=ఒప్పునట్లు, చక్కఁజేయనగున్=చక్కఁబెట్టవచ్చును (కాని) మూర్ఖుని మూర్ఖత, మాన్పవచ్చునే=పోగొట్ట సాధ్యమగునా? (కాదు).

## II. ప్రశ్నోత్తరములు

ప్ర. 1 : భర్తృహరి సుభాషితములను రచించిన కవులెవరు? మీ చదివిన మూర్ఖపద్ధతి యే కవి రచన? ఆతని కాలము, నివాసము, ఇతర గ్రంథములు పేర్కొనుఁడు.

జ. : సంస్కృతమున భర్తృహరి రచించిన సుభాషిత త్రిశతిని (మూడు శతకములను) ఎలకూచి బాలసరస్వతి, ఏనుఁగు లక్ష్మణకవి, పుష్పగిరి తిమ్మన – అను ముప్వురు కవులు ఆంధ్రీకరించిరి.

పాఠ్యభాగమైన మూర్ఖపద్ధతి యేనుఁగు లక్ష్మణకవి రచించిన నీతిశతకమను మొదటి శతకములోనిది. ఈ కవి 18 వ శతాబ్దమువాఁడు. ఈతఁడు నేటి తూర్పుగోదావరి మండలము వాఁడు. రామేశ్వర మహాత్మ్యము, రామవిలాసము, గంగా మహాత్మ్యము, సంస్కృత సూర్యశతకము మున్నగు గ్రంథములను రచించెను.

ప్ర. 2 : సుభాషితము భాషయునందే జీర్ణమగుటకు హేతువేవి?

జ. : బోధించు వారీర్ష్యాళువులు. ప్రభువులు గర్వముచే దూషితులైనవారు. ఇతర మనుజులు అజ్ఞానహతులు. ఇఁకఁ జెప్పువారు వినువారుకూడ లేక సుభాషితము మనస్సునందే జీర్ణమైనది. అని భర్తృహరి యభిప్రాయము.

ప్ర. 3 : తెలిసినవానికిఁ, దెలియని వానికిఁ, తెలిసియుఁ దెలియనివానికి బోధించుట లోని భేదమేమి ?

జ. : తాత్పర్యమును జూచునది.

ప్ర. 4 : మూర్ఖులమనస్సును రంజించుటకంటె యే యసాధ్యకార్యములను సాధింప వచ్చును ?

జ. : 3,4 పద్యముల భావమును జూడుఁడు.

ప్ర. 5 : మూర్ఖుని సుధాధారానుకారోక్తులచేఁ దెల్ప నూహించువాఁ డెట్టివాఁడు ?

జ. : మూర్ఖునికి నచ్చఁజెప్పఁజూచువాఁడు ఏనుఁగును తామరతూండ్ల లోని దారములతోఁ గట్టఁ జూచునట్టియు, వజ్రమును శిరీష కుసుమములతో భేదింప యత్నించు నట్టియు, సముద్రపునీటి యుప్పఁదనమును ఒక తేనెచుక్క చింది పోఁగొట్టఁ జూచు నట్టియు, మనుష్యుఁడగును. అనఁగా నివి యెంత వ్యర్థప్రయత్న ములో మూర్ఖునికిఁ జెప్పఁజూచుటయు నంత వ్యర్థమే అని భావము.

ప్ర. 6 : బ్రహ్మ మౌనము నెట్లుగా సృజించెను ? దానివలన నెవరి కెట్టి ప్రయో జనము కలదు ?

జ. : బ్రహ్మ మౌనమును స్వవశమై యుండునది, మేలొనఁగూర్చు నది, మూఢతను గప్పిపుచ్చునదిగా సృజించెను. సర్వము నెఱిఁగిన పండితులున్న సభలో మూఢునికి మౌనమే యలం కారముగా నుండఁదగియున్నది. అనఁగా నట్టి సభలలో మూఢునికి గౌరవము మౌనమువలన మాత్రమే చేకూరునని భావము.

ప్ర. 7 : జ్ఞానము కలిగినప్పటి స్థితికిని నజ్ఞానావృతమైన స్థితికిని భేదమేమి ?

జ. : ఈ పద్యము క్రింద వ్రాయఁబడిన భావమును జూడుఁడు.

ప్ర. 8 : "అల్పమని నిజస్వభావము దలంపదు నీచవుఁ బ్రాణియెయ్యెడన్" నిద ర్శన పూర్వకము వివరింపుఁడు.

జ. : కుక్క యొక నీచజంతువు. అది, అంతకంటె నీచమైన గాడిద యెముకను, మాంసము లేక దుర్గంధయుతమై దూష్యమైన

దానిని, నమలుచు, నట్టి నీచపుఁబని చేయుచున్నందుకు, సమీపమున దేవేంద్రునంతటి పెద్దలున్నను, వారిని జూచి సిగ్గుపడదు. తన స్వభావమింత యల్పముగ నున్నదని అది యెన్నఁడును తలంపదు. అనఁగా నా యల్పత్వమును విడనాడఁ జాలదు. అల్పుల స్వభావ మిట్లే యుండును.

ప్ర. 9 : "పెక్కుభంగులు వివేకభ్రష్ట సంపాతముల్" వివరింపుఁడు.

జ. : వివేకము గోల్పోయిన వారి పాట్లు పెక్కు తెఱంగులై యుండును. గంగానది యాకాశమునుండి శివుని శిరస్సును, అందుండి హిమవత్పర్వతమునను, అచటినుండి భూమిని, భూలోకమునుండి సముద్రమును, అటనుండి నాగలోకమును ఇట్లు పలురకములైన పోకడలు పోయినది. వివేకభ్రష్టుల ప్రవర్తనకూడ యిట్లే స్థిరత్వములేక అనేక విధములుగా నుండును.

ప్ర. 10 : "ఇమ్ముల నందఱఁ జక్కఁజేయనగు" దేనిని దేనిచేఁ జక్కఁజేయ నగును, దేనిని గాదు ?

జ. : అగ్నిని జలముచేతను, సూర్యుని గొడుగుచేతను, వృషగార్దభములను దండతాడనములచేతను, మదించిన యేనుఁగును అంకుశముచేతను, రోగము నౌషధముచేతను, విషమును మంత్రముచేతను వారించి చక్కఁజేయనగునుగాని మూర్ఖుని మూర్ఖత మాన్పఁగాదు.

ప్ర. 11 : 8, (లేక) 9 పద్యములలోని అలంకారమును వివరింపుఁడు.

జ. : 8 వ పద్యము :- ఇందు అర్థాంతరన్యాసాలంకారము గలదు. ఇందు కుక్క చేయు నీచపుఁబనులన్నియు విశేషవిషయములు. ఇవి, "అల్పుని నిజస్వభావముఁ దలంపదు నీచపుఁ బ్రాణి యెయ్యెడన్" అను సామాన్య విషయముచే సమర్థింపఁబడినవి.
9 వ పద్యము :- ఇందు అర్థాంతరన్యాసాలంకార మున్నది. గంగానది పడిన పాటులు విశేష విషయములు. అవి "పెక్కు

భంగులు వివేకభ్రష్ట సంపాతముల్" అను సామాన్య విషయముచే సమర్థింపఁబడినవి.
ఇట్లే 10 వ పద్యమునఁగూడ ఊహించునది.

## III. వ్యాకరణ విశేషములు

ప్ర. 12 : క్రింది సమాసములకు విగ్రహవాక్యములువ్రాసి సమాస నామములఁ జేర్కొనుఁడు :

1. అబోధోపహతులు : అబోధముచేఁ గొట్టఁబడినవారు : తృతీయా తత్పురుషము
2. అసాధ్యము : సాధ్యముగానిది : నఞ్ తత్పురుషము
3. కుందేటికొమ్ము : కుందేలుయొక్క కొమ్ము : షష్ఠీతత్పురుషము
4. చండమయూఖుఁడు : చండమైన మయూఖములు గలవాఁడు (తీవ్రమైన కిరణములు కలవాఁడు) : బహువ్రీహి
5. వివేకభ్రష్టులు : వివేకమువలన భ్రష్టులు : పంచమీతత్పురుషము
6. నీచపుఁబ్రాణి : నీచమైన ప్రాణి : విశేషణపూర్వపద కర్మధారయము
7. బ్రహ్మదేవుఁడు : బ్రహ్మయను దేవుఁడు : సంభవనాపూర్వపద కర్మధారయము
8. గంగాకూలంకష : గంగయను కూలంకష ,, ,,

ప్ర. 13 : క్రింది రూపములయందలి వ్యాకరణ విశేషములను దెలుపుఁడు :

1. నీచపుఁబ్రాణి : నీచము+ప్రాణి అని యుండఁగా కర్మధారయంబులందు మువర్ణకంబునకుం బుంపులగునను సూత్రముచేత నీచపు+ప్రాణి అగును. పిమ్మట సమాసంబుల నుదంతంబులగు స్త్రీ సమంబులకుం, బుంపులకుం, బరుష సరళంబులు పరంబు లగునపుడు నుగాగమంబగు అను సూత్రముచేత నీచపు+ను+ప్రాణి అయినది. ఆ పిమ్మట "ద్రుత ప్రకృతికముమీఁది పరుషములకు సరళములగు" అను సూత్రముచే నీచపు+ను+బ్రాణి అగును. పిదప "ఆదేశసరళములకు ముందున్న ద్రుతమునకు బిందుసంశ్లేషములు విభాషనగు" అను సూత్రముచే నిచ్చట ద్రుతస్థానమున అర్ధబిందువువచ్చి "నీచపుఁబ్రాణి" అనురూప మేర్పడుచున్నది.

2. ఏయ్యెడన్ = (ఏ+ఎడన్)

(a) సంధిలేనిచోట స్వరంబుకంటెం బరంబయిన స్వరంబునకు యడాగమంబగు. ఏ+య్+ఎడన్=ఏ+యెడన్

(b) ఈపై ద్రికసంధికిఁ జెప్పఁబడిన మూఁడుసూత్రములు అన్వయించును.

(c) లేనియెడ=లేని+ఎడ

పై "సంధిలేనిచోట–" ఇత్యాది సూత్రముచే యడాగమమువచ్చి లేని+య్+ఎడ=లేనియెడ అగును.

(d) నీరు ద్రావవచ్చు (నీరు+త్రావవచ్చు) ప్రథమమీఁది పరుషములకు గ సడ దవలు బహుళముగనగు = నీరుద్రావవచ్చు.

ప్ర. 14: క్రింది ప్రకృతులకు వికృతులు, వికృతులకుఁ బ్రకృతులు వ్రాయుఁడు.

| ప్ర | వి | ప్ర | వి |
|---|---|---|---|
| అగ్ని | అగ్గి | ఆకాశము | ఆకసము |
| గర్వము | గరువము | మూర్ఖుఁడు | మొఱకు |
| మాణిక్యము | మానికము | బ్రహ్మ | బమ్మ |
| సుఖము | సుగము | యత్నము | జతనము |
| దేవుఁడు | దయ్యము | మత్సరము | మచ్చరము |

ప్ర. 15: క్రిందివానికి వ్యుత్పత్త్యర్థములను వ్రాయుఁడు :

కూలంకష :– ఒడ్డుల నొఱయునది = నది
చండమయూఖుఁడు – తీవ్రమైన కిరణములు గలవాఁడు = సూర్యుఁడు
అంభోధి :– నీటికి ఉనికిపట్టైనది = సముద్రము
కమలభవుఁడు :– కమలమునందుఁ బుట్టినవాఁడు = బ్రహ్మ
సురనాథుఁడు :– దేవతలకు రాజు = ఇంద్రుఁడు
పవనాంధసులు :– గాలియే ఆహారముగా గలవారు = నాగులు

# ౮. పుస్తక విక్రయము

## I. అర్థాదులు

1. ఆరయన్=క్షేమమును విచారించిచూచుటకు.

తా :– ఈ భూమిమీఁదఁ గోసలరాజునకు సాటివచ్చువారు లేరు. అతఁడు పిన్నవారిని తల్లివలె తండ్రివలె నారయును; ఏమియు లేని బీదవారి కాతఁడే యిల్లు ముల్లె కూడ. (సుఖములను చేకూర్చువాఁడు.)

2. పతి=రాజు; కోసలు=కోసలుఁడు (కోసలరాజు); మండుచు జచ్చున్= మిక్కిలి వ్యథఁ జెందుచుండును.

తా. కాశీరాజు కోసలాధిపుని గూర్చిన కథలువిని లోకులాతని తనకంటె నధికుఁడని చెప్పుకొనుచుండుటకు మన మెఱియ మిక్కిలి బాధపడుచుండును.

3. ఎవ్వని గద్దె=ఎవ్వని సింహాసనము; నా దిగువనే యగునో=నాకంటె క్రిందిదే యగునో (ఎవఁడు నాకు సామంతుఁడో లేక నాకంటె నన్నింటఁ దక్కువ వాఁడో); అలవానిదానమే=అట్టివాని దానమే; ఎవ్వరికి+ఏని+ఇంత+అగునె=ఎవరికైన నింత యధికముగాఁ బొగడఁదగునా? ఆహా=ఓహో; దయ = (ఆతనిదని చెప్పఁబడుచున్న) దయ; దబ్బర=అబద్ధము; ఈవి = (ఆతనిదని చెప్పబడుచున్న) దాతృత్వము; బొంకు=అసత్యము; మనంబునన్+కనిన=మనస్సునం దాలోచించిన; ఇవ్వి=ఆతని దయాదాతృత్వములను గూర్చిన కథలు; ఎంతయున్, కల్ల=మిక్కిలి అబద్ధము; ఇది+ఎల్లన్=ఈ విషయమంతయు (ఆరాజునుగూర్చి ప్రజలు చెప్పుకొనున దెల్ల); కేవలంబు=సంపూర్ణముగా, ఆ+విభుఁడు = ఆ కోసలరాజు; ఏను+అనంగ= నేననఁగా; హృదయంబునన్ =మనస్సునందు; పెంచిన=వృద్ధిచేసికొన్న; మచ్చరంబు సూ = ఈర్ష్యయే సుమా !

4. కృపాణము = ఖడ్గము, పూనుము = ఆయత్తపఱుపుము (సిద్ధము చేయుము), వాత్సల్యము=ప్రీతియో ! (స్నేహమో) ఇచ్చట వాత్సల్య శబ్దమునకు వ్యతిరేకార్థము చెప్పవలెను. ఎంత మచ్చరమో అని ధ్వని.

తా:- తాను దానకర్ణుఁడై నాఁడఁట! సేనాపతీ! ఖడ్గమును ధరింపుము; సైన్యము సిద్ధము చేయుము; పాపము వానికి నాపై నెంత వాత్సల్యమో! (చూతము యుద్ధమునకుఁ బోదము)

5. యుద్ధమునఁ గోల్పడి=యుద్ధమున నోడిపోయి, ఆవాసము=నివాసము, గృహము, కలాఁడో=కలవాఁడో.

తా:- కోసలరాజు యుద్ధమున నోడిపోయి, రాజ్యమును గృహమును విడిచిపోయి మహారణ్యము పాలయ్యెను. కాశీరాజాతని సింహాసనమెక్కి సభ్యులనుజూచి, యెవ్వడు (రాజ్య) లక్ష్మిని రక్షించుకొను ఆధిక్యము కలవాఁడో దానము చేయుటకును వాఁడే తగును అని నవ్వెను. (అనఁగా, కోసలరాజిపుడు లక్ష్మిని రక్షించుకొనలేక

పోయెను. ఆతని దాతృత్వ మే పాటిది? లక్ష్మిని నేను పెంపొందించు కొంటిని కనుక దానముచేసిన నేనే చేయవలెను. అట్టి నాదే దాతృత్వము-అని కాశీరాజు తాత్పర్యము)

6. దారుణ రాహువు=భయంకరమైన రాహుగ్రహము; ధర్మువు=ధర్మము; ఘోషిలిరి=ధ్వని చేసిరి.

తా :- సభ్యులందఱు రాజుమాటలను విని "అక్కట, భయంకరమైన రాహుగ్రహము గ్రహరాజగు చంద్రునిగూడ గ్రమింగును. (ఈ భయంకరుఁడైన కాశీరాజు మనరాజు రాజ్యమును హరించుటయే కాక యాతని ప్రాణములనుగూడఁ గొనునని ధ్వని) లక్ష్మి బలవంతుని బాహువునే పొందఁగోరునుగాని, ధర్మమును జూడదు. మేమిట్లు మా తండ్రినిఁ (తండ్రియట్టి వానిని) గోల్పోయితిమి. అని ఏక కంఠ్యమున ధ్వని చేసిరి. (విచారించిరి)

7. ఏరు=ఎవరు; జగత్+బంధువులు=లోకమునకుఁ జుట్టములో; రిపులో=శత్రువులో; వదనము=ముఖము; ఆరయఁగారాదు=చూడఁగూడదు.

తా :- లోకబాంధవులనఁదగు పరోపకారపరుల కెవరు శత్రువులో వారి ముఖము చూడరాదు అని వెంటనే పది దిక్కులయందు మ్రోగెను. (నగరప్రజలందఱు ఘోషించిరి).

8. వెసన్=శీఘ్రముగా, చింత=విచారము - (ఆలోచన)

తా:- కాశీరాజదివిని కోపమునొంది - నగరప్రజలకింత చింత యేల? ఆ రాజు పోయిన నేను లేనా? ఇఁక నెవ్వరికోసమేడ్తురు.

9. ఓయి, అమాత్య, వీర్య=ఓయి మంత్రిశేఖరా; అక్కట; అతడు=కోసలరాజు; ఓడియు; నన్నునున్; గెలుచునోటు=గెలుచును గాఁబోలును; శత్రుశేషముల్=శత్రువులు మిగిలియుండుట; కూడవు+అటంచు=పనికిరావు అని శాస్త్రములు; ఘోషిలు=ఘోషించుచున్నవి; ఏఁవాఁడు=ఎవఁడు; అల; కోసల+అధిపునిన్+పట్టి+ఒసంగునో; అట్టివానికిన్; మూఁడు వేలు; మాడలు=నాణెములు; బహుమానము; అటంచును; చాటన్+పంపుమా!

10. రాట్+దూతలు=రాడ్దూతలు=రాజదూతలు.

తా :- అని రాజు చెప్పఁగా రాజభటులు రాజ్యమునందు కొన్ని వేలసార్లు కోసలాధిపునిఁ బట్టుకొనువానికి మూఁడువేలు మాడలు బహుమానమని చాటించిరి.

11. డాసి=సమీపించి, వనవాసి=అరణ్యమునఁ దిరుగువాఁడా

తా :- మాసినబట్టతో, మలినమైన వేషముతో నరణ్యము నందుఁ దిరుగుచున్న యా కోసలాధీశునికడ కొకనాఁ డొకఁడువచ్చి యోవనవాసీ, కోసలపట్టణమునకు నాకు మార్గమెఱిఁగింపుమా? అనెను.

12. తా :- అదివిని కోసలపతి యో యయ్యా, అది పాడు దేశము. నీ కచట నేమిపని కలిగినది అని యా బాటసారి నడిగెను.

13. వారిధి=సముద్రము, వాడవాడఁబడి=వీధివీధి తిరిగి

తా :- నేను కోమటిని. వర్తకముఁకొఱకై సముద్రమునఁ బోవు చుండఁగా నన్ను దుఃఖమునముంచి నా నావ సముద్రమున మునిఁగి పోయెను. నేనే మొగముతో నింక వీధివీధిని తిరిపె మెత్తుదును? కోసలాధీశుఁడు గొప్ప దాతయని యింటింటఁ జెప్పుకొనుట వింటిని. (కావున నట కేఁగుచున్నాను)

14. కన్నీటిన్+అగి=కన్నీటి వాపుచేసికొని.

తా :- ఆ రాకుమారుఁ డాతని మాటలువిని చిరునవ్వునవ్వి, వచ్చుచున్న కన్నీటి నాపుకొని, కొంచె మాలోచించి, నిట్టూర్చుచు బాటసారితో నిట్లనెను.

15. వ్యాకులపడి=కలఁతనొంది.

తా:- ఓ బాటసారీ, నీవు శోకముతోఁ గలఁతనొంది దూరము నుండి వచ్చితివి. నీ కోరిక సిద్ధించును. దారి చెప్పెదను రమ్ము.

16. పొల్చెన్ = కనఁబడెను.

తా:- జడలను ధరించిన యాతఁడు కాశీరాజు సభలోఁ బ్రవేశించెను. అతఁడు వచ్చుటనుజూచి రాజు నీ దేశమేది? యేల వచ్చితివి? అని యడుగ, నాతని దీవించి, నేను కోసలపతిని. నేను స్వాయముగా నీకుఁ బట్టువడితిని కనుక నా కీయవలసిన ధనము నీ వర్తకున కిమ్ము అనెను.

17. అశ్రులు+ఊబికెన్ = కన్నీటిబిందువు లురలెను.

తా:—ఆ మాటలువిని యందఱు ఆశ్చర్యపడిరి. రాణివాసపుఁ గావలివాండ్ర కనులు చెమ్మగిలెను. కాశీరాజు కొంతసేపటి వఱకు మాటాడనేరక యెట్టకేలకు నవ్వుచు నిట్లనెను. కోసలదేశనాయకా

18. ("నీవు" అని మొదట తెచ్చిపెట్టుకొనుఁడు.) చచ్చియు = చనిపోయియు (రాజ్యహీనతచేఁ జచ్చినవానితో సమానుఁడవై) నీ సద్+చరితంబు= నీ యుత్తమమైన చరిత్రము, నన్నున్=నన్నుకూడ (నాయంత గొప్పవానినికూడ అని భావము) గెలువన్, చాలిన=గెలుచుటకు సమగ్రమైన, చాతురి=నైపుణ్యము చూపన్, కలెన్=చూపఁజాలినది, నీ, యశమున్=కీర్తిని, చాటఁగన్, పంచెద= చాటింపించెదను, నేఁటి ఆజిలోన్=నేఁటి వివాదములో, యుద్ధములో, నేను, చచ్చితిన్=చనిపోయితిన్ (నా గర్వమెల్ల నశించినది) రాజ్యము=నీ రాజ్యము, క్రమ్మఱన్=మఱల, ఒసంగితి=నీకిచ్చితి, దానితో, మనస్సు+ఇచ్చితి=నా హృదయమును గూడ నీ కంకితమొనర్చితిని, ఇఁక, నన్ను, ఏలుకొనుమీ=కాపాడుమా!

19. తా:- అని చెప్పుచుఁ గాశీరాజా చిఱుఁగుగుడ్డల వనవాసి యగు కోసలపతిని సింహాసనముమీఁద నెక్కించుకొనెను. మలినముగానున్న యాతని శిరమునఁ గిరీటమునుంచెను. పురజనుల ధన్యవాదములు చెలరేఁగెను.

## II. ప్రశ్నోత్తరములు

ప్ర. 1: పుస్తక విక్రయమను మీ పాఠ్యభాగ మేగ్రంథములోనిది. కర్తయెవరు? వారిని గూర్చి మీ కేమి తెలియును?

జ. : పుస్తక విక్రయమను పాఠ్యభాగము శ్రీ వేలూరి శివరామ శాస్త్రిగారు రచించిన కథలు, గాథలు అను గ్రంథములోనిది.

పండితులైన యాధునిక కవులలో శ్రీ శాస్త్రిగా రొకరు. వీరు శ్రీ తిరుపతి వేంకటేశ్వరుల శిష్యులు. శతావధానముల వలన, బహుగ్రంథరచన వలనను సుప్రతిష్ఠితమైన కీర్తి నొందిన వారు. వీ రనేక భాషలలోఁ బండితులు.

ప్ర. 2: మస్తక విక్రయమనఁగా నేమి? ఈ కథకీ శీర్షిక యెట్లు తగియున్నది?

జ.: మస్తక విక్రయమనఁగా తల నమ్ముకొనుట. రాజ్యహీనుఁడై యడవులలోఁబడి తిరుగుచుండిన కోసలరాజునుబట్టి చంపవలెనని కాశీరాజు ప్రయత్నించుచుండెను. అతని బట్టితెచ్చిన వారికి మూఁడువేల మాడలిత్తునని ప్రకటించెను. ఈ సంగతి కోసలరాజునకుఁ దెలిసెను. తనంత తానే కాశీరాజునకుఁ బట్టువడి బహుమానముగా రావలసినసొమ్మును తన కీర్తివిని సాయము కోరుటకు వచ్చిన యొక వర్తకుని కిప్పించెను. కోసలరాజు తాను పట్టువడినపుడు కాశీరాజును చంపినను సమ్మతించియే యీ పనికిఁబూనుకొని తనకీర్తిని నిలుపుకొనెను. తన తల నమ్ముకొని (అనఁగా దన ప్రాణములనే త్యాగమొనర్చి) యొక బీదవానిని గాపాడెను. ఈ కథకీ ప్రధానవిషయమే జీవము కనుక నీ కథకీ శీర్షిక చాల తగియున్నది.

ప్ర. 3: కోసలాధిపతి యెట్టివాఁడు?

జ: కోసలాధిపతి పిన్నవారిని తల్లివలె తండ్రివలె నరయుచుండును. బీదవారికి అతఁడే గృహము ధనమునై యీ భూమిమీఁద తనకు సాటిలేక పాలించువాఁడు.

ప్ర. 4: కోసలాధిపతి కథవిని కాశీరాజేమని తలఁచెను?

జ.: కాశీరాజు కోసలపతిని గూర్చిన కథలువిని తనకంటె నతఁడధికుఁడుగాఁ బ్రజలు పొగడుచున్నందుల కాతని యెడల నీర్ష్యనొందెను. తనకంటె తక్కువవాఁడైన కోసలరాజు దయా దానధర్మములెల్ల బొంకులనియు, అది యెల్ల నారాజునకుఁ తనయెడలగల మచ్చరమువలననే కలిగెననియుఁ దలఁ

చెను. ఇట్లు తలంచి యాతని రాజ్యభ్రష్టునొనర్చి యడవులకుం దోలెను.

ప్ర. 5 : కాశీరాజు సింహాసనమెక్కి సభ్యులతో నేమనెను ? ఆమాటలువిని ప్రజ లేమనిరి ?

జ. : కాశీరాజు కోసల సింహాసనము నాక్రమించి, సభ్యులతో యెవ్వండు రాజ్యలక్ష్మిని రక్షించుకొనుటకు సమర్థుండో వాండే దాన మొనర్చుటకును సమర్థుండగును – అని నవ్వెను. ఆ మాటలు విని ప్రజ "లక్కట! రాహువు చంద్రుని మింగు గదా! సిరి బలవంతుని బాహు వొక్కదానినే పొందం జూచునుగాని ధర్మాధర్మములను జూడదు. తండ్రివలె మమ్ము రయు మారాజును గోల్పోయితిమని ప్రజలు ఘోషిల్లిరి.

ప్ర. 6 : ప్రజాభిప్రాయమునువిని కాశీరా జేమిచేసెను ?

జ : కోసలరాజునుగూర్చి విచారించుచున్న ప్రజల యభిప్రాయము నెఱింగి, కాశీరాజు "నగర ప్రజలకు నేనుండగాం బోయిన వానినిగూర్చి యింత వంతయేలో ? ఓడియు నన్ను మఱల నాతండు గెలుచునేమో ? శత్రుశేష ముండరాదని శాస్త్ర ములు వక్కాణించుచున్నవి" అని తలంచి, మంత్రిని బిలిచి 'యోయీ కోసలాధిపతినిం బట్టి తేవలయును. అట్లు తెచ్చిన వానికి మూండువేల మాడలు బహుమానమని చాటంబంపుము' అని యాజ్ఞాపించెను.

ప్ర. 7 : వర్తకుండు వనములోం దిరుగాడుచున్న కోసలపతితో నేమనెను ?

జ : అడవిలోం దిరుగుచున్న కోసలాధీశునితో వర్తకుండు తానొక కోమటి యనియు, వర్తకము నిమిత్తము సముద్రమునం బోవు చుండంగా నావ మునింగిపోయెననియు, గోసలాధీశుండు వితరణ శాలియని వినియుండుటచే నటకుం బోందలంచినట్లును చెప్పెను.

ప్ర. 8 : కోసలరాజు వర్తకుని కోరిక నెట్లు తీర్చెను ?

జ : తన్ను బట్టియిచ్చినవానికి మూండువేలు మాడ లిత్తునని కాశీ రాజు చాటింపించిన విషయమును గోసలరాజు వినియుండెను.

తన పూర్వపుకీర్తిని విని సాయ మపేక్షించి యాశ్రయించిన వర్తకుని కోరికను దీర్చుటకుఁ గోసలాధిపతికియు మార్గాంతరము కనఁబడలేదు. నీ కోరిక తీరును లెమ్మని చెప్పి తానే స్వయముగాఁబోయి కాశీరాజునకుఁ బట్టువడి యాతఁ డీయ వలసిన ధనమును గోమటి కిప్పించెను.

ప్ర. 9: కాశీరాజు కోసలరాజు నెట్లు గౌరవించెను?

జ: కోసలరాజు త్యాగశీలమునుగాంచి కాశీరాజు నిశ్చేష్టుఁ డయ్యెను. ఆతని యధికారగర్వము, నజ్ఞానము పటాపంచలై పోయెను. ఆతఁడు కోసలపతి యౌదార్యమునుమెచ్చి, "ఒక్క క్షణకాలములో నన్ను జయించితివి. నీ సచ్చరిత్రమును దేశమునఁ జాటింపించెదను. నీ రాజ్యమును నీకిచ్చివైచెదను. రాజ్యముతోపాటు నా హృదయమును నీ కంకిత మొనర్చుచున్నాను. నన్నేలుకొనుము" అని పలికి యాతనిని సింహాసనముపైఁ గూర్చుండఁజేసి, శిరమునఁ గిరీట ముంచెను.

ప్ర. 10: ఈ కథవలనఁ దెలియఁదగిన నీతియేమి?

జ: కోసలరాజు త్యాగశీలము కాశీరాజు నహంకారమును బోఁగొట్టి యాతనిలో నుదారబుద్ధిని గలిగించినది. కావున నౌదార్య మౌదార్యము నుజ్జ్వలింపఁజేయును, (Nobleness enkindleth nobleness) అనియు,

కోసలరాజు తిరిగి తన రాజ్యమును బొందుటకుఁ గారణము సైనికబలముగాదు. ధర్మబలము చేతనే తిరిగి పొందెను. కావున ధర్మమే సర్వత్ర జయించును అనియు నీ కథవలన నీతులు తెలియఁదగియున్నవి.

ప్ర. 11: క్రింది వానిని సందర్భపూర్వకముగ వివరింపుఁడు:

1. వానికి నాపైన నెంత వాత్సల్యంబో!
2. చచ్చియు నన్ను నున్ గెలువఁజాలిన చాతురి చూపఁగల్గె

జ. : 1. ఈ మాటలు కోసలరాజునుగూర్చి, సేనాపతితో కాశీ రాజన్నవి.

కాశీరాజు కోసలరాజు కీర్తినివిని యీర్ష్యాగ్రస్తుఁడై యుండెను. తనపైఁ గోసలాధిపతి మాత్సర్యమును బెంచుకొనుటవలననే తన పేరడుగునఁ బడిపోయెననియుఁ దలఁచుచుండెను. ఒకనాఁడా కాశీరాజు సేనాపతితో యుద్ధమునకు సన్నాహ మొనర్పుమని చెప్పుచు "కోసలరాజెంత దానకర్ణుఁడైనాఁడో? అతనికి నాపై నెంత వాత్సల్యమో" అని - ద్వేషసూచకముగ నాశ్చర్యమును బ్రకటించెను. ఆతని యభిప్రాయము నిజముగ వాత్సల్యమని కాదు. ద్వేషము, మాత్సర్యము అని భావము.

2. ఈ మాటలు మస్తకవిక్రయమను పాఠ్యభాగమున కోసల రాజుతోఁ గాశీరాజన్నవి.

కోసలరాజు స్వయముగా వచ్చి పట్టువడి, యందుకొఱకుఁ గాశీరాజీయవలసిన మూఁడువేల మాడలను దన్నాశ్రయించి వచ్చిన వర్తకుని కిమ్మనిచెప్పి తన యౌదార్యమును త్యాగశీలతను బ్రకటించినపుడు కాశీరాజు చకితుఁడై పోయెను. ఆతనిలో హృదయ పరివర్తనము గలిగెను. ఎట్టకేలకాతఁ డిట్లనెను.

"నీవు వచ్చియేయుంటివి. (రాజ్యహీనుఁడవై యడవులంబడి తిరుగుచు వచ్చిన వానితో సమానుఁడవై యుంటివి.) అయినను బలవంతుఁడనైన నన్ను కూడ గెలువ గలిగినంతటిచాతుర్యమును జూపఁగలుట సంభవించినది." అని కోసలరాజును మెచ్చుకొనెను.

## III. వ్యాకరణాంశములు

ప్ర. 1 : క్రింది సమాసములకు విగ్రహవాక్యములు వ్రాసి, సమాసనామములఁ బేర్కొనుఁడు.

1. వనవాసి = వనమునందు నివసించువాఁడు : సప్తమీ తత్పురుష

2. పేరడవి = పెద్దదైన యడవి : విశేషణ పూర్వపద కర్మధారయము
3. మూఁడువేలు = ద్విగుసమాసము
4. తేనిమాట = తేనియొక్క మాట : షష్ఠీ తత్పురుషము
5. ఎల్లలోకములు = అన్ని లోకములు : అవ్యయీభావ సమాసము
దీనిని వి॥ పూ॥ కర్మధారయమని చెప్పనగును
6. కోసలదేశము = కోసల యను దేశము : సంభావనా పూర్వపద కర్మధారయము

ప్ర. 2: క్రిందివాని యందలి వ్యాకరణ విశేషములను వివరింపుఁడు.

1. పేరు + అడవి = పేరడవి :- కర్మధారయమునందుఁ బేర్వాది శబ్దముల కచ్చుపరమగునపుడు 'టు' గాగమంబు విభాషనగు. ఈ సూత్రముచే పేరడవి, పేరుటడవి అను రెండు రూపములుండును. పైన పేరడవి అనుచో 'టు' గాగమము రాలేదు.
2. నిడు + ఊర్పుచు = నిట్టూర్చుచు :- కుఱు, చిఱు, కడు, నడు, నిడు శబ్దంబుల ర డ ల కచ్చుపరంబగునపుడు ద్విరుక్త 'ట' కారంబగు.
3. నా + దు + అయిన :- యుష్మదస్మదాత్మార్థకంబుల షష్ఠీ తత్సమపదంబు పరంబగునపుడు 'దు' గాగమంబు విభాషనగు.
4. ముత్యము + ల + గద్దె :- లు, ల, న - లు పరంబగునపు డోకానొకచో 'ము' గాగమంబునకు లోపంబును తత్పూర్వస్వరంబునకు దీర్ఘంబును విభాషనగు.
5. ఎల్లన్ + లోకములు = ఎల్లలోకములు :-
(1) సర్వపర్యాయంబైన యెల్లశబ్దంబు ద్రుతాంతంబయిన యవ్యయంబు. దీని సమాసంబున విశేష్యంబునకు ముందు ప్రయోగంబు లేదు.
(2) సమాసంబునందు ద్రుతంబునకు లోపంబగు.
6. కసుమాలము + వేసము :- కర్మధారయంబులందు 'ము' వర్ణకంబునకుం బుంపు లగు.
7. విను + చు = వించు (గాశీరాజు) :- 'చు' వర్ణంబు పరంబగునపుడు అన్వాదుల వత్వలోపంబేని నుస్థానంబున బిందువేని విభాషనగు. (ఇచ్చట బిందువు)
8. వ్యాకులము + పడి = వ్యాకులపడి :- పడ్వాదులు పరంబగునపుడు 'ము' వర్ణకంబునకు లోపపూర్ణబిందువు విభాషనగు. (ఇచట లోపము కలిగినది.

ప్ర. 3 : క్రింది ప్రకృతులకు వికృతులు, వికృతులకుఁ బ్రకృతులు వ్రాయుఁడు.

| ప్ర | వి | ప్ర | వి |
|---|---|---|---|
| కథ | కత | శ్రీ | సిరి |
| వేషము | వేసము | చంద్రుఁడు | చందురుఁడు |
| వ్యాపారి | బేహారి | లక్ష్మి | లచ్చి |
| దిశ | దెస | పట్టణము | పత్తనము |
| మతి | మది | జట | జడ |
| మత్సరము | మచ్చరము | రాజకుమారుఁడు | రాకొమరుఁడు |

# ౯. గణాధిపతి

## I. అర్థాదులు

1. ఏకదంతుఁడా=ఒకేదంతము గలవాఁడా, వినాయకుఁడా, ఒంటన్=ఒక్కచోటనే - ఒక్క శరీరమందే, జంటఁగన్+తోఁచి = రెండుగాఁ గనఁబడి, తగు=ఒప్పగు, శబ్దమున్, అర్థము, నాన్ = శబ్దార్థములవలె, ఎసంగు=ఒప్పెడు, ముక్కంటిని=మూఁడుకన్నులు గలవానిని, శివుని, గౌరిన్=పార్వతిని, తత్పరతన్=ఆసతో, కాంచఁగన్=చూడఁగా, ఏగెడు, భార్గవుండు=పరశురాముఁడు, నీ, తుంటరిచేఁతకున్=దుష్టమైన పనికి, కినిసి=కోపించి, మున్ను, గొడ్డంటను=గొడ్డలిచే (పరశువు), తోరపు దంతమున్=స్థూలమైన దంతమును, ఊడన్, కొట్టెను, నీవు, ఇఁకను, డంబములన్=స్థితికిమించిన వేషములను (బడాయిని) విడువుము.

2. తిండిపోతా=ఓ తిండిపోతా! వినాయకుఁడా! ఈవు=నీవు, ప్రతిగేహంబును దూరెదు=ప్రతి గృహమును దూరెదవు, మహిన్=భూమిమీఁద, ఎవ్వారు+ఐనన్=ఎవ్వరైనను, ఏదేన్ ఇడన్=ఏదైన నీయఁగా, కతుకన్ జూతువు=తినఁజూతువు, జాతిభేదమును=జాతులలోని తారతమ్యమును, లెక్కవ్ చేయవు=గణింపవు, ఆభుక్తికై=ఆ తిండికొఱకై, మితము+అన్=మితమనెడు, సు+ఉక్తిన్=మంచిమాటను, నెమ్మిన్=సంతోషముతో, ఇంతయును తలంపవు=కొంచెమైనను నాలోచింపవు, నీకు, ఇంకన్, నమస్కృతి=నమస్కారము, త్వదీయ=నీ సంబంధమైన, భావము=ఆలోచనము (తలంపు), ఇలన్=భూమిమీఁద, ఏరికిన్=ఎవ్వరికైనను, హేయము=విడువఁదగినది.

3. హేరంబుడాఁ=వినాయకుఁడా, ఈవు=నీవు, బహు, భార్యల్, కలవాఁడవు, ఐనన్=చాలమంది భార్యలు గలవాఁడవైనను, ఈ ప్రాపంచికుల్=ఈ

లోకులు, ఊహన్ చేసి=ఊహించి, నిన్ను, ప్రతి+అహమున్=ప్రతిదినము (ఎల్లప్పుడును) బ్రహ్మచారివి, అని, పిలుతు. (కాని) నీయొద్ద=నీదగ్గర, తత్+మహిమ+ఉదంచిత+బుద్ధి=అట్టి గొప్ప ఉత్తమమైన (వికసించిన) బుద్ధి, సిద్ధి, కనమిన్=పరిపక్వత పొందకుండుటచే, నే=నేను, నిన్, బహుభార్యల్, కల, బ్రహ్మచారివి, అని, భావింతు, సత్యంబు+అగున్+కాక=(నా భావన) యథార్థమగునుగాక!

4. వనధిన్=సముద్రమును (పాలసముద్రము) త్రచ్చెడు వేళ్=చిలికెడు సమయమున, లక్ష్మి, జనియింపన్=పుట్టఁగా, దానిన్=ఆమెను, పెండ్లి, ఆడఁగా, మనమున్+చేసీ=కోరికచే, తదీయ లబ్ధి=ఆమె లాభము, కలఁడై=కలవాఁడై, మా+నాథుఁడు=విష్ణువు, ఉన్నన్=ఉండఁగా, అంతన్=అప్పుడు, ఆయనతో, పోరి=యుద్ధముచేసి, ఓడితివి కావా=ఓడిపోలేదా? ఈ+అది=ఇది (ఈ చర్య), బ్రహ్మచారిత్వలక్షణమా=బ్రహ్మచారికుండవలసిన గుణమా? భవత్+చారిత్ర+సర్వ+అంశముల్=నీ చరిత్రయొక్క సకలవిషయములు, ఏరు, ఎఱుంగరు=ఎవరెఱుఁగరు? (అందరెఱుఁగుదురు)

5. విఘ్ననాయకా=విఘ్నములకు నాయకుఁడా, వినాయకా, భూపతి=రాజు, నిజ+ఆశ్రిత+పాళికిన్=తన యాశ్రితుల సమూహమునకు, అర్థమున్=ధనమును, ఇచ్చు, పండితుఁడు, ఎందు=ఎచ్చటను (అన్నియెడలను), ఆశ్రిత జాతికి=ఆశ్రితుల సమూహమునకు, కావ్య+అర్థ+విశేషముల్+కొలుపున్=కావ్యము లందలి యర్థముల విశేషములను గుఱుఁజేయును, (కాని) నిన్, ప్రార్థనన్, చేయు, విఘ్నములవలె, ప్రాప్తము=పొందఁబడినవిగా, చేతువు=చేయుదువు. కాన, నిను, ప్రార్థన, చేయుట, సర్వదా=సర్వకాలములందును, వ్యర్థము, వ్యర్థము, అయ్యె!

6. పూజ్యుఁడా = ఏమియుఁ దెలియని మూఢుఁడా (పూజింపఁదగినవాఁడా), ఓ గణనాథా, నిను, పూజించుట, ఎప్డున్, నీ, మహాగుణములన్=గొప్ప గుణములను, నీ, సత్+కళా+ప్రాభవంబును=మంచి విద్యాప్రభుత్వమును, నీ, మోమును, చూచి, కాదు, సుమా, నామాట, నమ్ము, ధాత్రీజనుల్ = భూమి జనులు, భవదీయ=నీ, దుర్+యశము=అపకీర్తిని, దుష్కార్యంబులన్=చెడుపనులను, కాంచి=చూచి, కృతులన్=తామొనర్చు పనులయందు (కార్యములందు) విఘ్నభీతిన్=విఘ్నములవలని భయముచే, ప్రార్థనమున్, చేతురు.

## II. ప్రశ్నోత్తరములు

ప్ర. 1: "గణాధిపతి" యను పాఠ్యభాగ మే గ్రంథములోనిది? తత్కర్తను గూర్చి మీకేమి తెలియును?

జ.: పాఠ్యగ్రంథములోని పరిచయ వాక్యములను జూడుఁడు.

ప్ర. 2 : "దంతిను నూడఁగొట్టె గొడ్డంటను మున్ను" - ఎవరెవరి దంతముల నేల యూడఁగొట్టిరి ?

జ. : మునుపు పార్వతీ పరమేశ్వరులఁజూచు నాసక్తితోఁ బోవుచు పరశురాముఁడు వినాయకుని తుంటరి పనికిఁ గోపించి యాతని దంతమును దన యాయుధమైన గండ్రగొడ్డలితో నూడఁ గొట్టెను.

ప్ర. 3 : గణాధిపతి భావము హేయము-అని కవి యెట్లుచెప్పెను ?

జ. : గణాధిపతి జాతిభేదములనైనఁ బాటింపక ప్రతి గృహమును బ్రవేశించి, యెవ్వారేది యిచ్చిన దానిని భుజింపనే చూచును. ఆ భుజించుటలో మితమను మాటయే తలఁపఁడు. ఈ హేతువులచే నాతని భావము హేయమని కవి యభిప్రాయము.

ప్ర. 4 : గణాధిపతి బ్రహ్మచారిత్వమునుగూర్చి కవి యభిప్రాయమేమి ?

జ. : జనులందఱు గణాధిపతిని బ్రహ్మచారియని తలంతురు. ఆతని యందట్టి బ్రహ్మచర్యవ్రతబుద్ధి పరిపక్వత పొందలేదని యాతని చరిత్రయే చెప్పను. క్షీరసాగర మథన సమయమున జనించిన లక్ష్మీదేవిని ఆ మహావిష్ణువు కామించి పెండ్లాడఁగా, నామె కొఱకై యీతఁడు విష్ణువుతోఁ బోరి యోడిపోయెను. ఆతని బ్రహ్మచారిత్వ మెట్టిదో యీ యంశమే చెప్పును. కావున నాతఁడు బహు భార్యలుగల బ్రహ్మచారియని చెప్పుట మంచిదని కవి యభిప్రాయము.

ప్ర. 5 : విఘ్ననాయకుని కేల యా పేరు కలిగెను ? ఆతనిని బ్రార్థించుట యేల వ్యర్థము ?

జ. : విఘ్నముల కధిపతి కావున వినాయకుని కాపేరు కలిగెను. ఇది హేళనకావ్యము కావునఁ గవి, భూపతినిఁ బ్రార్థించిన ధనము నిచ్చును. పండితుని బ్రార్థించినఁ గావ్యార్థ విశేష జ్ఞానము నిచ్చును. నిన్ను బ్రార్థించిన విఘ్నములను గలుగఁ జేయుదువు అని కవి చెప్పెను. విఘ్ననాయకుని కాపేరు వచ్చుట కదియే కారణమని కవి యభిప్రాయము వ్యక్తమగు

చున్నది. ఆతఁ డట్టివాఁడు కనుకనే యాతనిఁ బ్రార్థించుట వ్యర్థమని కవి యభిప్రాయము.

ప్ర. 6: గణాధిపతిని జనులేల ప్రార్థింతురని కవి చెప్పెను?

జ. : గణాధిపతిని ప్రజలు ప్రార్థించు టాతని గుణములను రూపములను జూచికాదు. ఆతని దుర్యశమును, దుష్కార్యములను గాంచి విఘ్నములు కలిగింపకుండ నుండుటకు మాత్రమే పూజింతురని కవి యభిప్రాయము.

## III. వ్యాకరణాంశములు

ప్ర. 1: క్రింది వానికి విగ్రహ వాక్యములు వ్రాసి, యే సమాసములో చెప్పుఁడు.

1. తోరపు దంతము = తోరమైన దంతము : వి. పూ. కర్మధారయము
2. ప్రతిగేహము = గేహము గేహము : అవ్యయీభావ సమాసము
3. ఏకదంతుఁడు = ఒకేదంతము గలవాఁడు : బహువ్రీహి
4. ముక్కంటి = మూఁడుకన్నులు గలవాఁడు : ,,
5. జాతిభేదము = జాతియందలి భేదము : సప్తమీ తత్పురుషము
6. మానాథుఁడు = లక్ష్మియొక్క భర్త : షష్ఠీ తత్పురుషము
7. శబ్దార్థములు = శబ్దము నర్థమును : ద్వంద్వ సమాసము
8. ధాత్రీజనుల్ = ధాత్రియందలి జనులు : సప్తమీ తత్పురుషము

ప్ర. 2: క్రిందివాని యందలి వ్యాకరణ విశేషములను వివరింపుఁడు.

1. ముక్కంటి = మూఁడు + కన్ను అనియుండఁగా :-

(*a*) సమానాధికరణంబగు నుత్తరపదంబు పరంబగునపుడు మూఁడు శబ్దము 'డు' వర్ణంబునకు లోపంబును, మీఁదిహల్లునకు ద్విత్వంబు నగు. అను సూత్రముచే మూ + కన్ను అయినది. పిదప

(*b*) ద్విరుక్తంబగు హల్లు పరమగునపు డాచ్ఛికంబగు దీర్ఘంబునకు హ్రస్వంబగు. అను సూత్రముచే ము + కన్ను అయినది. అపిమ్మట

(*c*) "బహువ్రీహిని సమాసాంత కార్యంబులుం గానంబడియెడి" అను సూత్రముచే "న్ను" అని దానిని గొట్టివేసి "టి" వర్ణ మాదేశమగును. కాఁగా నిపుడు ము + క్క + టి అయినది. పిదప

(*d*) "పదాద్యంబగు హ్రస్వంబుమీఁది 'టి' వర్ణంబునకు ముందు పూర్ణబిందువగు" అను సూత్రముచే ము+క్కు+ం+టి = ముక్కంటి అను రూప మేర్పడుచున్నది.

2. తోరపు దంతము=తోరము+దంతము :- కర్మధారయములందు 'ము' వర్ణకంబునకుఁ బుంపులగు.

3. చేతువు = చేయు+దు+వు :- "చు వర్ణంబు తోడి దుగ్దకారంబునకు తకారంబగు" అను సూత్రము ప్రకారము 'చేతువు' అను రూపము సాధువు కాదు.

4. పిల్తురు=పిలుచు+దు+రు :- పై సూత్ర మిచ్చట వర్తించును.

5. అబ్ధిగలఁడై :- "ఉన్న కల న వర్ణకంబులమీఁది తచ్ఛబ్ధ 'వ' కారంబునకు లోపంబు విభాషనగు.

ప్ర. 3 : క్రిందివానిని విడఁదీసి సంధులను పేర్కొనుఁడు.

1. తత్ + మహిత + ఉదంచిత = తన్మహితోదంచిత
తత్ + మహిత = తన్మహిత = అనునాసికసంధి
మహిత + ఉదంత = మహితోదంత = గుణసంధి

2. సర్వ + అంశములు = సర్వాంశములు = సవర్ణదీర్ఘసంధి

3. ప్రతి + అహము = ప్రత్యహము = యణాదేశసంధి

ప్ర. 4 : క్రింది ప్రకృతులకు వికృతులు, వికృతులకుఁ బ్రకృతులు వ్రాయుఁడు.

| ప్ర | వి | ప్ర | వి |
|---|---|---|---|
| స్థూలము | తోరము | శబ్దము | సద్దు |
| లక్ష్మి | లచ్చి | కుఠారము | గొడ్డలి |
| కార్యము | కర్జము | గేహము | గీము |

# ౧౦. కృషీవలుఁడు

## I. అర్థాదులు

1. ఓపిన విధానన్=చాలిన విధముగా; ఉద్యమము=ప్రయత్నము.

తా :- కృషీవలా! శ్రమపడకుండ ఫలము కలుగదు. పిండికొలఁది రొట్టె యెట్లో యట్లే శ్రమకొలఁది ఫలము. కావున నోపిన విధముగ కష్టపడుము; నీకు సుఖముకలుగును. ఊరక ఆశించుచుఁ గూర్చుండుటకంటె ప్రయత్నము మేలు.

2. అనుదినము=ప్రతిదినము, విధి=బ్రహ్మ, జనియించినది+ఆది=పుట్టినది మొదలు, పౌరుషముతో=పురుషకారముతో, కైతవ+ఆశయము=కపటమైన అభిప్రాయము.

తా :- ఓ కర్షకుఁడా! ప్రతిదినము నిట్లు కష్టపడుమని బ్రహ్మ వ్రాసెనని విచారపడకు. భూమిమీఁదఁ బుట్టినది మొదలు చెమటోడ్చి శ్రమించి పురుష ప్రయత్నముతో నీ కుటుంబమును పోషింతువు. నీ మనస్సునందు లేశమైనను గపటాశయము లేదు.

3. ఉగ్గము+లు=ఉగ్గాలు=చెంబు లోనగు వానిని సులభముగా గొనిపోవుటకై అంచుక్రింద గట్టుత్రాళ్లు.

తా :-నేలనూతులకు ఉగ్గాలు నిల్పుదుమనువారు, చిటికెలలోఁ బందిళ్లు వేయఁబన్ను వారు బోడితలలకు మోఁకాళ్లకు ముళ్లుపెట్టువారే. (నిరాధారముగాఁ గార్యసాధన చేయుదుమను వాచామాత్రశూరులు) వారెవ్వరు నిన్నుఁబోలరు.

4. సైరికా=హాలికుఁడా, ప్రార్థనీయము=ప్రార్థింపఁదగినది.

తా :- ఓ హాలికా! నీవు భారతదేశపు టాత్మగౌరవమును దాల్చిన పవిత్రమూర్తివి, శూరవరుఁడవు. ప్రభువుపాలన దండము కంటె నీ హాలమె సర్వదా ప్రార్థనీయము.

5. భాగ్యనిధులు=భాగ్యపు గనులు.

తా :- నీ పల్లెటూరి సరిహద్దే నీకు ప్రపంచపు హద్దు. నీ భార్యయే నీవు చూచిన మనోహర విగ్రహము! బంగారు పండు నీ పంటపొలములే యైశ్వర్యపు గనులు. ప్రతిదినము పడు నీ శ్రమయే నీ మతము.

6. కష్ట+ఆర్జితము = కష్టముచే సంపాదింపఁబడినది; నీ పంచకు = నీ యింటికి.

తా:- నీవు కలిగిననాఁడు తిందువు; లేనినాఁడు పస్తుందువు. అంతేకాని యితరుల కష్టార్జితమున కాసపడవు. ఆఁకలితో నీయింటికి వచ్చిన యతిథి తినకుండ త్రాగకుండ నెన్నఁడును పోలేదు.

7. తా.– ఓ కృషీవలా, సంఘముయొక్క సిరిసంపదలకు నీవె కారణమవు. కాని నీ శ్రమకు ఫలమునను భవించువారు వారు; నీకు మాత్రమెల్ల పుట్టను కట్టను గుడ్డవను గదవే!

8. ఆకాశంబున; మేఘమాలికల=మేఘసమూహముల; రూపు+ఐనన్=ఆకారమైనను; కనన్, రాదు, శుష్క+ఆకారంబులన్=ఎండిపోయిన ఆకారములతో; పైరులు+ఎల్ల; సొలు కు+ఐ=మూర్ఛమై; తీవ్రంబుగా; అల్లాడెన్=క్షోభించెను; సూర్య, మయూఖ, తాపము=సూర్యుని కిరణముల బాధ, సోకెను, ఇంకన్; ఏ జోకన్=ఏవిధముగా; వరుల్=వరిపంటలు; ఫలించున్? దైవము, మాకు, ఈకష్టము, పెట్టెను, అని; మాటికిన్=మాటిమాటికి; చింతిలన్=చింతిలుట; ఏలా=ఎందుకు?

9. ప్రావృట్=వర్షాకాలమందలి; అంభోదలక్ష్మి=మేఘలక్ష్మియొక్క; ఆవాసమునకున్=గృహమునకు; పొలన్=వ్యాపించునట్లుగా; కట్టిన, నవరత్నతోరణంబునాగ=నవరత్నములతో నిర్మించిన తోరణమో యనునట్లు; కోమల, శబల, వర్ణములతోడను=కోమలములైన మిశ్రవర్ణములతో; ఇదిగో; ఇంద్రచాపము=ఇంద్రధనుస్సు; శోభిల్లె=ప్రకాశించెను; చూడు. అలంకారము - ఉత్ప్రేక్ష.

10. తా:– పన్ను చెల్లించుటకు, కూలీలకిచ్చుటకు, నీ కూటికి, చిల్లరమల్లరగాం దెచ్చిన యప్పులకు, పండుగ పర్వాలలో విందులకైన యప్పు, వెనుకటి యప్పుమీఁది వడ్డి, భార్యవస్తువులు కుదువఁబెట్టి తెచ్చినయప్పు – వేగముగ అన్నియును దీర్చివైచి స్వాతంత్ర్యము ననుభవింపుము.

## II. ప్రశ్నోత్తరములు

ప్ర. 1: కృషీవలుఁడు అను మీ పాఠ్యభాగమును రచించినవారెవరు? వారి యితర గ్రంథములేవి? వారి కవిత్వమునుగూర్చి మీకేమి తెలియును?

జ. : కృషీవలుఁడు – అను పాఠ్యభాగమును రచించినవారు కీ. శే. దువ్వూరి రామిరెడ్డిగారు. ఇది యీ శీర్షికతో వారు రచించిన యొక ఖండకావ్యములోనిది. అర్వాచీనులలోఁ గవిగా, విమర్శకుఁడుగా, వ్యాసరచయితగా శ్రీ రెడ్డిగారు మంచిపేరు సంపాదించుకొన్నారు. వీరికి కవికోకిలయను బిరుదమున్నది. బిరుదము సార్థకమగునట్లుగా వీరి కవిత వినూతనభావసంపదతో

మనోహరమైయుండును. జలదాంగన, నైవేద్యము, పానశాల మున్నగునవి వీరి యితర కృతులు.

ప్ర. 2 : కవి కర్షకుని యనునయించిన విధమేమి?

జ. : "కృషీవలా! పిండికొలఁది రొట్టెయన్నట్లు శ్రమకొలఁది ఫలిత ముండును. కావున శ్రమించి పనిచేయవలెను. ఊరకా శలు పెంచుకొనుట కంటె ప్రయత్నము మేలు. అనుదినము నిట్లు శ్రమపడవలసినదేనా? అని నీవు విచారింపకుము! పుట్టినప్పటి నుండి శ్రమించి కుటుంబమును పోషించితివి. నీ మనస్సున కపటము లేదు. ఉత్తమాటలు చెప్పువారికంటె నీ వుత్తముఁడవు. ఓ కృషీవలా! భారతదేశపు నాత్మగౌరవము నీయందు మూర్తీభవించినది. నీవు శూరుఁడవు. రాజదండముకంటె నీ హాలమే ప్రార్థనీయము. నీ పల్లెయే నీ ప్రపంచము. నీ భార్యయే నీకు రమణీయ విగ్రహం! నీ పొలములే భాగ్యనిధులు; నీ శ్రమయే నీ మతము. నీవున్ననాఁడు తిని లేనినాఁడు పస్తుండువే కాని పరధనములను గోరవు. అతిథులెవ్వరు నీ యింటికి వచ్చి రిత్తపోరు. సాంఘికోన్నతికి నీవే కారణమవు. నీశ్రమ ఫలమనుభవించునది సంఘము. నీవుమాత్రము నిత్య దారిద్ర్యముతో నుందువు. ఓయీ! వర్షములేక వరి యెండి పోవుచున్నదని విచారింపకుము. అదిగో యింద్రధనుస్సు - చక్కగాఁ బండించి నీ ఋణములను దీర్చికొని స్వతంత్రుఁడై వర్ధిల్లుము" అని యిట్లు కవి కృషీవలు ననునయించెను.

ప్ర. 3 : కర్షకుని కష్టములను గవి యెట్లు వర్ణించెను?

జ. : పై సమాధానములో మొదటినుండి "నీవుమాత్రము నిత్య ద్ారిద్ర్యముతోనుందువు" వఱకు దీనికి జవాబు.

ప్ర. 4 : నీవు భారతక్ష్మాతలాత్మగౌరవ పవిత్రమూర్తివి." ఎవరు? ఎట్లు?

జ. : భారతక్ష్మాతలాత్మ గౌరవ పవిత్రమూర్తి కృషీవలుఁడే! భారతదేశము ప్రధానముగ వ్యావసాయిక దేశము. పుట్టిన

దాది జీవితాంతము వఱకు శ్రమకోర్చి వ్యవసాయవృత్తినే యవలంబించి పంటలు పండించి సాంఘికోత్కృష్ట సౌభాగ్య సౌఖ్యములకు గారణమైనవాఁడు కృషీవలుఁడు. ఆతఁడు మాయ మర్మంబుల నెఱుఁగఁడు. కల్ల కపటము లెఱుఁగఁడు. ఆతఁడు పురుషకారముతోఁ గుటుంబమును అతిథులను బోషించును. సంఘమాతని వలన జీవించుచున్నను ఆ త్యాగ ధనుఁడెన్నఁడును దారిద్ర్యముతోనే కాలము గడుపుచుండును. ఇట్టి, కృషీవలుఁడు భారతమాతలాత్మ గౌరవ పవిత్రమూర్తి యనుటకు సందేహము లేదు.

ప్ర. 5 : "నీకుఁ గట్టఁ గుడువఁ గలదె యెక్కాలమందు" ఏల ?

జ. : కర్షకుఁడు శ్రమపడి పడించినపంటలోఁ జాలభాగము సంఘము నకుఁ బోవును. ఆతనికి మిగులునది శూన్యము. కావుననే యాతనికిఁ గట్టను గుడువను నిత్యము కలదె!

ప్ర 6 : కర్షకునిఁ బోలనివారెవ్వరు ? ఇందలి యర్థగాంభీర్యమును వివరింపుఁడు.

జ. : నేలనూతుల కుగ్గాలు నిలుపువారు, చిటికెలోఁ బందిళ్ళు పన్నువారు, బోడితలలకు మోకాళ్ళకు ముడివెట్టఁ జూచు వారు – వీరెల్లరు ఉత్తమాటల ప్రోవులు! వారివలన నే కార్య మును సాధింపఁ బడదు. అట్టివారికంటె కృషీవలుఁ డుత్త ముఁడు. వారెవ్వరు నాతనిఁ బోలరు అని యీ పద్యముయొక్క భావము.

ప్ర. 7 : కర్షకుని యౌదార్యమును వివరింపుఁడు.

జ. : కర్షకుఁడు శ్రమపడి పంటలుపండించి సాంఘిక క్షేమమును గూర్చును. కాపట్యమన్నదిలేని త్యాగధనుఁడాతఁడు. తన శ్రమ ఫలితమును సంఘమునకిచ్చి తాను నిత్యదారిద్ర్యమునఁ గుందుచున్నను, అతిథులను దృప్తిపఱచును. కర్షకుని యౌదార్య మిట్టిది.

# III. వ్యాకరణ విశేషములు

ప్ర. 1: క్రింది సమాసములకు విగ్రహవాక్యములు వ్రాసి సమాస నామములం జెప్పుఁడు :

1. నేలనూతులు = నేలయందలి నూతులు : సప్తమీ తత్పురుష
2. అనుదినము = దినదినము : అవ్యయీభావ సమాసము
3. సౌభాగ్యసౌఖ్యములు=సౌభాగ్యమును, సౌఖ్యమును:ద్వంద్వసమాసము
4. ఇంద్రచాపము = ఇంద్రునియొక్క చాపము : షష్ఠీ తత్పురుషము
5. అంభోదలక్ష్మి = అంభోదమను లక్ష్మి : రూపకసమాసము
6. కష్టార్జితము = కష్టముచేత ఆర్జింపబడినది : తృతీయా తత్పురుషము

ప్ర. 2: క్రింది రూపములయందలి వ్యాకరణ విశేషములను దెలుపుఁడు :

1. ఉగ్గము+లు=ఉగ్గాలు :- లు, ల, న లు పరంబగునపుడు ఒకానొకచో 'ము' గాగమంబునకు లోపంబును తత్పూర్వస్వరంబునకు దీర్ఘంబును విభాషనగు.

2. కారణమవు :- ప్రథమాంతమ్ములను యుష్మదస్మద్విశేషణంబుల కేకత్వంబున వును, లును బహుత్వంబున రము, లును అంతాగమంబులు ప్రాయికంబుగ నగు.

3. బంగరుంబంట :- సమాసంబుల నుదంతంబులగు స్త్రీసమంబులకుం బుంపు లకుం బరుష సరళంబులు పరంబులగునపుడు నుగాగమంబగు.

4. ధాన్యము+అప్పు, ధాన్యంపు+టప్పు = ధాన్యంపుటప్పు :
   1. కర్మధారయంబులందు 'ము' వర్ణకంబునకు బుంపులగు.
   2. కర్మధారయంబులం దుత్తున కచ్చుపరంబగునపుడు 'టు' గాగమంబగు.

5. బజారు + అప్పు = బజారుటప్పు :- కర్మధారయంబులం దుత్తున కచ్చు పరంబగునపుడు 'టు' గాగమంబగు.

ప్ర. 10: క్రింది ప్రకృతులకు వికృతులు, వికృతులకుఁ బ్రకృతులు వ్రాయుఁడు.

| ప్ర | వి | ప్ర | వి |
|---|---|---|---|
| ఆస | ఆస | భాగ్యము | బాగెము |
| ఆకాశము | ఆకసము | రత్నము | రతనము |
| బంధువులు | బందుగులు | | |

# గద్య భాగము

# ౧. శ్రీ వివేకానందుని లేఖ

## I. అర్థాదులు

పేరా 1. విద్యా + అధికలు=విద్యచే నధికలైన స్త్రీలు; మనుచుందురు=వర్తించుచుందురు; మహిళా+మతల్లులు=స్త్రీలలో శ్రేష్ఠురాండ్రు; వర్ణన+అతీతము=వర్ణనను మించినది; కృతజ్ఞతాఋణము = కృతజ్ఞత యనెడు ఋణము; సహస్ర + అంశము=వేయవ వంతు.

పేరా 2. శక్తి + ఉపాసకుఁడు=శక్తిని కొలుచువాఁడు; రమింతురు=క్రీడింతురు; మనువు=మనుధర్మశాస్త్రమును రచించినవాఁడు; మృతప్రాయులమై = చనిపోయినవారితో సమానులమై,

పేరా 3. ప్రాయమునకు=వయస్సునకు; విహంగములు=పక్షులు; దీన + జన ఉద్ధరణము=దీనులైన జనులను పైకి లేవనెత్తుట.

పేరా 4. హీనకులము=తక్కువ కులము; దుర్గతి=చెడుదారి; శ్రేయము=శుభము; జీవన+ఉపాధి=బ్రతుకుఁదెరువు; పురః+అభివృద్ధి=భావివెంపు; సనాతన ధర్మము=ప్రాచీన ధర్మము.

పేరాలు 5, 6. పరమ+అర్థము=గొప్పదైన ప్రయోజనము.

## II ప్రశ్నోత్తరములు

ప్ర. 1 : "వివేకానందుని లేఖ" రచించిన వారెవరు ? వారి యితర రచన లేవి ?

జ. : పాఠ్యభాగమైన "వివేకానందుని లేఖ" వివేకానందస్వామి షికాగో నగరమునుండి మద్రాసులోని యొక మిత్రునికి వ్రాసినది. అది యాంగ్లమున రచింపఁబడెను. దానినిఁ దెనిఁగించినవారు శ్రీ చిరంతనానందస్వామి వారు. వీరు సంస్కృతాంధ్రాంగ్లములఁ బండితులు.

వీరు కొంతకాలము మదరాసునుండి వెలువడు "రామకృష్ణప్రభ"కు సంపాదకులుగా నుండిరి. వివేకానందుని భక్తి,

కర్మ, జ్ఞాన, యోగములను నాంగ్ల గ్రంథములను దెనిగించిరి. వివేకానంద, రామకృష్ణుల జీవితచరిత్రలను రచించిరి. వీరి రామకృష్ణ జీవితచరిత్రము కేంద్రప్రభుత్వ బహుమానము నందిన యుత్తమగ్రంథము.

ప్ర. 2. వివేకానందుఁడు భారత స్త్రీలకును, షికాగో స్త్రీలకును గల తారతమ్య మెట్టిదని చెప్పెను ?

జ. : అమెరికా దేశ స్త్రీలవంటి విదుషీమణులను, విజ్ఞానవతులను, వివేకానందుఁ డెచ్చటనుఁ జూడలేదు. వారందఱు స్వేచ్ఛమైన మనస్సుగలవారు, స్వతంత్రలు. సాంఘిక పురపాలక విధులను వారే నిర్వహింతురు పాఠశాలలు కళాశాలలు స్త్రీలతో నిండి యుండును. వారు వివేకానందు నత్యంతాదరముతోఁ జూచిరి. వారెల్లరు విశుద్ధవర్తనలు, నిర్మలహృదయులు. వారు సామాన్య ముగ నిరువదియైదేండ్ల ప్రాయమువచ్చువఱకు వివాహామే చేసికోరు. ఆకాశమున నెగురు పక్షులవలె వారు స్వతంత్రలు. ఇంటను బయటను నే కార్యమునైన వారు స్వయముగా నిర్వహింతురు. వారిలో ధనికురాండ్రు దీనజనోద్ధరణార్థము పాటు పడుదురు. అచ్చట పురుషులు స్త్రీలను పరమేశ్వర శక్తి స్వరూపిణులుగా గ్రహించి యుచితరీతిని గౌరవింతురు.

మనదేశ స్త్రీలకు వీరికి నెంతయో భేదము గలదు. మన స్త్రీలు వీధిలో నడచుటకే జంకుచుందురు. పురుషులు స్త్రీ స్వాతంత్ర్యము నెడలను స్త్రీ నాదరించుట యందును శ్రద్ధలేని వారు. కావుననే మనము నిర్భాగ్యులమై మృతప్రాయులమై యున్నాము. స్త్రీ లెక్కడఁ జెడిపోవుదురోయని మన పిల్లలకు పదునొకండేండ్లకే పెండ్లిండ్లు చేయుచున్నాము. నిజముగా మనము మనువు మున్నగు మహర్షులు చెప్పినట్లు బ్రహ్మచర్య మును బాటించుటలేదు. మన స్త్రీల నిట్టి స్థితినుండి యుద్ధరించినఁగాని మన కధోగతి తప్పదు. అని వివేకానందుడు చెప్పెను.

ప్ర. 3 : హీనస్థితియందున్న వారి విషయమున నమెరికా భారతదేశముల భేదమేమి?

జ. : మనదేశమున నెవ్వడైన హీనకులమునఁ బుట్టిన వానిస్థితి యా జన్మాంతము నంతియే. మా దేశము చాల బీద దేశమని మన వారు చాల గందరగోళ మొనర్తురు గాని యట్టి బీదల శ్రేయస్సునుగోరి యే పనియుఁ జేయరు. వారి యవస్థనుగూర్చి యెవరును జింతింపరు. విద్యాధికులైన బ్రాహ్మణులే "నన్ను ముట్టుకోకు" అని మిట్టిపడుచుండ నిఁక మన సనాతన ధర్మ మెక్కడ! దీన జనోద్ధరణ మెక్కడ!

కాని యమెరికా దేశమున సాంఘికవ్యవస్థ ఈ విధముగ లేదు. అచ్చట దారిద్ర్యమనునదే కనఁబడదు. అందరకు సమాన సదవకాశములు గల్పింపఁబడుటచేఁ బ్రతి వ్యక్తియు బాగుపడుట కవకాశము కలదు. నేఁడు బీదవాఁడై యున్న వాఁడు రేవు ధనవంతుఁడు గావచ్చును, విద్యాధికుఁడు గా వచ్చును, పూజనీయుఁడు గావచ్చును.

ప్ర. 4 : పూర్వాచార పరాయణుల యలస భావమునుగూర్చి వివేకానందుని యభిప్రాయమేమి ?

జ. : మనదేశమునఁ గొందఱు పూర్వాచార పరాయణులై హీన కులములను నీచముగాఁ జూతురు. వారి నస్పృశ్యులుగఁ గణించి, వారి నీడయైనఁ దమ మీఁద బడనీయరు. విద్యాధి కులైన బ్రాహ్మణులే "నన్ను ముట్టుకోకు" అను మహా మంత్రమును జపించుచున్నారు. ఇట్టివారి చేతులలోఁబడి మన సనాతనధర్మ మడుగంటినది. ఇట్టివా రెవ్వరు అధఃకృతమగు భారత దీనజనకోటిని లేవనెత్తుటకుఁ జాలరని వివేకానందుఁడు వచించెను.

ప్ర. 5 : తా నమెరికాదేశమునకు వెళ్ళిన కారణమేమని వివేకానందుఁడు చెప్పెను?

జ. : వివేకానందుఁ డమెరికా వెళ్ళుట కుతూహలముచేఁ గాదు. పేరు ప్రతిష్ఠలకై కాదు. భారత దేశమందలి కోట్లకొలఁది

ప్రజల జీవనోపాధి కేమైన మార్గము కనఁబడునేమో యని యటకు వెళ్ళెను.

ప్ర. 6 : అమెరికావారి వలన మనము, మన వలన అమెరికావారు నేర్వఁదగిన విషయము లేవి ?

జ. : ఆధ్యాత్మిక విషయమున మనతోఁ బోల్చిన నమెరికావారు చాల వెనుకఁబడియున్నారు. కాని, సాంఘికముగ మనకంటె వారు కోటిరెట్లు ఘనులు. కావున మన యాధ్యాత్మిక పరమార్థమును వారికి బోధించి, వారి సంఘములోని మంచి విషయములను మనము గ్రహించుట యుచితమై యుండును. అని వివేకానందుని యభిప్రాయము.

ప్ర. 7 : అమెరికావారు మనకంటె సాంఘికముగా కోటిరెట్లు అధికులని వివేకానందుఁ డెట్లు నిరూపించెను ?

జ. : పై 2-3 ప్రశ్నలకు జవాబులను జూడుడు.

## III. వ్యాకరణాంశములు

(1) ఈ క్రిందివానికి విగ్రహవాక్యములు వ్రాసి యవి యే సమాసములో తెల్పుఁడు

1. జగద్వ్యాప్తము=జగత్తునందు వ్యాపించినది : సప్తమీతత్పురుషము.
2. యథాయోగ్యము=యోగ్యము నతిక్రమింపకుండునట్లు : అవ్యయీభావ సమాసము.
3. నిర్మలహృదయులు=నిర్మలమైన హృదయము గలవారు : బహువ్రీహి.
4. సిరిగతులు=సిరియు గతియును : ద్వంద్వసమాసము.
5. హీనకులము=హీనమైన కులము : విశేషణపూర్వపదకర్మధారయము.
6. మంచివిషయము=మంచిదైన విషయము : " "
7. మహిళామతల్లి=మహిళలలో శ్రేష్ఠురాలు : షష్ఠీతత్పురుషము.
8. విద్యాధికుఁడు=విద్యచేత నధికుఁడు : తృతీయా తత్పురుషము.

(2) క్రిందివానిలో వ్యాకరణ విశేషములను వివరింపుఁడు.

1. ప్రయత్నించుదును = ప్రయత్నింతును. చు వర్ణంబుతోడి దుగ్గకారంబు తకారంబగు.

2. మఱి + ఎచ్చుటను = మఱెచ్చుటను.
ఏమ్రాడుల యిత్తునకు సంధి వైకల్పికముగ నగు.

3. ధనికరాంద్రుడు :
కర్మధారయంబునం దత్సమంబుల కాలుశబ్దంబు పరంబగునపుడు అత్వం బున కుత్వంబును రుగాగమంబునగు.

4. పురః + వృద్ధి = పురోవృద్ధి : విసర్గసంధి.

5. శక్తి + ఉపాసకులు = శక్త్యుపాసకులు : యణాదేశసంధి.

6. క్రింది ప్రకృతులకు వికృతులు, వికృతులకుఁ బ్రకృతులు వ్రాయుఁడు.

| ప్ర | వి | ప్ర | వి |
|---|---|---|---|
| భోజనము | బోనము | కులము | కొలము |
| శక్తి | సత్తి | సాహాయ్యము | సాయము |
| విద్య | విద్దె | వ్యథ | వెత |
| విజ్ఞానము | విన్నాణము | పుణ్యము | పున్నెము |

# ౨. సీతా పరిత్యాగము

## I. అర్థాదులు

పేరా 1. కాకుత్స్థుండు=కకుత్స్థవంశజుఁడు; ఏకాంతంబున=రహస్యమున; కాంతునితో=భర్తతో; ఉల్లంబున = మనస్సున; కాంక్ష = కోరిక; వనంబులన్ = అడవులలో; వగలన్ + పొగులుచు = విచారముతోఁ బరితపించుచు; ఇడుమలు = కష్టములు; కొమ్మ=స్త్రీ; అభ్యంతర మందిరమునకు=లోపలి భవనమునకు; అనిచి= పంపి; కేలుమోడ్చి=అంజలి ఘటించి; త్రిలోకపావనుండవు = మూఁడులోకములం దును బవిత్రుఁడవు; భయకంపితులు = భయముచే వణఁకినవారు; కోకలు=బట్టలు; తగవు=న్యాయము; బ్రహ్మకల్పము = 1000 యుగము లొక బ్రహ్మదినము; అట్టి దినములతోఁ గూడిన బ్రహ్మజీవితమున్నంతకాలము=చాల దీర్ఘకాలమని భావము.

పేరా 2. వేగుటయు=తెల్లవారుటయు; సమ్ముఖమ్మునకు = సమక్షమునకు; చింతాక్రాంతుఁడు=విచారముచే నాక్రమింపఁబడినవాఁడు; వివర్ణవదనుఁడు=కాంతి తప్పిన మొగము గలవాఁడు; బాష్ప+ఆకులిత+నేత్రుఁడు = కన్నీటిబిందువులచే కలఁతఁజెందిన కన్నులుగలవాఁడు; రాహుగ్రస్తుండు = రాహువుచే గ్రసింపఁబడిన వాఁడు (తినఁబడినవాఁడు); ఖిన్నులై = దుఃఖించినవారై; లోక+అపవాదము = లోకమునందలి దూఱు; డెందంబు=హృదయము; జనన, మరణ, భయ, భీతుఁడు=

పుట్టుక, చావులవలని భయముతో భీతిఁజెందినవాఁడు; భయ,కంపిత,స్వాంతుఁడు=భయముచే వడఁకిన మనస్సుగలవాఁడు; దశముఖుని=రావణుని; అనలము=అగ్ని; వినుతింపన్=పొగడఁగా; కందకుండ = నొచ్చకుండ; కతంబునన్ = కారణమున; గతి=పుణ్యలోకప్రాప్తి; సౌజన్యపాత్ర=సుజనత్వమునకుఁ బాత్రమైనది; ఘోర, మృగ, పక్షి, గణ, ఆకీర్ణము=భయంకరమైన మృగముల, పక్షుల సమూహముచే వ్యాపించినది; రోష+అరుణ+లోచనుఁడు=కోపముచే నెఱ్ఱనైన కన్నులుకలవాఁడు; అర్థంబు=ధనము; అనుజులు = తోఁబుట్టువులు; తృణంబుగాన్ = గడ్డిపోచవలె; మానధనులు=మానమే ధనముగాఁ గలవారు; ఉజ్జగించి=విడిచి.

3వ పేరా: (9 పుట) అంబరంబులు=వస్త్రములు; సువాసినులు=పుణ్యస్త్రీలు; లేశంబునులేదు=కొంచెమైనను లేదు; (10 పుట) సడలించిన=వదులుచేసిన; బెట్టుగా = మిక్కిలిగా; దుర్నిమిత్తములు = దుష్టశకునములు; గుదపిల్లు=తపించుచున్నది; మస్తకము=శిరస్సు; ఎఱయించుకొను=ఆసక్తిగొల్పు; వంచించి=తప్పించుకొని పోవు; (11 పుట) అనంత, కల్యాణ, గుణ, సాంద్రుండు=(అంతములేని) అనేక శుభగుణములచేఁ బూర్ణుఁడైనవాఁడు; తరు, లతా, నికరంబుల = చెట్లయొక్కయు, లతలయొక్కయు సమూహములు; పరిమిళితములు=మిక్కిలి కూడియున్నవి; (సువాసన కలవిగాఁ జేయఁబడినవని భావము) సప్త, శత, ప్రవాహ, ముఖంబులన్=ఏడువందల నదుల ముఖములను; కనుపట్టుచు=చూపించుచు; వకుళము=పొగడ; తిలకము=బొట్టుగుచెట్టు; సహకారము=తియ్యమామిడి; నమేరువు=సురపొన్న; ప్రియకము=ప్రేంకణము; అట్టి వృక్షవిశేషములచే మేదురంబు+అయిన=దట్టమైన; తటంబునన్=ఒడ్డున; పాదచారంబునన్=కాలినడకను; అసంతతములు=మొక్కవోనివి; ధౌత, పరిధానములు=తెల్లని వస్త్రములు; ఘూర్ణిల్లు=తిరుగుడుపడు; వృకంబులు=తోడేళ్లు; వనమహిషము=అడవిదున్నపోతు; జీర్ణములు=ప్రాఁతపడినవి(వృద్ధములు); నీరసంబులు=సారము (చేవ) లేనివి; ఛాయాపరిత్యక్తములు=నీడచే వదలఁబడినవి (నీడలేనివి); వృక్షషండంబు = వృక్షసమూహము; వికటంబులు=వంకరయైనవి; (12వ పుట) తీక్ష్ణములు=పదనైనవి; కంటకంబులు=ముండ్లు; పుణ్యపేటికలు=పుణ్యపుఁ బెట్టెలు (పుణ్యముల కునికిపట్లు) యతి, వర, మఠ, వాటికలు=మునిపుంగవులుండు స్థలములుగల తోటలు; పాషాణ, కర్కశంబు+అయిన=రాలచే కఠినమైన; బాష్ప, పూరంబులు=బాష్పజల ప్రవాహములు; అశనిపాతము=పిడుగుపాటు; (13 పుట) పరామర్శించి=చక్కగా నాలోచించి; కొండవిల్కాని=కొండయే విల్లుగాఁ గలవాని, శివుని; (14 పుట) పలవించు=దుఃఖించు; హుటాహుటి=వేగముగ; అదృష్టి, గోచరుఁడు=చూపులకుఁ గనపడనివాఁడు.

# II. ప్రశ్నోత్తరములు

ప్ర. 1 : సీతాపరిత్యాగమను మీ పాఠ్యభాగ మేగ్రంథములోనిది? కవి, అతని కాలము, ఇతరగ్రంథములు, అతని శైలి - పేర్కొనుఁడు.

జ : సీతాపరిత్యాగమను నీ పాఠ్యభాగము సముఖము వేంకట కృష్ణప్పనాయకుఁడు తెనుగున వ్రాసిన జైమినిభారతమను వచనకావ్యమునఁ దృతీయాశ్వాసములోనిది. ఈ కవి క్రీ.శ. 1704 మొదలు 1731 వఱకు మధురరాజ్యమును బాలించిన విజయరంగ చొక్కనాథుని యాస్థానమున నుండినవాఁడు. ఈ జైమినిభారతము ఆ రాజునకే యంకితము. ఈతఁడీ గ్రంథమునేకాక సారంగధర చరిత్రమను వచనకావ్యమును, అహల్యాసంక్రందనము, రాధికాసాంత్వనమునను ప్రబంధములనుగూడ రచించెను.

ఈతని శైలి సలక్షణమై యలంకారయుక్తమై మనోహరముగా నుండును.

ప్ర. 2 : జానకి శ్రీరాముని గోరిన కోరిక ఏమి? దానిని విని శ్రీరాముఁ డేమి తలఁచెను?

జ : గంగాతీరమునఁ దపముచేయు తపసి యిల్లాండ్రతోడంగూడి వనంబుల విహరింప గోరుచుంటిననియు, నా కోర్కె తీర్పు మనియు జానకి శ్రీరామునిఁ గోరెను.

ఆ మాటలువిని శ్రీరాముఁడు గుండెజల్లన, "సీమె యిట్టి తగని కోరిక కోరుచున్న దేల? పూర్వము పదునాలు గేండ్లడవులలోఁ గష్టపడినది చాలదా? నాకుఁ గలిగిన దుష్టస్వప్నమునకు ఫలమిదియే కాఁబోలు" అని తలఁచెను.

ప్ర. 3 : చారులు శ్రీరామునితో విన్నవించిన వృత్తాంతమేమి?

జ : సీతకోరిన కోరికవిని శ్రీరాముఁ డట్లేయనిచెప్పి యామెను బంపివైచిన పిదప చారులను రావించి విశేషములు చెప్పుఁడనెను. వారిట్లు చెప్పిరి. "నీవు సాక్షాత్పరమాత్ముఁడవు. త్రిలోక పావనుఁడవు. అట్టి దేవరవారితో నెవరో దుష్టులైన

పౌరు లన్న మాటలు చెప్పుటకు భయమగుచున్నది. అయినను దమ యాజ్ఞాబద్ధులమై చెప్పుచున్నాము. నగరమున నొక చాకిత మగఁడు పొమ్మన నలిగి పుట్టినింటికిఁ బోయెను. ఆమె తండ్రి యామెను వెంటనిడుకొని రాఁగా, నామెభర్త. 'యిల్లు విడిచి నాల్గుదినము లెందేనేగిన భార్యనేలుకొనుటకు రక్కసుఁడు గొంపోయిన సీతను మఱలఁదెచ్చుకొన్న శ్రీరాముఁడనుగాను నేను.' అనెను. నీచుఁడు గావున నట్లు ప్రేలెను.'' అని చారు లెఱింగించిరి.

ప్ర. 4: లోకాపవాద వృత్తాంతము తెలంగాఱింగిన పిమ్మట భరత లక్ష్మణ శత్రుఘ్ను లేమనిరి ?

జ.: చారుల వలన లోకాపవాద వార్త వినిన రాఘవుఁడు మఱు నాఁడు చింతాక్రాంతుఁడై వివర్ణవదనుఁడై యుండ నాతని చెంతకు భరత లక్ష్మణ శత్రుఘ్నులువచ్చి యా స్థితియందున్న శ్రీరామునికి మ్రొక్కిరి. కొంతవడికి శ్రీరాముఁడు చారుల వాక్యములను, తన నిర్ణయమును వారికి వినిపించెను. భరతుఁడు భయకంపితుఁడై ''అయ్యా, నీవంటి వివేకి యిట్లన రాదు. వెనుక రావణసంహారణానంతరము సకలదేవతలు నుతింపగా నాసాధ్వి యగ్నిప్రవేశ మొనర్చి సురక్షితయైయుండ మన తండ్రికూడ నామెను మెచ్చుకొనెను. జానకిని ఘోరా రణ్యమున విడచుట యనుచితము''అని పలికెను. లక్ష్మణుఁడు రోషారుణితలోచనుఁడై ''లోకమాతయగు జానకి నిట్లు లెగ్గులాడిన నరాధముని చీల్చవలెగాని జానకిని విడచుట యుక్తముగా''దనెను. శత్రుఘ్నుంఁడును నట్లే పలికెను.

ప్ర. 5: శ్రీరాముఁడు తన నిర్ణయము నెట్లు సమర్థించెను ?

జ.: భరత లక్ష్మణ శత్రుఘ్నులు పలికిన పలుకులు విని శ్రీరాముఁడు తనకు జానకికంటె కీర్తియే ప్రధానమని చెప్పుచు నిట్లు పలి కెను. ''జానకి పరమ పతివ్రతా శిరోమణియని నే నెఱుంగు దును. కాని లోకాపవాదము పుట్టినపుడు ధనమునైన, సోద

దులనైన, శిష్టులనైన, తుదకు దేహమునైనఁ దృణప్రాయ ముగాఁ ద్యజింతును. మనువంశ సంభవులు, మానధనులునైన మనపూర్వులు హరిశ్చంద్రాదులు కీర్తికొఱకే కదా సర్వమును బరిత్యజించిరి. కీర్తిహీనులు జీవన్మృతులు. పూర్వపు రాజర్షులు శరీరములనైనఁ బరిత్యజించి కీర్తిని సంపాదించిరి. కనుక నాకును సదియే కర్తవ్యము''—అని తన నిర్ణయమును సమర్థించుకొనెను.

ప్ర. 6 : శ్రీరాముఁడు లక్ష్మణుని కేమని యాజ్ఞాపించెను ?

జ. : భరత శత్రుఘ్నులు శ్రీరామ నిర్ణయమును విని భయపడి యక్కడ నిలువలేక వెడలిపోయిరి. లక్ష్మణుఁ డొక్కఁడే దుఃఖించుచు నచ్చటనే నిలుచుండి యుండెను అట్టి లక్ష్మణుని తో శ్రీరాముఁడు 'సీతను గంగాతీరమున నడవిలో విడిచి రమ్ము. కాదేని యీ ఖడ్గముతో నా తల నఱుకుము. జానకి నడవిలో విడిచిన పాపము నాకే కాని నీకు లేదు''—అని కఠిన ముగా నాజ్ఞాపించెను.

ప్ర. 7 : సీత ప్రయాణమగుచుండఁ గౌసల్య యేమనెను? ఆమెకు సీతచెప్పిన సమాధాన మేమి ?

జ. : ప్రయాణోన్ముఖయైన సీతను గని కౌసల్య ''కోమలాంగివి, నీవు ఘోరవనంబుల కెట్లు పోయెదవు. ఇదేమి కోరిక మానుము'' అనెను. అందులకు సీత ''సమస్తభయములను బోఁగొట్టువాఁడైన శ్రీ రఘువీరుఁడు నా మనస్సున నుండగా నాకు లేశమైన విచారము గలుగదు. మీ దయ యుండ నే యశుభము ను రాదు. మనస్సునందు శంకలు విడువుఁడు'' అని సమాధానము చెప్పెను.

ప్ర. 8 : మార్గమున సీతా లక్ష్మణులకుఁ గానఁబడిన దుశ్శకునము లేవి ? వానిని గాంచి సీత యేమనెను ?

జ. : సీతాదేవి యారోహించిన రథము బయలుదేరుటకు ముందు గుఱ్ఱములు కన్నీరు నించినవి. మార్గమున కాకి, యేత్రింత,

మున్నగు పక్షు లాకాశమునఁ గన్పట్టెను. కుందేలు నక్క మున్నగు జంతువులు రథమునకు కడ్డముగా నడచెను. సీతమ్మకు దక్షిణ నేత్ర మదరెను. ఈ దుర్నిమిత్తములం గాంచి సీత లక్ష్మణునితో, "చాల దుశ్శకునములు కనఁబడుచున్నవి. చేయివెట్టి కలంచినట్లు హృదయము దురపిల్లుచున్నది. కరుణా సముద్రుఁడు, మహాశూరుఁడు నగు రామభద్రునకు భద్రమగు గావుత; అనంతకళ్యాణగుణ సాంద్రుఁడైన శ్రీరామచంద్రుఁడయోధ్య నేలుచు నాచంద్రతారకముగ సుఖంబుండుగాక" అనెను.

ప్ర. 9 : లక్ష్మణుని వలన శ్రీరామాజ్ఞను వినిన సీత యాతనితోఁ బలికిన పలుకులను మీ సొంతమాటలలో వ్రాయుఁడు.

జ. : లక్ష్మణుని వలన శ్రీరామాజ్ఞను విని సీత మూర్ఛఁజెంది, యాతని యుపచారముల వలన దెలిసి యిట్లనెను. "లక్ష్మణా నీవు నీ యన్నయు వెనుకఁ బదునాలుగేండ్లరణ్యమున నన్ను గాపాడి యిప్పుడిట్లు నిర్దాక్షిణ్యముగా విడువఁదగునా ? నీవు నిట్టి నిర్దయత్వంబున కొడిగట్టితివా ? అయినను నిన్నే మనం గలదానను ? నా పాపమే నా కోరికగాఁ బరిణమించెను గాఁబోలు. లేకున్న రాఘవుఁడు నిష్కారణముగా నిట్లేల శాసించును. ఆతఁడు నా కొఱకై శివధనుస్సును విఱుచుట మొదలు రావణ సంహారమువఱకు నెన్ని దుర్ఘటకార్యముల నొనర్పలేదు ? అట్టి గుణాభిరాముఁడిట్లాజ్ఞాపించెనా ? ఇది నా నోముల ఫలమేకాని నీవేమి చేయుదువు ? మంచిది. సాకేత నగరమునకుఁ బోయిరమ్ము. నే నా రామదేవుని ముఖారవింద మునే మనమున ధ్యానించుచుండెదను. అత్తలకెల్లం గేలు మోడ్చితిననుము. పూర్ణగర్భయు, నిరపరాధయునైన జానకిని నిష్కారణముగా నట్టడవిలోడించి వచ్చితిననుము. భరత శత్రుఘ్నుల నడిగితి ననుము. శ్రీరామచంద్రునకు భద్రమగు గావుత ! అని సీత పలవించెను.

ప్ర. 10: జానకి నడవిలో విడిచి మగిడిపోవుచు లక్ష్మణుఁ డేమనెను?

జ. : జానకి నడవిలో విడిచి పోవుచు లక్ష్మణుఁ డామెతో సాధ్వీ శిరోమణీ! దైవయోగ మిట్లుండె, నింక వగవకుము. ఇటకుఁ జేరువనే తాపసాశ్రమములు గలవు. భాగీరథియు భూదేవియు, వనదేవతలు నిన్ను గాపాడుదురుగాక! నీ యోర్పు, నీ పాతివ్రత్యము నిన్ను రక్షించుఁగాక! అనుచు నామెకుఁ బ్రదక్షిణము చేసి వెళ్లలేక వెళ్లలేక వెళ్లెను.

ప్ర. 11: క్రింది వానిని సందర్భపూర్వకంబుగా వివరింపుఁడు.

(1) కీర్తిహీనులు జీవన్మృతులుగా నెఱుంగుదురు.

(2) అపకీర్తికి వెఱవని సుగ్రీవునకు, విభీషణునకు నిట్టి చెయిదంబులు సెల్లుంగాని నీకుం జెల్లునే?

జ: (1) శ్రీరాముఁడు లోకాపవాదమును, దన నిర్ణయమును భరత లక్ష్మణ శత్రుఘ్నుల కెఱిఁగించెను. ఆ నిర్ణయము న్యాయము గాదని వారు వాదించిరి. వారి మాటలను గాదనుచుఁ దన నిర్ణయమును సమర్థించుచు మనువంశసంభవులు, మానధనులునైన తమ వంశములోని పూర్వరాజర్షు లెల్లరు కీర్తికొఱకే సర్వస్వమును ద్యజించిరనియు, కీర్తియే ప్రధానముగాని తక్కినవి ప్రధానము గావనియు, కీర్తిలేనివాఁడు బ్రదికి యుండియుఁ జచ్చినవాఁడే యనియుఁ గావున సీతను బరిత్యజించి కీర్తిగాంతుననియుఁ జెప్పెను.

(2) గంగాతీర కాననమును జేరిన పిదప లక్ష్మణుఁడు సీతకు శ్రీరామాజ్ఞను వినిపించెను. ఆమె మూర్ఛఁజెంది కొంతవడికిఁ దెలిసి, లక్ష్మణునితో "నన్ను నీవు నీ యన్నయుఁ బూర్వము పదునాలుగేండ్లరణ్యమున గాపాడితిరి. నా మఱందులలోనెల్ల నీవే కడుంగడు భక్తివిశ్వాసములు గలవాఁడవు. నీ విట్టి నిర్దయత్వంబున కొడిగట్టితి వేల?" అనుచు నిట్టిపనులు సుగ్రీవ విభీషణు లట్టివారికిఁ దగునుగాని నీ యట్టి భక్తివిశ్వాసపరునకు గావు అని పలికెను.

సుగ్రీవుఁ డన్నయగు వాలి భార్యను గొనిపోవుటచేతను, విభీషణుఁ డన్నకు ద్రోహ మొనర్చి యాతని గుట్టుమట్టులను శత్రువగు శ్రీరామునకుఁ జెప్పుటచేతను. వీరిద్దఱు భ్రాతృద్రోహులైరి. అట్టివారి కిట్టి క్రూరకర్మము తగునుగాని లక్ష్మణుని వంటి విశ్వాసపరునికిఁ దగదు. అని సీత తన యభిప్రాయమును దెలిపెను.

ప్ర. 11 : క్రింది వానిలోని యలంకారములను పేర్కొనుఁడు.

(1) పంచమహాపాతకంబు లనియెడి చీఁకట్లకు దేవర నామాక్షరంబులు చండభానుకిరణంబులు.

జ. : ఇందు రూపకాలంకారము గలదు.

(2) "దుష్టపురుషునిచే నిందితంబగు వేదంబుకరణి క్షుద్రజనులచేఁ బరమసాధ్వియగు సీత నిందంజెందె."

జ. : ఇందు ఉపమాలంకారము గలదు.

## III. వ్యాకరణాంశములు

ప్ర. 1: క్రిందివానికి విగ్రహవాక్యములువ్రాసి యవి యే సమాసములో పేర్కొనుఁడు.

1. గంగాతీరము = గంగయొక్క తీరము : షష్ఠీ తత్పురుషము
2. నాలుగు దినములు = నాలుగు రోజులు : ద్విగు సమాసము
3. భరత లక్ష్మణ శత్రుఘ్నులు = భరతుఁడు, లక్ష్మణుఁడు, శత్రుఘ్నులును : బహుపద ద్వంద్వము
4. దశముఖుఁడు = పదిముఖములు గలవాఁడు : బహువ్రీహి
5. కీర్తిహీనులు = కీర్తిచేత హీనులు : తృతీయా తత్పురుషము
6. పాదారవిందములు = పాదములనెడి యరవిందములు : రూపకసమాసము
7. లోకత్రయము = లోకములయొక్క త్రయము : షష్ఠీ తత్పురుషము
8. సుధాప్రకాశము = అమృతముయొక్క కాంతివంటి కాంతిగలది : బహువ్రీహి
9. కాఱుచిచ్చు = అడవియందలి చిచ్చు : సప్తమీతత్పురుషము
10. పాషాణ కర్కశము = పాషాణములచే కర్కశమైనది : తృతీయా తత్పురుషము

11. అలంఘనీయము = దాటుటకు వీలుకానిది : నఞ్ తత్పురుషము

12. ముఖాంబుజము = ముఖమనెడు నంబుజము : రూపక సమాసము

13. విరహవేదన = విరహముచే వేదన : తృతీయా తత్పురుషము

14. అదృష్టిగోచరుఁడు = దృష్టికి గోచరము కానివాఁడు: నఞ్ తత్పురుషము

15. బింబాధరము = బింబమునకు అధరము : కర్మధారయము

16. పూర్ణగర్భ = పూర్ణమైన గర్భము గలది : బహుబ్రీహి

17. వశిష్ఠ విశ్వామిత్రులు = వశిష్ఠుఁడును, విశ్వామిత్రుఁడును : ద్వంద్వ సమాసము

ప్ర. 2 : క్రింది ప్రకృతులకు వికృతులు, వికృతులకుఁ బ్రకృతులు వ్రాయుఁడు.

| ప్ర | వి | ప్ర | వి |
|---|---|---|---|
| అటవి | అడవి | సర్పము | సప్పము |
| కులము | కొలము | అంతఃపురము | అంతిపురము |
| బ్రహ్మ | బమ్మ | రత్నము | రతనము |
| అగ్ని | అగ్గి | గంధము | గందము |
| పుణ్యము | పున్నెము | రథము | అరదము |
| రాక్షసుఁడు | రక్కసుఁడు | ప్రయాణము | పయనము |
| కుమారుఁడు | కొమరుఁడు<br>కొమారుఁడు | భాష | బాస |
| ముహూర్తము | మూరుతము<br>మూర్తము | రాత్రి | రాతిరి |
| | | చంద్రుఁడు | చందురుడు |
| కీర్తి | కీరితి | పుష్పము | పువ్వు |
| కూర్పాసము | కుప్పసము | చక్రవాకము | జక్కవ |
| సంతోషము | సంతసము | శుచి | చిచ్చు |
| పేటిక | పెట్టె | ముఖము | మొగము |
| భక్తి | బత్తి | స్నానము | తానము |
| ప్రతిజ్ఞ | ప్రతిన | కార్యము | కర్జము |
| మృగము | మెకము | ఆజ్ఞ | ఆన |

ప్ర. 3 : క్రిందివాని యందలి వ్యాకరణ విశేషములను వివరింపుఁడు.

1. పుట్టిన + ఇంటికి = పుట్టినింటికి = పుట్టినయింటికి :- అత్తునకు సంధి బహుళంబుగా నగు.

2. చాకిత :- 'త' వర్ణకంబు కులవాచకంబునకు స్త్రీ వాచ్యంబగునపుడు మతుబర్థంబునం దగు.

3. యోగ్యంబులు సేయనట్టి :- ప్రథమమీఁది పరుషములకు గసడదవ లు బహుళంబుగా నగు.

4. ఈ + నారీమణి :- త్రికసంధి చూడుఁడు.

5. నిట్టూర్పులు = నిడు + ఊర్పులు :- కుఱు, చిఱు, కడు, నడు, నిడు శబ్దంబుల రడ లకచ్చుపరంబగునపుడు ద్విరుక్త 'ట' కారంబగు.

6. నాదుకోరిక :- యుష్మదస్మదాత్మార్థకంబుల కుత్తరపదంబు పరంబగునపుడు 'దు' గాగమంబగు.

7. ఆ + యింతి :- యడాగమ, త్రికసంధులను జూచునది.

8. నెఱ + మొగమును = నెమ్మొగమును :- అన్యంబులకు సహిత మిక్కార్యంబులు గొండొకచోఁ గానంబడియెడి. ఇక్కడ లోపద్విత్వములు కానంబడుచున్నవి.

9. ఆ + కాననము :- త్రికసంధి చూడుఁడు.

10. నడు + అడవి :- పై "నిట్టూర్పులు" చూడుము.

11. ఎల్లకార్యములు :-

(*a*) సర్వపర్యాయంబైన యెల్లశబ్దంబులు ద్రుతాంతంబయిన యవ్యయంబు. దీనికి సమాసంబున విశేష్యంబునకుముందు ప్రయోగంబు లేదు.

(*b*) సమాసంబునందు ద్రుతంబునకు లోపంబగు.

# 3. సఖ్యసంధానము

## I. అర్థాదులు

పుట 16. నావుడు=అనఁగా; జలపాన+అర్థము=జలము త్రాగుటకొరకు; వెఱఁగుపడి=ఆశ్చర్యపడి; పరహృదయము=ఇతరుల మనస్సు; అవగతమైనది=తెలియఁబడినది; ధీమంతునకు=బుద్ధిమంతునకు.

పుట 17. సుగమము=సులభము; తురంగ మాతంగాదులు=గుఱ్ఱము, ఏనుఁగు మొదలగునవి; వహన+ఆది+కార్యంబులన్ = మోయుట మొదలగు పనులయందు; కర్తవ్య+అంశము=చేయవలసిన విషయము; తత్+భావ+అనురూపముగ = అతని మనస్సున కనుగుణముగ; కడిఁది=అశక్యము; ప్రియవాదికి=ప్రేమగా మాటలాడువానికి; కోప,ప్రసాదములు=కోపము,ప్రసన్నత అనువానిని; సమయ+ఉచితముగ= సమయమునకుఁ దగినట్లుగా; కట్టెదురు పట్టుదలఁగి=ఎట్టఎదురుగానుండుచోటునుండి

తప్పకొని (ప్రక్క గానుండి); తనవలను=తనదిక్కు; అవిరుద్ధముగ=వ్యతిరేకముగ నుండునట్లు; నేరిమి=నేర్పు.

పుట 18. ఇరవు=ఉనికి; పిరిగొనన్=పెనగొనఁగా; తావకంబు+అగు=మీది అగు; సత్+అసత్+వివేక+సంపన్నుఁడు=ఇదిమంచి, ఇదిచెడు అను జ్ఞానము నెడి సంపదగలవాఁడు; క్షుద్రులు=నీచులు; చక్షుష్మంతునకు=కన్నులుగలవానికి; అవధరింపుఁడు=వినుట కెచ్చరికపడుఁడు; కూపస్థమండూకము = నూతిలోనున్న కప్ప; గొందిమూల; లోకవృత్తంబున=లోకవృత్తాంతమున.

పుట 19. సన్నిధాన ప్రభావంబు = సామీప్యముయొక్క శక్తి; అవశ్యగ్రాహ్యంబు=నిశ్చయముగ గ్రహింపఁదగినది; ఇచ్చవడిన తెఱఁగు = చేష్టలుడిగిన విధము, ఉత్తలంబు=పరితాపము, కలఁత; దాఁపురము=దాపరికము; అఖిల, సత్త్వ, శరణ్యంబు=సకల స్వామివైనజంతువులకు దిక్కగునది; మత్+అధీనంబు=నాకులోఁబడినది; పిపాసార్దితుఁడు=త్రాగుటయందలి కోరికచేత నొప్పింపఁబడినవాఁడు (అర్దితుఁడు అనుట తప్పు); నినాదము=ధ్వని; ఆరావము=ధ్వని; సహ్యము=సహింపఁదగినది; అలఁతివాని నేనిన్=అల్పునైనను; ఒప్పరికించు=ఉపేక్షించు.

పుట 20. లాతివాని=ఇతరుని, పగతున్=శత్రువును, శ్రేయః+దాయకము=శ్రేయస్సును గూర్చునది, దోరె నేని=వృతినొందె నేని, దాయ=శత్రువులు, కాల, దేశ, ఉచితంబుగ=కాలమునకు, దేశమునకుఁ దగినట్లుగ, విపక్షు=శత్రువును, తమకింపరాదు=తొందరపడరాదు, లెంక=సేవకుఁడు, లోఁగొనవచ్చు నేని=లోఁబఱుచుకొన వచ్చు నేని, వీతెంచిన=బయల్వెడలిన.

పుట 21. నీపొలఁకువ=నీ జాడ, అనుగ్రాహ్యుండు=అనుగ్రహింపఁ దగినవాఁడు, నిగ్రాహ్యుండు=నిగ్రహింపఁ దగినవాఁడు, తావకంబగు=నీదగు, అవక్ర, విక్రమంబు=వక్రముగానిశౌర్యము, ప్రభంజనుఁడు=వాయువు, భంజించు=విఱుచు, వినతంబులు=వంగినవి, తృణవితానంబులు=గడ్డిపరకల సమూహములు, ముదలయే=ఆజ్ఞయేనా ?

పుట 22. వినమితగాత్రుఁడు=వంగినశరీరముగలవాఁడు, మసలక=ఆలస్యము చేయక, ముప్పిరి (మూఁడు+పిరి)=మూఁడుసార్లు పెనఁగొన (అధికముకాఁగా), మత్+నియోగములందు=నాపనులందు, దొరకొని=మొదలుకొని, నిర్+ఆదరుఁడు=ఆదరము లేనివాఁడు.

## II. ప్రశ్నోత్తరములు

ప్ర. 1: తెనుఁగున హితోపదేశమున నెవ్వరెవరే భాగములను రచించిరి? మీ పాఠ్యభాగమున సఖ్యసంధానము ఏ భాగములోనిది–దానిని రచించిన వారెవరు? వారి యితర గ్రంథములేవి?

జ.: హితోపదేశమునందలి మిత్రలాభ మిత్రభేదములను పరవస్తు చిన్నయసూరిగారును, సంధివిగ్రహములను కందుకూరి వీరేశలింగముగారును రచించిరి. పాఠ్యభాగమైన సఖ్యసంధానము చిన్నయసూరిగారు రచించిన మిత్రభేదములోనిది.

సూరిగారు క్రీ.శ. 19వ శతాబ్దము ప్రథమార్ధమున మద్రాసు ప్రెసిడెన్సీ కళాశాలలో నాంధ్రోపాధ్యాయులుగా నుండుచు నాంధ్రభాష కపారమైన సేవచేసిరి. వారు బాల వ్యాకరణము, సూత్రాంధ్ర వ్యాకరణము, ఆంధ్రధాతుమాల మున్నగు లక్షణ గ్రంథములను రచించిరి. నన్నయభట్టారకుని పిదప నీయనవలె వచనమును ప్రౌఢగంభీరముగ రచించిన వారు లేరు.

ప్ర. 2: పండితునకుఁ బామరునకు భేదమేమి?

జ.: పరేంగితావగాహియగు బుద్ధియొక్క-టియె పామరునికంటె పండితునియందు గల విశేషము.

ప్ర. 3: "తొలుత రాజునుజూచి నుడువఁదొరకొను నర్థమేది" కరటకునికి దమనకుఁడు చెప్పిన సమాధానమేమి?

జ.: 'తొలుత రాజునుజూచి నుడువఁదొరకొను నర్థమేది' అని యడిగిన కరటకునికి దమనకుఁ డిట్లనెను–" ఈ యర్థము వచింపవలెనని నియమమేమియు లేదు. ప్రభువునెదుట ప్రతిభాశాలి సమయోచితముగ మాటలాడును. అది బహువిధములుగా నుండును. రాజునకుఁ బ్రక్క-గా నిలిచి, యాతని మొగమునే చూచుచు, యాతఁడు తనవంకఁ జూచిన సమయమున, నప్పటి కుచితమైనట్లు ముందువెనుక లాలోచించి, రాజు మనస్సు

నెఱేఁగి, మిగిలిన రాజ సేవకులకు వ్యతిరేకము గాకుండఁగఁ బలుకవలసినది పలుకవలయు' - అని చెప్పెను.

ప్ర. 4 : పురుషున కెట్టివానికేని వివేకంబు పుట్టింప నేవి సమర్థంబులు? అట్టివానిలో నొక్కటియైన లేనివాని జీవిత మెట్లుండును?

జ. : బహు దేశాటనంబును, బహు శ్రమలతోడ నిరంతర సాంగత్యంబును, గావ్య శాస్త్ర విచారంబును, రాజాస్థానంబుల బహు కాల సేవనంబును బురుషున కెట్టివానికేని వివేకంబు బుట్టింప సమర్థంబులయి యుండును.

ఈ నాలుగింట నొక్కటియైన లేనివాఁడు కూపస్థ మండూకమువలె స్వజీవన మాత్రకుం దృప్తినొంది, లోకవృత్తంబున మూఢుండయి నశించును.

ప్ర. 5 : ఎవరికి లోకు లశక్తిభీరుత్వంబు లారోపింతురు?

జ. : ఎట్టివానికేని బలదర్పంబునఁ బగతు నొప్పరికించు నట్టివానికి లోకు లశక్తిభీరుత్వము లారోపింతురు.

ప్ర. 6 : పింగళకుని మాటలుగా సంజీవకునితో దమనకుఁ డేమనెను?

జ. : ఈ యరణ్యము నాయధీనము; ఇందలి జంతువులెల్ల నా యాజ్ఞానువర్తులై మెలంగుచున్నవి. నీవుకూడ నట్లే యుండు నది. అంతియకాక నాయనుచరులతోఁగూడి యుండగోరుదు వేని నీకుఁ దగిన రాచకార్యము నొసంగెదము. నీ యిష్ట మేదియో యట్లొనరింపవచ్చును. అని పింగళకుఁడు చెప్పిపంపె నని సంజీవకునితో దమనకుఁడు చెప్పెను.

ప్ర. 7 : తనకడకు వచ్చిన సంజీవకునిఁగాంచి పింగళకుఁ డేమనెను?

జ. : సంజీవకునిగాంచి పింగళకుఁడు, "నిన్నుఁగూర్చి మా దమనకుం డుగ్గడింప విన్నాము. సంతసించితిమి. నీ యట్టి బుద్ధిమంతుఁడు మా కొలువున నుండుట మాకుఁ జాల లాభము. నీకు మంత్రిపదం బొసంగితిమి. జాగరూకుఁడవై మాకు మాఱుగఁ గార్యనిర్వహణ మొనర్చుచు పరివారమును రక్షించుచు నుండుము."- అనెను.

ప్ర. 8 : క్రింది వాక్యములను సందర్భసహితముగ వివరింపుఁడు :

1. చక్షుష్మంతునకే దీపంబుగాని యంధునకుఁ గొఱయగునె.

జ : పింగళకుఁడు యమునాతీరమునకు పిపాసితుఁడై వెడలియు సంజీవకుని అంకెవిని బెచ్చువడి వెనుకకు మఱలుట చూచి దమనకుఁ డాతనిని సమీపించి పిలిచెను. పింగళకుఁడు కుశల మడిగెను. అపుడు దమనకుఁడు తమ క్షేమమునకు లోపము లేదనియు, స్వామికిఁ దఱియెఱిఁగి భృత్యుఁడు హితాహితము లెఱిఁగింపవలయు ననియు, ప్రియవాదియయ్యును భృత్యుఁ డుపేక్షాపరుఁడైనచో స్వామిద్రోహి యగుననియుఁ జెప్పెను. మంచి చెడులను ఆలోచింపఁగల ప్రభువునకుఁ బ్రాజ్ఞులైన భృత్యులతో నేమిపని కలదు అని తలంపరాదు, అనియుఁ జెప్పి కన్నులు గల వానికే దీపము గావలయునుగాని యంధునకు దానితో నేమిపని యని తన వాక్యమును సమర్థించుకొనెను.

2. వలదని వాకొనకుండ మూఁకుట నోళులు మూయవచ్చునే !

జ : యమునాకచ్ఛమున నొక భయంకరారావమును విని కొంతసేపు బెచ్చువడి జలపానము మాని తన యిరవునకు మఱలి వచ్చిన పింగళకుఁడు జరిగిన దానిని వివరించి, నిశ్చయముగ నట్టి ధ్వని కావించిన జంతు వలంతిగ నుండుననియుఁ, దన వంటి యుత్తమశూరునకు శత్రువుల యాధిక్యము సహింపరాదనియుఁ జెప్పెను. ఎట్టి శూరుఁడైనను శత్రువు నుపేక్షించినచో వానికి లోకులశక్తిభీరుత్వము లాపాదింతురు. అట్లు లాపాదింపవలదని లోకుల నోళులు మూఁకొట మూయరాదు అనెను. మంచిగాని, చెడుగాని లోకులు జెప్పకొనక మానరు. వారిని వలదని యెవ్వరును వారింపఁజాలరు. అని పింగళకుని భావము.

3. ప్రభంజనుండు మహాభూజంబుల భంజించుంగాని, తృణవితానంబులం బెకలింపఁ గడంగునెట్లు.

జ. : పింగళకుని యాజ్ఞవడసి దమనకుఁడు సంజీవకుని పాలికిఁబోయి కొన్ని మాటలాడి, రాజుకడకు రమ్మని చెప్పి యాతని కంటె ముందుగాఁ బింగళకుని సమీపించి యిట్లనెను. స్వామీ, యీ అంకె వైచినవాఁడు సంజీవకుఁడను వృషభరాజు. ఆతఁడు మీ పరాక్రమమును విని భయభ్రాంతుఁడై యున్నాడు. ఆతఁ డేలినవారి కనుగ్రాహ్యుండుగాని నిగ్రాహ్యుండుగాఁడు. అని చెప్పుచు, నట్టి యనుగ్రాహ్యుని మీఁద పరాక్రమము చూపుట కూడదనియుఁ జెప్పి దానిని సమర్థించుట కొఱకు ఈ వాక్యమును జెప్పెను. వాయుదేవుఁడు మహాబలవంతుఁడు. ఆతఁడు తన కడ్డుగ గర్వమున నిలుచుండు మహాభూజములనే పెకలించుఁగాని వినయమున వంగియుండు తృణవితానముల నేమియుఁ జేయఁడు అని ఈ వాక్యము భావము.

## III. వ్యాకరణాంశములు

ప్ర. 1 : క్రింది సమాసములకు విగ్రహవాక్యములు వ్రాసి, సమాసనామములఁ బేర్కొనుఁడు.

1. చిత్తవృత్తి = చిత్తముయొక్క వృత్తి : షష్ఠీ తత్పురుషము
2. రాజపురుషుఁడు = రాజుయొక్క పురుషుఁడు : షష్ఠీ తత్పురుషము
3. దేవరచిత్తము = దేవరయొక్క చిత్తము ,,
4. యమునాకచ్ఛము = యమునయొక్క యొడ్డు ,,
5. దూరభూమి = దూరమైన భూమి : వి. పూ. కర్మధారయము
6. హితాహితములు = హితమును, అహితమును : ద్వంద్వ సమాసము
7. భయాక్రాంతుఁడు = భయముచేత ఆక్రమింపఁబడినవాఁడు : తృతీయా తత్పురుష సమాసము

ప్ర. 2 : క్రిందివాని యందలి వ్యాకరణ విశేషములను వివరింపుఁడు.

1. ప్రభువు + ఆనతి = ప్రభువునానతి :- షష్ఠీ తత్పురుషమునం 'డు' కార 'ఋ' కారంబుల కచ్చుపరంబగునపుడు నుగాగమంబగు.
2. కడు + ఎదురు = కట్టెదురు :- కుఱు, చిఱు, కడు, నడు, నిడు శబ్దంబుల ర డ ల కచ్చుపరంబగునపుడు ద్విరుక్త 'ట' కారంబగు.

3. జోహారు + పొనరించు = జోహారులొనరించు :- ప్రథమమీఁది పరుషములకు గ స డ ద వ లు బహుళంబుగానగు.

4. నా పుత్తెంచిన = నేను పుత్తెంచిన :- కృత్పద ప్రథమకు షష్ఠి యగు.

5. చేయు + అర్థము = చేయునర్థము :- ఉదంతంబగు తద్ధర్మార్థ విశేషంబున కచ్చుపరంబగునపుడు నుగాగమంబగు.

ప్ర. 3: క్రిందివానిని విడఁదీసి సంధులను పేర్కొనుఁడు :

1. పర + ఇంగితము = పరేంగితము : గుణసంధి
2. సమయ + ఉచితము = సమయోచితము : గుణసంధి
3. మత్ + నియోగము = మన్నియోగము : అనునాసిక సంధి
4. కర్తవ్య + అంశము = కర్తవ్యాంశము : సవర్ణదీర్ఘ సంధి

ప్ర. 4: క్రింది ప్రకృతులకు వికృతులు, వికృతులకుఁ బ్రకృతులు వ్రాయుఁడు.

| ప్ర | వి | ప్ర | వి |
|---|---|---|---|
| హృదయము | డెందము | ఆకాశము | ఆకసము |
| ఆజ్ఞ | ఆన | ఇచ్ఛ | ఇచ్చ |
| భక్తి | బత్తి | శబ్దము | సద్దు |
| స్వామి | సామి | చిత్రము | చిత్తరువు |

# ౮. బుద్ధజన్మ

## I. అర్థాదులు

పుట 24. దుఃఖభాజనము=దుఃఖమునకుఁ బాత్రమైనది.

పుట 25. ఏకచ్ఛత్రము=ఒకేగొడుగు కలుగునట్లుగా (సార్వభౌముఁడుగా) ఆవిర్భావమున్=పుట్టుకలను, నదీనదములు=నది యనఁగా బడమటదిక్కునఁ బుట్టి తూర్పుసముద్రమునఁ గలియు ప్రవాహములు. నదము అనఁగా తూర్పునఁబుట్టి పడమర సముద్రమునఁ గలియు ప్రవాహములు, నవ, కిసలయ, పుష్ప, ఫల, సమృద్ధములు=క్రొత్త చిగుళ్ల చేతను, పూవుల చేతను, ఫలముల చేతను సమృద్ధములైనవి, నిర్వ్యాజ, ఆనందము=కపటములేని సంతోషము, దివ్యులు=దేవతలు, స్తవములు=పొగడ్తలు.

పుట 26. అద్భుత సముద్రము=అద్భుతరస మనెడు సముద్రము, వ్యక్తము లయ్యెను=తెల్లములయ్యెను, కారాబద్ధులు=కారాగృహమున బంధింపఁబడినవారు, స+అభినయముగ=అభినయముతోఁ గూడినట్లుగా.

పుట 27. గమనయోగ్యముగ=పోవుట కుచితమైనది, అవ్యక్త మధుర స్వనముతో=తెలియఁబడని తీయని ధ్వనితో, మనః ప్రమోద ఆవహము=మనస్సున కధికమైన సంతోషమును కలిగించునది, వృక్షసంతానము=వృక్షముల సమూహము, మనోజ్ఞ పుష్పములు=మనోహరములగు పూవులు.

పుట 28. నేత్ర+ఉత్సవము=నేత్రోత్సవము, కనుల పండువు.

పుట 29. దృష్టిపథము=చూపుయొక్క మార్గము, కైవారములుచేయు=స్తోత్రములుచేయు, వేదత్రయ పారగులు=మూఁడువేదముల యంతము పొందినవారు

పుట 30. భూరిదక్షిణల=అధికమైన ధనములతో, సంతర్పణముచేయు=మిక్కిలి తృప్తులుగాఁజేయు, మేన=శరీరమున, సర్వసంగ పరిత్యాగము=అన్ని సంసర్గములను వదలుట.

## II. ప్రశ్నోత్తరములు

ప్ర. 1: బుద్ధజన్మ యను మీ పాఠ్యభాగ మే గ్రంథములోనిది? దానిని రచించిన వారెవరు? వారి యితర గ్రంథములేవి? ఆకవినిగూర్చి మీకేమి తెలియును?

జ. : బుద్ధజన్మ యను పాఠ్యభాగము కీ. శే. శ్రీ చిలకమర్తి లక్ష్మీనృసింహముగారు రచించిన సిద్ధార్థచరిత్రములోని మూఁడవ యధ్యాయములోనిది.

లక్ష్మీనృసింహముగారు కర్పూరమంజరి, సౌందర్యతిలక, అహల్యాబాయి, రామచంద్ర విజయము, గణపతి, మున్నగు నవలలను, సిద్ధార్థచరిత్ర మున్నగు మహాపురుషుల చరిత్రములను, గయోపాఖ్యానము మున్నగు స్వతంత్ర నాటకములను, భాస నాటకానువాదములను, మఱియు పెక్కు వ్యాసములను, ప్రహసనములను రచించిరి.

వీరి వచనశైలి మృదుమధురమై హృదయ రంజకముగ నుండును.

ప్ర. 2: మాయాదేవి కాంచిన స్వప్నమేమి? తత్ఫలిత మేమని బ్రాహ్మణులు చెప్పిరి?

జ. : ఒకనాఁటి రాత్రి మాయాదేవి యొక్క స్వప్నముఁ గాంచెను. అందామెను దేవతలు స్వర్గమునకుఁ గొనిపోయినట్లు, తెల్లని

యేనుఁ గొకటి యామె గర్భమునఁ బ్రవేశించినట్లును కలఁ
గనెను. ఆ స్వప్నవృత్తాంతము నామె భర్త కెఱింగించెను.
ఆతఁడు స్వప్నశాస్త్రవేత్తలగు నైదుగురు బ్రాహ్మణులం
బిలిపించి స్వప్నఫల మెఱింగింపఁ గోరెను. వారు మాయాదేవి
గర్భమున నొక కుమారుఁ డుదయించుననియు, నాతఁడు
భూవలయమునెల్ల నేకచ్ఛత్రముగఁ బాలింపఁగల సార్వ
భౌముఁడో లేక యజ్ఞానాంధకారమును బోనడఁచి తన జ్ఞాన
మనెడి మహాతేజస్సువలన లోకమునఁ బాపమును నిర్మూ
లింపఁగల మహా బుద్ధుఁడో యగుననియుఁ జెప్పిరి.

ప్ర. 3 : సిద్ధార్థుని సత్యచరిత్రము అద్భుత సముద్రమున మునిఁగిపోయినది." ఏల ?

జ. : పురాణాదులయందు మహాపురుషు లావిర్భవించిన సమయమున
వనేక మహాద్భుతములు సంఘటిల్లెనని వ్యాసాది మహర్షులు
వర్ణించిరి. అట్లే సిద్ధార్థచరిత్ర వ్రాసిన చరిత్రకారులు గతాను
గతికముగ లోకమున వ్యాపించియున్న చిత్రకథలనెల్ల సేక
రించి చరిత్ర రచించిరి. మహాపురుషుఁడైన సిద్ధార్థుని సామా
న్యునిగా వర్ణించినచో నాతని యెడ లోకులకు గౌరవముండ
దనియు, నాతఁడు శ్రీకృష్ణాదులకంటె తక్కువవాఁడుగా
నెన్నఁబడుననియు, మఱియు వ్యాసాదులకుఁ గలిగిన కీర్తి
ప్రతిష్ఠలు తమకుఁ గలుగవనియుఁ, గావున నద్భుతమైన
మహిమలుండి తీరవలెననియు నా చరిత్రకారులు విశ్వసించిరి.
ఇట్లగుటచే సిద్ధార్థుని సత్యచరిత్ర మద్భుత సముద్రమున
మునిఁగి పోయినది.

ప్ర. 4 : సిద్ధార్థుఁడు గర్భస్థుఁడైనపుడు గలిగిన కొన్ని మహాద్భుతములను పేర్కొనుఁడు.

జ. : సిద్ధార్థుఁడు గర్భస్థుఁడు కాఁగానే ముప్పదిరెండు నిమిత్తములు
జగమున వ్యక్తము లయ్యెను, పదివేల లోకములు మహా
తేజమున నిండెను. గ్రుడ్డివాండ్రు చూడఁగలిగిరి. చెవిటి
వాండ్రు వినఁగల్గిరి. మూఁగవాండ్రు మాటాడఁగలిగిరి. కుంటి

వాండ్రు నడువఁగల్గిరి. కారాబద్ధులు విముక్తులైరి. మహామండల మంతయు నవనవోన్మేషముదాల్చి విలసిల్లెను. అఖిల భూతములు మహానంద భరితము లయ్యెను. మాతృగర్భమున నున్నపుడుకూడ నాతని విగ్రహము చూపఱులకుఁ గానఁబడెను. అప్పుడుకూడ నాతఁడు కుడిచేయిచాచి దేవతలకు బోధించుచుండెను. ఇట్టి మహాద్భుతములే యాతఁడు జన్మించినపుడు కూడ సంభవించెను. పుట్టినవెంటనే యాతఁడు నేలపై నిలుచుండి తూర్పుదిక్కుఁ జూచెను. వేయిలోకము లాతనికిఁ గనఁబడెను. అందలి దివ్యులెల్ల పుష్పవృష్టిఁ గురిసి దుందుభులు మ్రోయించెను. అనంతర మాతఁడు తక్కిన దిక్కులఁ జూచి తనకంటె నధికు డెవ్వడును లేడని కనుగొనెను. ఆతఁ డేడడుగులమేర దుమికి "యెల్ల భూతములకంటె నేనధికుఁడను; నాకిఁక జన్మలేదు" అని పలికెను. ఆతనిఁ జూడవచ్చిన యొక తపశ్శాలి పాదములపై నా శిశువునుంచుటకు శుద్ధోదనుఁ డాజ్ఞాపింపఁగా బాలుని పాదములు తమంత తాముగా నా తపశ్శాలి శిరమున నిలిచెను. ఆ ఋషి యాతఁడు బుద్ధుఁడగునని చెప్పెను.

ప్ర. 5: ప్రసవము నిమిత్తము పుట్టినింటికి బయలుదేఱిన మాయాదేవికి శుద్ధోధనుఁ డేర్పఱచిన సౌకర్యములేవి ?

జ: మాయాదేవి జన్మస్థానమగు కోలీగ్రామమునకుఁ బోవునపుడు మార్గమునందలి లుంబినీవనమున నిమ్నోన్నత భూమిని సమ ప్రదేశము గావించెను. దారి కిరుప్రక్కలఁ బచ్చని తోరణములు గట్టించి, యరఁటిచెట్లు నాటించి, యక్కడక్కడ నిర్మల జలపూరితములగు పాత్రములఁ బెట్టించెను. ఆమె కూర్చుండుటకొక ప్రత్యేక సువర్ణపీఠమును జేయించెను. ఆమె వెనుక ప్రధాన రాజోద్యోగులందఱు పో నియమించెను. వారి ననుసరించి తన రాణులందఱు పోవలెనని యాజ్ఞాపించెను.

ప్ర. 6: బుద్ధజన్మను గురించి వేదత్రయ పారగులైన బ్రాహ్మణు లేమని పలికిరి ?

జ. : సిద్ధార్థుఁడు జన్మించిన యైదవనాఁడు నామకరణము జేయించుటకు నిశ్చయించి శుద్ధోధనుఁడు వేదత్రయ పారగులైన నూటెనమండ్రు బ్రాహ్మణోత్తములను రావించి వారిని భూరి దక్షిణలచే సంతృప్తులం గావించెను. వారిలో నెనమండ్రు జ్యోతిశ్శాస్త్రప్రవీణులు. వారిలో నేడుగురు బాలుని శరీరమున నున్న శుభలక్షణములను బరిశీలించి – యీతఁడు భూమండలము నెల్లఁ బాలింపఁగల మహాచక్రవర్తియైన నగును లేదా లోకోద్ధారకుఁడైన బుద్ధుఁడైన నగు–ననిరి. ఎనిమిదవ వాఁడగు కౌండిన్యుఁడుమాత్ర 'మీతఁడు తప్పక బుద్ధుఁడే యగు'నని చెప్పెను. బ్రాహ్మణులా బాలకునకు సిద్ధార్థుఁడని నామకరణ మొనర్చిరి.

ప్ర. 2: సిద్ధార్థుఁడు బుద్ధుఁ డెట్లయ్యెను ? ఆతనికి గలిగిన నామాంతరములను గొన్నింటిని జెప్పుఁడు.

జ. : సిద్ధార్థుఁడు సర్వసంగ పరిత్యాగ మొనర్చి జీవన్ముక్తుఁడైన పిదప బుద్ధుఁడని పేరు కలిగెను. భక్తులు వారి వారి భక్తి ననుసరించి సర్వజ్ఞుఁడని, సుగతుఁడని, ధర్మరాజని, తథాగతుఁడని, జినుఁడని యనేక నామములచేఁ బిలువఁ దొడగిరి. మఱియు నాతఁడు శాక్యులలో సర్వాగ్రగణ్యుఁడగుటచే శాక్యసింహాభిధానుఁ డయ్యెను. తల్లిని బట్టియుఁ, దండ్రిని బట్టియు నింక ననేక నామములు కలిగెను.

ప్ర. 7: "కాని యీ మహానందమంతయు రెండు దినములలో మహాదుఃఖమయ్యెను" ఆ యానందమేమి ? ఆ దుఃఖమేమి ?

జ. : సిద్ధార్థుఁడు జన్మించిన యైదవనాఁడు నామకరణోత్సవము జరిగెను. ఆ యుత్సవమున కెనుబదివేలమంది బంధుగులువచ్చి సుందరాంగుఁడైన యీ బాలునిఁజూచి యీతఁడు మహాచక్రవర్తియగుననియు, శాక్యులఖ్యాతి దిగంతముల వెలయింపఁజేయుననియు మహానందభరితులై యుండిరి. కాని

యూ మహానంద మంతయు రెండు దినములలో మహాదుఃఖ మయ్యెను. ఏడవనాఁడు మాయాదేవి మృతినొంది యెల్లఱను *దుఃఖసముద్రమున ముంచెను.

ప్ర. 8: నాఁగళ్ళపండుగ నాఁ డేమి జరిగెను ?

జ. : సిద్ధార్థుఁడు మూఁడునెలల బాలుఁడై యుండఁగ నాఁగళ్ల పండుగ వచ్చెను. ఆ యుత్సవమున రాజే ప్రధాన పురుషుఁడుగా నుండును. శుద్ధోధనుఁ డా యుత్సవమునకు బాలుని గొనిపోయెను. ఉత్సవపు సందడిలోఁ బరిజనులు బాలునిమాట మఱచిరి. అయినను నాతఁడు సామాన్య బాలకులవలె నేడువక పద్మాసనమునఁ గూర్చుండి ధ్యానని ష్ఠలో నుండెను. అప్పుడు సూర్యగతిచే నెల్ల చెట్లనీడలు వేఱొక దిశకు దిరిగి యుండఁగా నితఁడు కూర్చుండిన చెట్టు నీడమాత్రము రెండవ ప్రక్కకుఁ దిరుగక యాతని మహామహిమచేఁ బ్రకృతి విరుద్ధముగ నతనికి గొడుకు పట్టినట్లుండెను.

## III. వ్యాకరణాంశములు

ప్ర. 1: క్రింది సమాసములకు విగ్రహవాక్యములువ్రాసి సమాస నామములఁ దెల్పుఁడు :

1. హిమాలయపర్వతము = హిమాలయమను పర్వతము : సంభావనా పూర్వపద కర్మధారయము
2. అక్కచెల్లెండ్రు = అక్కయును, చెల్లెలును : ద్వంద్వ సమాసము
3. దుఃఖభాజనము = దుఃఖమునకు భాజనమైనది : షష్ఠీ తత్పురుషము
4. ఊర్ధ్వలోకము = ఊర్ధ్వమైన లోకము : వి॥పూ॥ కర్మధారయము
5. స్వప్నశాస్త్రవేత్తలు=స్వప్నశాస్త్రమును దెలిసినవారు : ద్వితీయా తత్పురుషము
6. అజ్ఞానాంధకారము=అజ్ఞానమనెడి యంధకారము : రూపకసమాసము
7. లుంబినీవనము = లుంబినీయను వనము : సం॥ పూ॥ కర్మధారయము
8. స్వప్నఫలము = స్వప్నముయొక్క ఫలము : షష్ఠీ తత్పురుషము
9. ఏకచ్ఛత్రము = ఒక్కగొడుగు : ద్విగు సమాసము

10. నిమ్నోన్నతము = నిమ్నము నున్నతము : విశేషణోభయపద కర్మధారయము

11. నదీనదములు = నదియు నదమును : ద్వంద్వ సమాసము

12. నిఖిలజగములు = నిఖిలములైన జగములు : విశేషణోత్తరపద కర్మధారయము

13. సంతోషపరవశులు = సంతోషముచేత పరవశులైనవారు : తృతీయా తత్పురుషము

14. కపిలవస్తుపురము = కపిలవస్తు అను పురము : సంభావనా పూర్వపద కర్మధారయము

15. నిర్వ్యాజానందము = నిర్వ్యాజమైన యానందము : విశేషణోత్తరపద కర్మధారయము

16. కుసుమవర్షము = కుసుమమయమైన వర్షము : కర్మధారయము

17. జ్ఞానతేజము = జ్ఞానమనెడి తేజము : రూపకసమాసము

18. చిత్రకథలు = చిత్రమైన కథలు : వి॥ పూ॥ కర్మధారయము

19. పురాణేతిహాసములు = పురాణములు నితిహాసములు : ద్వంద్వసమాసము

20. ఇరుప్రక్కలు = రెండుప్రక్కలు : ద్విగుసమాసము

21. గర్భఫలము = గర్భముయొక్క ఫలము : షష్ఠీ తత్పురుషము

22. కనుపండువు = కన్నులకు పండువు ,,

23. మార్గమధ్యము = మార్గముయొక్క మధ్యము ,,

24. సకలజనములు = సకలములైన జనములు : వి॥ పూ॥ కర్మధారయము

25. అఖిలభూతములు = అఖిలములైన భూతములు : ,,

ప్ర. 2 : క్రిందివానిలో వ్యాకరణ విశేషములను వివరింపుడు.

1. అక్క + చెల్లెండ్రు = అక్కసెల్లెండ్రు :- ద్వంద్వంబునం బదంబుపై పరుషములకు గ స డ ద వ లగు.

2. పుట్టిన + ఇంటికి = పుట్టినింటికి (పుట్టినయింటికి) :- అత్తునకు సంధి బహుళంబుగనగు.

3. కెంపు + చిగురు + ఆకు = కెంజిగురాకు

కెంపు + చిగురు :- (1) సమాసంబులం బ్రాఁతాదుల తొలియచ్చు మీఁది వర్ణంబులకెల్ల లోపంబు బహుళంబుగానగు. అను సూత్రముచే కె + చిగురు అయినది. పిదప,

(2) లుప్తశేషంబునకుం బరుషంబులు పరంబగునపుడు నుగాగమంబగు. అను సూత్రముచే కె + న్ + చిగురు. పిమ్మట,

(3) ఆదేశసరళంబులకు ముందున్న ద్రుతంబునకు బిందుసంశ్లేషంబులు విభాషణనగు. అను సూత్రముచే నిక్కడ కెంజిగురు; కేఁజిగురు; కెఞ్జిగురు — అను మూఁడు రూపములు రావలసియుండఁగా

(4) అఁట, ఇఁక, చుఁడు శబ్దంబులు దక్క నడితొలి హ్రస్వంబుమీఁద ఖండబిందువును ద్రుతంబునకు లోపంబును లేవు. — అను సూత్రముచే ఖండబిందువు వారింపఁబడినది. పై రెవ సూత్రములోని విభాషణ వ్యవస్థితముగుటచే సంశ్లేషము వారింపఁబడినది. ఇఁక పూర్ణబింగు యుక్తరూపమొక్కటే మిగిలినది. (కెంజిగురు) ఇఁక చిగురు + ఆకు = చిగురాకు :- కర్మధారయంబున పేర్వాదిశబ్దంబుల కచ్చుపరమగునపుడు 'టు' గాగమంబు విభాషనగు. ఇచ్చట కాలేదు; చిగురాకు.

4. నిండు + వెర (పడు) = నివ్వెరపడు :- అన్యంబులకు సహిత మిక్కార్యంబులు కొండొకచోఁ గానంబడియెడి. ఇట లోపద్విత్వంబులు.

5. ప్రియ + ఆలు = ప్రియురాలు :- కర్మధారయంబులం దత్సమంబుల 'ఆలు' శబ్దంబు పరంబగునపు డత్వంబున కుత్వంబును 'రు' గాగమం బగు.

6. ఎల్లభూతములు :-

(1) సర్వపర్యాయంబైన ఎల్లశబ్దంబు ద్రుతాంతంబయిన యవ్యయంబు. దీనికి సమాసంబున విశేష్యంబునకు ముందు ప్రయోగంబు లేదు.

(2) సమాసంబుల ద్రుతంబునకు లోపంబగు.

7. అక్కజము + పడవలదు = అక్కజంపడవలదు :- పడ్వాదులు పరంబగు నపుడు 'ము' వర్ణకంబునకు లోపపూర్ణబిందువులు విభాషనగు.

ప్ర. 3 : క్రింది ప్రకృతులకు వికృతులు, వికృతులకుఁ బ్రకృతులు వ్రాయుఁడు.

| ప్ర | వి | ప్ర | వి |
|---|---|---|---|
| మత్సరము | మచ్చరము | బ్రాహ్మణుఁడు | బాపఁడు |
| దిశ | దెస | జ్ఞానము | నాణెము |
| పక్షము | ప్రక్క | పక్షి | పక్కి |
| సంతోషము | సంతసము | శుచి | చిచ్చు |
| ఆకాశము | ఆకసము | సుఖము | సుకము |
| రాజ్ఞి | రాణి | రథము | అరదము |
| కథ | కత | పీఠము | పీట |
| బ్రహ్మ | బమ్మ | | |

ప్ర. 4 : క్రిందివానిని విడదీసి సంధినామములు పేర్కొనుఁడు.

1. మహా + ఋషి = మహర్షి : గుణసంధి
2. భూమి + ఆకాశములు = భూమ్యాకాశములు : యణాదేశ సంధి
3. లోక + ఉద్ధారకుఁడు = లోకోద్ధారకుఁడు : గుణసంధి
4. కృష్ణ + ఆవిర్భావము = కృష్ణావిర్భావము : సవర్ణదీర్ఘ సంధి

# ౫. విద్యా వివేకములు

## I. అర్థాదులు

పుట 34. దుర్నయము=అన్యాయము, దుర్నీతి, గేలి=పరిహాసము.

పుట 35. అనార్యులు=ఆర్యులు కానివారు.

పుట 36. వివేకము=జ్ఞానము, ఆలోచన; పురుషార్థము=పురుషుల ప్రయోజనము (ధర్మార్థకామమోక్షములు పురుషార్థములు).

పుట 37. ప్రపంచతత్త్వవేత్తలు=ప్రపంచముయొక్క యాథార్థ్యము నెఱిఁగిన వారు, మకరసంక్రమణమున కెదురుచూచును=ఉత్తరాయణ పుణ్యకాలమునకొఱకెదురుచూచును — ఉత్తరాయణమున మరణించుట పుణ్యదాయకమని సంప్రదాయము; రెంటికిం జెడిన రేవణ=రెండిటిని పోగొట్టుకొన్న చాఁకివాఁడు, రేవఁడు=చాఁకలి (రూపాంతరము రేవణ.) ఒకచాఁకలి యేటిలో బట్టలుఁగుచు చుండెను. ఉతికినివాని నొకచో నొడ్డునఁబెట్టగా వానిలో నొకటి యేట్లో ప్రవాహమునఁబడి కొట్టుకొని పోవుచుండెను. దానినిజూచి చేతనున్న దాని నచటవదలి పట్టి పోవుచున్న దానినిఁ బట్టుకొనఁబోయెను. అది దొరకలేదు. మఱల వచ్చునప్పటికి చేతనున్నది కూడ కొట్టుకొనిపోయెను. వాఁడు రెంటికిం జెడిన రేవఁడు.

## II ప్రశ్నోత్తరములు

ప్ర. 1 : విద్యా వివేకములను వ్యాసము ఏ గ్రంథములోనిది. ఈ వ్యాసముల యభిప్రాయమేమి ?

జ. : పాఠ్యగ్రంథములోని పరిచయ వాక్యములను జూడుఁడు.

ప్ర. 2 : విద్యావంతులు విద్యావిహీనులను జూచి యపహసించుట న్యాయముగాదని వ్యాసకర్త యెట్లు నిరూపించెను ?

జ. : విద్యావిహీనః పశుః – అను భర్తృహరి వాక్యము నాధారముగఁ గొని కొందఱు విద్యావంతులు విద్యావిహీనులను నీచ

ముగఁ జూచుచుందురు. ఈ గుణము స్త్రీలలోఁ బురుషులలో నన్ని సంఘములలోఁ బ్రబలుచుండుట యొక దుర్న్యయము. అట్లు నీచముగఁజూచుట చాల శోచనీయము. మంచిచీర కట్టుకొన్న భాగ్యశాలిని యితరులను జూచి నవ్వవలయునని యే ధర్మశాస్త్రమును జెప్పదు. చక్కఁగా నలంకరింపఁబడిన యెద్దు తానెట్టి జతతోఁ గాడికిఁ గట్టఁబడినను గొంచెమైన నేవగించుకొనక బండిని లాగుటలేదా? ఇట్లు పశువులలో నున్న సహనశక్తి మానవులలోఁ గొఱవడుట విచారింపఁ దగిన విషయము. అని చెప్పుచు వ్యాసకర్త విద్యావంతులు విద్యాహీనులను నీచముగఁ జూచుట న్యాయము గాదని నిరూపించెను.

ప్ర. 8 : విద్యాశబ్దమున కర్థము వివరించి నిజమైన విద్యావంతు లెవ్వరో నిర్ణయింపుఁడు.

జ. : విద్యాశబ్దము సామాన్యముగా వ్రాఁత చదువులకే రూఢమైనది. పూర్వము సాహిత్య, శాస్త్రపండితులే విద్యావంతులుగాఁ గణింపఁ బడుచుండిరి. అన్యభాషాజ్ఞానము గలవారా నాఁడు అనార్యులుగ నెన్నఁబడు చుండిరి. కాని నేఁడు విద్య యనఁగా నాంగ్లవిద్యయే యని చెప్పఁబడు చున్నది. అది తెలియని వాఁడెంత బృహస్పతియైన ననాగరకుఁడుగా నెన్నఁబడు చున్నాఁడు.

మఱియు నొకనికి విద్యయైన దింకొకని కవిద్యయగును. ఈ విద్యావిద్యల గొడవలేని బాలికునిలో సమబుద్ధియు, సహనమును గనఁబడును. ఆతనికి మనకు భేదము విద్యలో లేదు. మఱి వివేకములో నున్నది. మనము విద్య నేర్చినంతగా వివేకము నేర్వ లేదు. వివేకము నేర్పని విద్యవలన లాభము లేదు. అవివేకి మూఢునికంటె సంఘమున కెక్కుడు చెఱుపు కలుగఁ జేయును. కనుక ప్రపంచ తత్త్వవేత్తలందఱు చదివిన యవివేకికంటె నపండితుఁడే మేలని చెప్పిరి. వేమనకూడ యిందు

వలననే "చదివినతనికన్న చాకలి మేలురా, విశ్వదాభిరామ వినురవేమ" అనెను.

ప్ర. 4: ఒకరి విద్య యింకొకరి కవిద్య – ఉదాహరణ పూర్వకముగ వివరింపుఁడు:

జ. : వేదవేదాంత సారమెఱిఁగిన పండితుఁడు మాతృభాషనైనఁ జక్కగ మాటాడనేరని విద్యార్థిని జూచి గొణుఁగుకొనును. ఆంగ్లవిద్య నభ్యసించిన యువకుఁడా భాషరాని శ్రోత్రియుని బరిహసించును. మంగలి రంగని పాఠము జదివినంత నవనాగరక బాలిక మడిగట్టుకొని గోపికాగీతలు పాడుకొను ప్రాఁత ముత్తయిదువను జూచి పరిహాసము చేయును – ఇట్లు లొకరికి విద్యయగునది వేఱొకరి కవిద్య యగుచున్నది.

ప్ర. 5: మన విద్యయందలి లోపమేమి? విద్య వివాదముకొఱకు యను నానుడి యేలపుట్టెను?

జ. : విద్య యొక సాధనము మాత్రమే. దాని ఫలితము వివేకము. సాధనమైన విద్య మనకు లభించినపుడు దానిని మనము సరిగా నుపయోగించుకొనవలెను. లేనియెడల తన చేతికత్తితోఁ దన ముక్కు–జెవులు గోసికొన్నట్లే యగును. మనము చదువు నిట్లే యుపయోగించు కొనుచున్నాము. ఇదియే మన విద్య యందలి లోపము. ఇది యితరుల మేలునకుఁ గొఱగాదు సరి కదా, మన పొట్టకు బట్టకుఁగూడ చాలదు. కాఁగా దీని యుపయోగ మితరులఁ దప్పుపట్టనే! కావుననే విద్య వివాదము కొఱకే యను నానుడిపుట్టెను.

ప్ర. 6: "చదివినతనికన్న చాకలి మేలురా" అర్థసందర్భములను వివరింపుఁడు:

జ. : విద్యాప్రయోజనము వివేకము. అట్టి వివేకము నేర్పని విద్య విద్యయే కాదు. మూర్ఖుఁడు తానొక్కఁడు చెడినఁ జెడ వచ్చును. కాని యవివేకి తోడివారింగూడ జెఱుచును. ఇట్టి యవివేకులగు చదివినయ్యలకంటె చదువు సంధ్యలురాని వాఁడే మేలని ప్రపంచ తత్త్వవేత్తలందఱు నుడువుచున్నారు. అని

చెప్పునందర్భమున మహాతత్త్వవేత్తయగు వేమనయు నట్లే చెప్పెనని యీ పద్యభాగ ముదాహరింపఁ బడినది.

ఈ పైవిషయములను గుర్తించినవాఁడు గావుననే వేమన చదివిని వానికంటె చాకలి మేలని చెప్పెను.

ప్ర. 7: "చదువ వేయు నున్నమతియుఁ బోయె" అర్థసందర్భములను వివరింపుఁడు:

జ.: చదువు మంచిదేకాని దానివలనఁ గలుగు ననర్థమెల్ల దానిని నేర్చు విధమునందే యున్నదని చెప్పక తప్పదు. అగ్నిమాంద్యమువంటి మోటుఁదనమువలన నవివేకము ముదిరి మొదటికే మోసమువచ్చును. చదువ వేయ నున్నమతియుఁ బోయెననుట యిట్టి చదువును గూర్చియే.

## III. వ్యాకరణ విశేషములు

ప్ర. 1: క్రింది వానికి విగ్రహ వాక్యములు వ్రాసి, యే సమాసములో చెప్పుఁడు.

1. కడమాట = కడయైన మాట: వి॥ పూ॥ కర్మధారయము
2. విద్యాప్రభావము = విద్యయొక్క ప్రభావము: షష్ఠీ తత్పురుషము
3. దుర్నయము = చెడ్డదైన నీతి: వి॥ పూ॥ కర్మధారయము
4. అనార్యులు = ఆర్యులు కానివారు: నఞ్ తత్పురుషము
5. అల్పవిద్య = అల్పమైన విద్య: వి॥ పూ॥ కర్మధారయము
6. విద్యాహీనులు = విద్యచేత హీనులు: పంచమీ తత్పురుషము
7. మంచిత్రోవ = మంచిదైన త్రోవ: వి॥ పూ॥ కర్మధారయము
8. అపథ్యదోషము = అపథ్యమువలని దోషము: పంచమీ తత్పురుషము
9. రాక్షసకృత్యములు = రాక్షసునియొక్క కృత్యములు: తృతీయా తత్పురుషము

ప్ర. 2: క్రిందివానిలో వ్యాకరణ విశేషములను వివరింపుఁడు.

1. భావింతురు, చూతురు :– 'చు' వర్ణంబు తోడి 'దు' ద్గకారంబు 'త' కారంబగు.
2. పట్టుబడును, ఆసవోడమును :– ప్రథమమీఁది పరుషములకు గసడదవలు బహుళముగ నగు.
3. చదివిన+అతనికన్న :– అత్తునకు సంధి బహుళంబుగ నగు.
4. బం గారఫుఁబలుకు :–

   (1) కర్మధారయంబుల 'ము' వర్ణకమునకుం బుంపులగు.

(2) సమాసంబుల నుదంతంబులకు స్త్రీసమంబులకుం బుంపులకుం బరుష సరళంబులు పరంబులగు నప్పుడు 'ను' గాగమంబగు.

5. కొన్ని + వాళ్ళు = కొన్నాళ్ళు, కొన్నినాళ్ళు :- అన్ని, ఇన్ని, కొన్ని శబ్దములకు 'నాడు' పరమైనపుడు 'ని' వర్ణము వైకల్పికముగా లోపించును. కొన్ + నాళ్ళు = కొన్నాళ్ళు

# ౬. వీరేశలింగము పంతులుగారు

## I. అర్థాదులు

పుట 39. అభ్యుదయము=అభివృద్ధి; వ్యవస్థ=నియమము; నిలయములు = ఉనికిపట్టులు.

పుట 40. ప్రవేశపరీక్ష = కళాశాలా ప్రవేశపరీక్ష (మెట్రిక్యులేషన్); అనర్గళ+ఉపన్యాసములు=అడ్డులేని ఉపన్యాసములు; ధవళగిరి=ధవళేశ్వరము అను గ్రామము (రాజమహేంద్రమునకు 3 మైళ్ళలో గలదు.)

పుట 41. సద్ + విమర్శనము=మంచి విమర్శనము; సంచలనము = పెద్ద కదలిక; దృక్ + పథము=చూపుయొక్క మార్గము; బద్ధకంకణులు=కట్టఁబడిన కంకణము గలవారు; అవలోకించి=పరామర్శించి.

పుట 42. కృతకృత్యులు=చేయఁబడిన కృత్యముగలవారు; ఉద్యమమును=ప్రయత్నమును; దురాచారదూషితము=దురాచారములచే దూషింపఁబడినది; విద్యాగంధము=విద్యయను గంధము (లేక) విద్యాలేశము; గంధము=(నానా) వాసన, గర్వము, లేశము, సంబంధము.

పుట 43. ప్రహసనము = నవ్వు పుట్టించునది; జటిల గ్రాంధికవచన శైలి=క్లిష్టమైన (కఠినమైన) గ్రంథములకుదగిన (వ్యాకరణయుక్తమైన) వచనశైలి.

పుట 44. నామ+మాత్ర+అవశిష్టులు=పేరుమాత్రముచే మిగిలినవి.

పుట 45. ఆడటు=గర్వము.

## II. ప్రశ్నోత్తరములు

ప్ర. 1 : వీరేశలింగముపంతులుగా రెప్పు డెక్కడ జన్మించిరి ? వారి తల్లిదండ్రు లెవరు ?

జ. : వీరేశలింగముగారు రాజమహేంద్రవరమున క్రీ.శ. 1848 సం. ఏప్రిలు పదునారవ తేదీని జన్మించిరి. వీరి తండ్రి సుబ్రహ్మ

ణ్యముగారు, తల్లి పున్నమ్మగారు. వీ రార్వేల నియోగి బ్రాహ్మణులు.

ప్ర. 2 : వీరేశలింగముగా రాంగ్లభాష నేల యభ్యసింపవలసి వచ్చెను ? మాతృభాషపై నాయన యభిమాన మెట్టిది ?

జ. : వీరేశలింగముగారి కాలమునకు దేశమంతట నాంగ్లభాష విద్యాప్రణాళికలోఁ బ్రవేశపెట్టఁబడెను. ఆంగ్లేయులకుఁ గావలసిన గుమాస్తాలను దయారు చేసికొనుటకై యాంగ్లభాషను భారతీయులపైఁ బులిమిరి. ఆంగ్లమును నేర్వనివా రుద్యోగమున కనర్హులైరి. అందుచేఁ బంతులుగారుకూడ నాంగ్లమభ్యసించుటకు బ్రారంభించి ప్రవేశపరీక్షయం దుత్తీర్ణులైరి. వీ రాంగ్లభాష నభ్యసించినను మాతృభాషయైన యాంధ్రమును వదలినవారుగారు. బాల్యముననే తెనుఁగున మంచి పరిచయము సంపాదించి ప్రవేశపరీక్ష నిచ్చునాఁటికే ధారాళముగఁ గవిత్వము చెప్పఁజాలియుండుటేకాక వివిధ విషయములపై ననర్గళముగ నుపన్యసింపఁగలిగి యుండిరి.

ప్ర. 3 : వీరేశలింగముగారిలోఁ జిన్ననాఁడే కనఁబడిన సద్గుణములేవి ?

జ. : వీరేశలింగముగారికిఁ జిన్ననాఁడే మనుజునకు నీతి, యీశ్వరోపాసనము, మానవసేవ, మనోవాక్కాయ కర్మలయందుఁ బాప మాచరింపకుండుటయను సద్గుణము లవసరమని దృఢవిశ్వాస మేర్పడెను. ఆయన త్రికరణశుద్ధిగ నమ్మినదానిని వెల్లడించుటకును, నాచరించుటకును వెనుదీసెడివారు కారు.

ప్ర. 4 : వీరేశలింగముగారు తమ జీవితము నెట్లు ప్రారంభించిరి ? అప్పటి వారి యాశయములేవి ?

జ. : వీరేశలింగముగారు విద్యాభ్యాసము ముగిసినపిదప రాజమహేంద్రవరమున ముప్పదిరూకల నెలజీతముమీఁద యుపాధ్యాయ వృత్తిలోఁ బ్రవేశించిరి. అచిరకాలముననే వారుత్తమ

గురువులుగా భాసించిరి. వారు ధనమైశ్వర్యమునకు మార్పఁ బడిరి. ఎచటనున్నను వారు సంఘమును నిశితదృష్టితో విమర్శించి చూచుచు లోపములను సవరించి సాంఘికాభ్యుదయమునకుఁ గృషిచేయఁ జూచుచుండిరి.

ప్ర. 5 : వీరేశలింగముగారి యుద్యమములకు నాఁటి యనుకూల పరిస్థితు లెట్లుండెను?

జ. : వీరేశలింగముగారి యుద్యమముల సమయమునకు దేశమున నాంగ్లభాషా సాహిత్య నాగరకతలు చక్కగా దేశమున వ్యాపించి యువకులలో వ్యక్తిస్వాతంత్ర్యము సద్విమర్శనములందాసక్తి కలిగి దేశమున నొక సంచలనమునకు గారణమయ్యెను. ఈ పరిస్థితు లాయనకుఁ గొంతవఱకుఁ దోడ్డైనవి.

ప్ర. 6 : బాల వితంతువుల స్థితి యెట్లుండెను? వారి నుద్ధరించుటకై వీరేశలింగముగారు చేసిన కృషిని సమీక్షింపుఁడు. (లేక పాఠ్యగ్రంథము ప్రశ్న 6)

జ. : వీరేశలింగముగారి కాలమునకు హిందూసంఘమున బాల వితంతువుల బాధలు దుర్భరముగా నుండెను. సంఘమున వారి కుచితస్థానము లేదు. వారి జీవితము లడవిఁగాచిన వెన్నెలలు, విషాదపూరితములు, దుర్భరములు. వారు మఱల వివాహము చేసికొనుటకు సంఘ మంగీకరింపకుండెను. వారు వంటయింటి కుందేళ్లయి, కూపస్థ మండూకములై యుండిరి. వారి జీవితమొక విషాద నాటకముగా నుండెను.

వీరేశలింగముగారీ దుర్భర పరిస్థితులను దొలగింప బద్ధకంకణులైరి. వారు బహు ప్రయాసలకోర్చి యనేక ప్రాచీన శాస్త్రగ్రంథములను బరిశోధించి యందు బాలవితంతు వివాహములు శాస్త్రసమ్మతములే యనుటకుఁ బనికివచ్చు వాక్యముల నుద్ధరించి వాని సహాయమున వారు స్థాపించిన వివేకవర్ధని యను పత్రికలో వ్యాస పద్య నాటక కథా ప్రహసన రూపములఁ బ్రచారము సాగించిరి. గొప్పగొప్ప పండితుల సభలలో తమ వాదమును నిర్భయముగఁ బ్రజలకు జాలి గొల్పునట్లుగ నుపన్యసింపఁ జొచ్చిరి. వారి కృషివలనఁ

గొందఱు బుద్ధిమంతులు వారి పక్షమున స్థిరముగ నిలిచిరి. ఇట్లయిదు సంవత్సరము లవిరళకృషి చేసి తుదకు 1881 వ సంవత్సరమునఁ బలువురి సమక్షమున వారు రెండు వితంతు బాలికా వివాహములు నిర్వహించిరి. వారు సంపాదించిన ధనములోఁ జాలభాగము వితంతు శరణాలయమున కొసంగిరి. అప్పటినుండి సంఘసంస్కరణాభిమాను లెందఱో యీ యుద్యమమును జేపట్టి విరివిగా నట్టి వివాహములను గావింప మొదలు పెట్టిరి. ఈ విధముగా వీరేశలింగముగారు చేసిన కృషి యపారము అద్భుతమునై యున్నది.

ప్ర. 7: స్త్రీవిద్యా విషయమునఁ బంతులుగారి యభిప్రాయములేవి? వారి యభివృద్ధికై యాయన యొనర్చిన కృషి యేమి?

జ. : కులస్త్రీలలో విద్యావ్యాప్తిఁ గలిగించినచో సంఘము నైతికముగ నభివృద్ధి నొందుననియు, దురాచారములకు దూరముగా నుండుననియు వీరేశలింగముగారు తలఁచిరి. అట్టిపని చేయుట విద్యాధికుల కర్తవ్యమని యుద్బోధించిరి. స్త్రీలు విద్యావంతులాండ్రగుచోఁ గలుగు మేళ్లను తమ పత్రికాముఖమునఁ బ్రచార మొనర్చిరి. స్త్రీవిద్యా విముఖులతో శాస్త్రప్రమాణయుక్తముగా వాదించుచు వారిని సుముఖులఁ గావించుకొనుచుండిరి. తుదకు ధవళేశ్వరమున నొక బాలికాపాఠశాలను నెలకొల్పిరి. స్త్రీజనోపయుక్తములగు ననేక గ్రంథములను రచించిరి. వారి యీ యుద్యమమే నేఁడు స్త్రీలపాలిటి కల్పవృక్షమైనది.

ప్ర. 8: వీరేశలింగముగారి సాహిత్యసేవను వర్ణింపుఁడు:

జ. : వీరేశలింగముగారు సాంఘికరంగము నందేకాక సాహిత్యమునఁగూడ పెక్కు సంస్కారము లొనర్చి నూతన ప్రక్రియలను బ్రవేశపెట్టిరి. దీనికి వారి యాంగ్లభాషా పరిజ్ఞానము బాగుగా నుపకరించెను. ఆంగ్లమునందలి నవల, విమర్శనము, చరిత్ర, ప్రహసనము, ఉపన్యాసము మున్నగు వచన రచనా

ప్రక్రియలన్నియు వారిచే నాంధ్రమునఁ బ్రవేశపెట్టఁబడినవి. వారు చిన్నయసూరి ననుసరించి పంచతంత్ర భాగములైన సంధివిగ్రహములను భాగములను జటిలమైన శైలిలో వ్రాసిరి. వారి యితర రచనలలోని శైలి విషయప్రధానమై సరళమై ధారావాహియై రసవంతమై యుండును. ఆధునికాంధ్ర వచన రచన కాయనయే మార్గదర్శియై వారికిగల గద్యతిక్కన బిరుదమునకు సర్వవిధముల నర్హులై యుండిరి.

పంతులుగారు అనేక స్వతంత్ర గ్రంథములను రచించుచునే కాక, సంస్కృతమునుండియు నాంగ్లమునుండియు గొన్ని నాటకాదులను దెనిఁగించిరి. వారి యభిజ్ఞాన శాకుంతలాంధ్రీకరణము మిక్కిలి ప్రఖ్యాతి నందినది. ఈసపుకథలు, గల్లివర్స ట్రావెల్సు మున్నగు నాంగ్ల గ్రంథములను దెనిఁగించిరి.

పంతులుగారు రచించిన రాజశేఖర చరిత్రము ఆంధ్రనవలా వాఙ్మయమున వేఁగుజుక్క! వారు ప్రాచీన ప్రబంధము లెన్నింటినో సంస్కరించి ముద్రింపించిరి. ఎన్నో కష్టములకు వ్యయమునకు నోర్చి యాంధ్రకవుల చరిత్రమును సంగ్రహించి పెట్టిరి. ఇట్లు పంతులుగారి లేఖని బహుముఖముగ యపారమగు భాషాసేవ కావించినది.

ప్ర. 9: వీరేశలింగముగారి ప్రజాసేవకు ప్రభుత్వ మెట్లు బహూకరించెను?— వారెప్పుడు కీర్తిశేషులైరి?

జ. : పంతులుగా రొనర్చిన సంఘసేవను గుర్తించి నాటి యాంగ్ల ప్రభుత్వమువా రాయనకు రావుబహదూర్ అను బిరుదము నిచ్చి సన్మానించిరి.

పంతులుగారు క్రీ.శ. 1919 మే నెల 27 వ తేదీని స్వర్గస్థులైరి.

# III. వ్యాకరణాంశములు

ప్ర. 1: క్రిందివానికి విగ్రహవాక్యములు వ్రాసి యవి యే సమాసములో తెల్పుండు:

1. మనోవాక్కాయకర్మలు = మనస్సు, వాక్కు, కాయము, కర్మలు బహుపదద్వంద్వము
2. ముప్పదిరూప్యములు = ముప్పది రూప్యములు : ద్విగుసమాసము
3. విద్యాజ్యోతి = విద్యయనెడి జ్యోతి : రూపక సమాసము
4. బద్ధకంకణులు = కట్టఁబడిన కంకణము కలవారు : బహువ్రీహి
5. నిశితదృష్టి = నిశితమైన దృష్టి : కర్మధారయము
6. ఈశ్వరోపాసన = ఈశ్వరునియొక్క యుపాసన : షష్ఠీ తత్పురుషము
7. విషాదపూరితములు = విషాదముచేత నిండినవి : తృతీయా తత్పురుషము

ప్ర. 2 : క్రిందివానిలో వ్యాకరణ విశేషములను వివరింపుఁడు.

1. ధార+పోసి=ధారవోసి :- ప్రథమమీఁది పరుషములకు గసడదవలు బహుళముగ నగు.
2. మూఁడు+పది=ముప్పది :-
   (1) సమానాధికరణంబగు నుత్తరపదంబు పరంబగునపుడు మూఁడు శబ్దము 'డు' వర్ణంబునకు లోపంబును మీఁదిహల్లునకు ద్విత్వము నగు.
   (2) ద్విగువున నేకవచనంబు ప్రాయికంబుగ నగు. మిశ్రంబునకుఁగాదు.
3. ప్రాచీనకాలము+స్త్రీలు=ప్రాచీనకాలపుస్త్రీలు :- కర్మధారయంబు అందు 'ము' వర్ణకంబునకుం బుంపులగు.
4. మొదట+మొదట=మొట్టమొదట :- ఆమ్రేడితంబు పరంబగునపుడు కడాదులం దొలియచ్చుమీఁది వర్ణంబులకెల్ల నదంతంబగు ద్విరుక్త 'ట' కారంబగు.
5. విద్యావంత+అలు+లు=విద్యావంతురాండ్రు :-
   (1) కర్మధారయంబునం దత్సమంబుల కాలుశబ్దంబు పరంబగునపుడు అత్వంబున కుత్వంబును 'రు' గాగమంబగు.
   (2) ఆల్వాగుల బహువచన 'ల' కారంబునకు రేఫంబును ముందటి 'లు' వర్ణంబునకు బిందుపూర్వక 'డ' కారంబునగు.

ప్ర. 3 : క్రింది ప్రకృతులకు వికృతులు, వికృతులకుఁ బ్రకృతులు వ్రాయుఁడు.

| ప్ర | వి | ప్ర | వి |
|---|---|---|---|
| పుష్పము | పువ్వు | యాత్ర | జాతర |
| స్త్రీ | ఇంతి | విద్య | విద్దె |
| అటవీ | అడవి | భాష | బాస |
| కథ | కత | | |

# ౭. గ్రామపునరుద్ధరణము

## I. అర్థాదులు

పుట 48. తార్కాణము=ఉదాహరణము; దేశ+ఔన్నత్య+సౌధము=దేశముయొక్క ఔన్నత్యము అనెడు మేడ.

పుట 49. విరమించుచో = మానినచో; నింద్యము = నిందింపఁదగినది; ఉపేక్ష=అశ్రద్ధ.

పుట 50. మహత్తర, వాసనా, భరితము = గొప్ప వాసనచే నిండినది; పొలియు=చచ్చు; జాతీయత్వము=జాతీయతా భావము; ఆచార్యులు=గురువులు.

పుట 51. ఆదికారణము=మొదటికారణము.

పుట 52. విద్యాగంధము=విద్య యనెడు వాసన (విద్యాలేశము), ఎనయుచున్నారు=సమానులగుచున్నారు.

పుట 53. శుచిత్వమహత్త్వము=శుచిత్వముయొక్క గొప్పదనము.

పుట 54. పరిష్కరించుకొను=తీర్చుకొను.

పుట 55. అమాయికులు=మాయ తెలియనివారు.

పుట 56. వన్నెయు, వాసియు=కాంతియు, కీర్తియు

## II. ప్రశ్నోత్తరములు

ప్ర 1: దేశాభివృద్ధికి గ్రామపునరుద్ధరణ మెట్లు తోడ్పడెను ?

జ.: దేశాభివృద్ధి గ్రామములపై నాధారపడి యున్నది. గ్రామములు సస్యధన సమృద్ధములై యుండుట దేశ సౌభాగ్యమునకుఁ దార్కాణము. గ్రామములు సారవంతములుగ శక్తిమంతములుగా నున్నంతకాలము దేశౌన్నత్యము కొనసాగుచునే యుండును. కావున దేశాభివృద్ధికి గ్రామోద్ధరణము, నందలి కర్షకోద్ధరణము నత్యావశ్యకములై యున్నవి.

ప్ర. 2: గ్రామము దేశమునకు గుండెకాయవంటి దనుట యెట్లు ?

జ.: మానవ శరీరమందలి గుండె యెట్లు జీవనాధారమైన రక్తమును శుభ్రపఱచి శరీరావయవములకెల్ల వాని యావశ్యకమును

బట్టి పంపుచుండునో యట్లే గ్రామము సమృద్ధములైన పంటలు పండించి దేశమందలి యెల్లభాగములకుఁ బంపును. హృదయము తన వ్యాపారమును బరిత్యజించినచో శరీరము నాశమగు నట్లే గ్రామమునఁ బంటల నుపేక్షించుచో దేశము నిర్భాగ్యమై నిఖిలకష్టముల కాకరమగును. కావున మనము హృదయమును బలవత్తరముగ నుంచుకొనఁ బ్రయత్నించి నట్లే గ్రామములను బలపఱచుటకును, అభివర్ధించుటకును శ్రద్ధవహింప వలయును.

ప్ర. 3 : పాశ్చాత్య నాగరికతను అంధముగా ననుసరించుటవలన నష్టమేమి? దాని నెంతవఱకు ననుసరింపవచ్చును?

జ. : పాశ్చాత్య నాగరికతయందేదో మహత్తర తేజము కలదని భ్రమించి దానినే యనుసరించుట వలన భారతదేశమునకుఁ జేకూర్చిన హాని యింతింతయని చెప్పనలవికాదు. భారతీయులు తమ ప్రాచీన సంప్రదాయముల మహత్త్వమును గుర్తింపలేక పాశ్చాత్య సంప్రదాయములకు దాసులై పోవుచున్నారు. ఈ వ్యామోహము పట్టణములనుండి క్రమముగాఁ బల్లెలకు వ్యాపించుచుండుట మఱింత శోచనీయము. ఈ విపత్తునుండి గ్రామములను రక్షింపవలసి యున్నది.

గుణముగాని యవగుణముగాని క్రొత్త ప్రాఁతలపై నాధారపడి యుండవు. ప్రాచీనమైనంత మాత్రమున సర్వము సాధువుగాదు, నవ్యమైనంత మాత్రమున స్వరము దుష్టమునుగాదు. గుణమున్నది యెచ్చటనున్నను, నెప్పటికైనను గ్రహింపఁదగినదే. గుణములేనిచో మనదేయైనను బరిత్యాజ్యమే. కావున మన సంప్రదాయములలో నేవైన చెడుగులున్న వానిని విసర్జింప వచ్చును. నేఁడు నవీన విజ్ఞాన విషయములలో ముందంజ వేయుచున్న పాశ్చాత్యులనుండి మన యభివృద్ధికిఁ గావలసిన విషయములను గ్రహింపవచ్చును. అంతేకాని గుణాగుణ విమర్శచేయక పాశ్చాత్యనాగరికతా సంప్రదాయము

లన్నియు నుత్తమోత్తమములే యని యంధముగా ననుస
రించుట తగదు.

ప్ర. 4: గ్రామస్థులను విద్యావంతులుగా నొనర్చు కొన్ని విధానములను చేర్కొ-
నుము.

జ.: భారతీయ గ్రామస్థులు ముఖ్యముగా విద్యావిషయమునఁ జాల
వెనుకఁబడి యున్నారు. ఆ విషయమున నితర దేశములతోఁ
బోల్చినచో భారతదేశము మిక్కిలి వెనుకంజ వేయుచున్నది.
మన ప్రజలలో నూటికిఁ బదిమందికంటె నక్షరాస్యు లధిక
ముగా లేరు. నేఁటి పల్లెప్రజలు విద్యాగంధములేక పశు
ప్రాయులై యున్నారు. వీరి నీ స్థితినుండి యుద్ధరించుటకుఁ
బట్టణవాసులు పూనుకొని తమకు దీరికయైన సమయములలోఁ
బరిసర గ్రామములకేఁగి యా ప్రజలను విద్యావంతులుగా
నొనర్చుటకుఁ బ్రయత్నింపవలెను. ఈ కార్యమునకు రాత్రి
పాఠశాలలు, సాధారణ విషయములపై నుపన్యాసములు
మిక్కిలి తోడ్పడును.

ప్ర. 5: శుచిత్వము విషయమున నిప్పటి గ్రామము లెట్లున్నవి ?

జ.: గ్రామప్రజలు విద్యాసూన్యులుగా నుండుటవలన శుచిత్వపు
విలువను బ్రయోజనమును దెలియకున్నారు. వారు తమ పరి
సరములను, గృహములనేకాక, తమ దుస్తులను, శరీరమును
గూడఁ బరిశుభ్రముగా నుంచుకొనుటకు శ్రద్ధవహింపరు.
గ్రామములలోని వీధులు చెత్త చెదారములతో శకృత్పిండము
లతో నిండి దుర్వాసనకుఁ దావలములై యుండును. ఈ స్థితి
వారి కనారోగ్యమును, దాని ననుసరించి యుండు కష్టపరం
పరలకును గుఱిచేయుచున్నది.

ప్ర. 6: ప్రస్తుతగ్రామముల యధఃపతనమునకుఁ బ్రధాన కారణము లేవి ?

జ.: ప్రస్తుతగ్రామముల యధఃపతనమునకు (1) పాశ్చాత్య
వ్యామోహము (2) విద్యలేమి (3) శుచిత్వము లే
కుండుట (4) ఐకమత్యము లేక ప్రజలు తమ ధనమును,

కాలమును వృథాగా న్యాయస్థానములందు వెచ్చించుకొనుట యనునవి ప్రధాన కారణములుగ నున్నవి.

ప్ర. 7 : గ్రామస్థులను ఋణదాతల బారినుండి రక్షించు మార్గము లేవి ?

జ. : గ్రామస్థులగు వ్యవసాయదారులకుఁ దగిన సహాయము లభింపకుండుటచే వారు ఋణములపాలై యున్నారు. దీనికిఁదోఁడు అతివృష్టి, అనావృష్ట్యాది హేతువులచేఁ బంటలుపాడై వారి ఋణభారము వృద్ధియగుచునే యున్నది. ఈ స్థితిలో వారు వ్యవసాయపుఁ బెట్టుబడులకుఁ, కుటుంబ భరణమునకు నసమర్థులై సాహుకారులయొద్ద యెక్కువ వడ్డీల కప్పు తెత్తురు. చివరికి దానినిఁ దీర్పలేక యిండ్లు, వాకిండ్లు, నాగళ్ళు, నెద్దుల నమ్ముకొని నిత్యదరిద్రులగుచున్నారు. కావున వీరిని రక్షింపవలెనన్న సహకారసంఘముల మూలమునఁ దక్కువ వడ్డీకి యెక్కువ వాయిదాలలో దీర్చుకొనుటకు వీలైన ఋణము లిచ్చుట, విత్తనములు నితరమైన పనిముట్లు మకుపుపెట్టుట చేయవలెను. ఇట్టి సంఘములు విరివిగా స్థాపింపఁబడుచో నమాయికులైన వ్యవసాయదారులు ఆశాపీడితులైన ఋణదాతల బారిఁబడు నపాయముండదు.

ప్ర. 8 : పశుపోషణమునను, న్యాయవిషయమునను గ్రామవాసు లవలంబింప వలసిన పద్ధతు లేవి ?

జ. : గ్రామస్థులలోఁ బెక్కండ్రు సాధారణముగ వ్యవసాయదారులై యుందురు. వీరికిఁ బశువులు వ్యవసాయపుఁ బనుల కత్యంతోపయుక్తము లగుటయేకాక సమృద్ధిగాఁ బాలొసఁగుచుండును. కావున వీరికిఁ బశుపోషణ మొక యుపవృత్తి యగుచున్నది. కాని వీరికిఁ బశుపోషణయం దుత్తమ పద్ధతులు తెలియవు. ఆ కారణమువలన దేశమునఁ బశుసంపద క్షీణించుచున్నది. కావున పల్లెపట్టుల వ్యవసాయదారులకుఁ బశుజాతి నభివృద్ధిపఱచు శ్రేష్ఠమైన పద్ధతులను నేర్పవలెను. పశుజాతి

యభివృద్ధియగుచో వ్యవసాయ మభివృద్ధిచెంది తద్వారా గ్రా
ముగ గ్రామస్థుల పరిస్థితులు బాగుపడును.

గ్రామవాసులు సామాన్యముగ నింటి సరిహద్దులు, పొలము సరిహద్దులు, మొదలగు స్వల్పవిషయములలోఁ దగవులు పెట్టుకొని పట్టణములలో నుండు న్యాయస్థానములకుఁ బోవుచుఁ దమ ధనమును కాలమును వృధాగా వ్యయము చేసికొను చున్నారు. ఈ వివాదముల వలన గ్రామములోఁ బక్షములేర్పడుటయు సంఘీభావము నశించి పరస్పర సహకారములేక గ్రామస్థులు కష్టములపాలగుచున్నారు. కనుక వారికి లెస్సగా బోధించి వారి తగవులను వారిలో వారే సంఘపుఁ బెద్దలవలనఁ గాని, పంచాయతీ సంఘములవలనఁ గాని పరిష్కరించుకొనునట్లు చేయవలయును.

ప్ర. 9 : పాశ్చాత్య విద్యాభ్యాసమువలన గ్రామస్థులకు గలుగుచున్న యనర్థములేవి? (పాఠ్యగ్రంథము 9 ప్ర)

జ. : పూర్వము గ్రామములలో నేకులమునకుఁ జెందినవారా వృత్తిని వంశపారంపర్యముగ నవలంబించుచుండుట వలన గ్రామము లేకొఱతయు లేక యుండెను. కాని నేఁడు పాశ్చాత్య విద్యాభ్యాసము నందలి మోహముచే కులవృత్తులను మాన్పి పల్లెలవారు తమ బిడ్డలను పట్టణములకుఁ బంపుచున్నారు. అధిక ధనమును వెచ్చపెట్టుచున్నారు. చివరికా బాలు రుద్యోగము దొరకకయుఁ, గులవృత్తిని విస్మరించియు రెంటికిం జెడిన రేవన్నలగుచున్నారు. కావున గ్రామస్థులు తమ వృత్తులను వీడకుండుట యభ్యుదయమార్గము.

ప్ర. 10: గ్రామము అభివృద్ధి నొందవలెనన్నఁ జేయవలసిన కార్యములెవ్వి?

జ. : గ్రామస్థులు నిరక్షరాస్యులై యుండక విద్య నార్జింపవలెను. దానితోపాటు శుచిత్వమును నేర్చుకొనవలెను. పాశ్చాత్య విద్యా నాగరికతలయందు మోహమును విసర్జింపవలెను. స్వల్పనిరర్థక వివాదములను పెంచుకొనుటయుఁ బట్టణముల

లోని న్యాయస్థానములకుఁ బోవుటయు మానవలెను. పశు జాత్యాభివృద్ధికి శ్రద్ధ వహింపవలెను. పేడను వంటచెఱకుగా నుపయోగింపక పొలముల యెరువుగా నుపయోగింపవలెను. హెచ్చువడ్డీలకు ఋణములనుదెచ్చి చెడిపోక సహకార సంఘముల తోడ్పాటు నందుచుండవలెను. అణఁగిపోయిన కుల వృత్తులను బునరుద్ధరింపవలెను. ఇట్లొనర్చినచో దేశము సర్వ సంపదల కాలవాలమై సాటిదేశములలో వన్నెయు వాసియుఁ గాంచఁగల్గును.

ప్ర. 11: గ్రామపునరుద్ధరణము అను వ్యాసమును రచించినవా రెవరు ? వారి యితర గ్రంథము లేవి ?

జ. : పాఠ్యగ్రంథములోని పరిచయ వాక్యములను జూడుఁడు.

## III. వ్యాకరణాంశములు

ప్ర. 1: క్రిందివానికి విగ్రహవాక్యములు వ్రాసి యవి యే సమాసములో పేర్కొనుఁడు.

1. గౌరవైశ్వర్యములు=గౌరవము, నైశ్వర్యమును : ద్వంద్వ సమాసము
2. చతుష్పాత్తు=నాలుగుపాదములు కలది : బహువ్రీహి సమాసము
3. వినాశకూపము=వినాశమనెడు కూపము : రూపక సమాసము
4. పశుపోషణము=పశువులయొక్క పోషణము : షష్ఠీ తత్పురుషము
5. ధనసమృద్ధములు=ధనముచేత సమృద్ధములు : తృతీయా తత్పురుషము
6. ప్రాచీనమహత్త్వము=ప్రాచీనమైనమహత్త్వము : వి॥ పూ॥ కర్మధారయము
7. మాయావాగుర=మాయయనెడి వాగుర : రూపక సమాసము
8. మహావిపత్పారావారము=మహావిపత్తుయనెడి పారావారము : రూపక సమాసము

ప్ర. 2 : క్రింది ప్రకృతులకు వికృతులు, వికృతులకుఁ బ్రకృతులు వ్రాయుఁడు.

| ప్ర | వి | ప్ర | వి |
|---|---|---|---|
| విజ్ఞానము | విన్నాణము | స్నానము | తానము |
| రాత్రి | రాతిరి | దిశ | దెస |
| న్యాయము | నాయము | పశువులు | పసులు |
| కీర్తి | కీరితి | కులము | కొలము |
| గృహము | గీము | | |

ప్ర. 3 : క్రింది రూపములయందలి వ్యాకరణ విశేషములను తెలుపుఁడు :

1. నలువలంకులు :- కలన్వాదుల 'ను' వర్ణంబు వుష్టగు. బహువచనము పరమగునపుడు నిత్యముగానగు.

2. శుచిత్వమువలని లాభము :- సమాసంబులఁ జేత, తోడ, వలన ల కిత్వంబగు.

3. పడునపాయము :- ఉదంతమగు తద్ధర్మార్థ విశేషణంబున కచ్చుపరంబగునపుడు 'ను' గాగమంబగు.

4. నలుగడలు :- సమాసంబుల నుదంతంబగు స్త్రీసమంబులకును బుంపులకును బరుష సరళంబులు పరంబులగునపుడు 'ను' గాగమంబగు. ఇచట బరుషంబులు పరంబులగునపుడు ద్రుతంబునకు బిందుసంశ్లేషములచే మూఁడు రూపములు. నలుగడాదుల నీయాగమంబు లేదంద్రు.

5. ఎల్లభాగములు :- వెనుకటి పాఠములలోఁ జాలచోట్ల వ్రాయఁబడినది.

# ౮. విజ్ఞానశాస్త్ర విశేషములు

## I. అర్థాదులు

పుట 59. వివిధ+అస్త్ర+అలంకార+భూషితుఁడు = పెక్కురకములైన వస్త్రములచేతను, నగలచేతను అలంకరింపఁబడినవాఁడు, నిస్సహాయస్థితి = సహాయము లేని యునికి.

పుట 60. ఇతః+అధికముగా = ఇంతకంటె నధికముగా, భస్మ+అవశేషము = భస్మమే మిగిలినవి, భీతచిత్తులు = భయపడిన మనస్సుగలవారు, శాస్త్రాభివృద్ధిజన్యములు = శాస్త్రముయొక్క అభివృద్ధివలనఁ బుట్టినవి.

పుట 61. విశ్వశ్రేయము = లోకముయొక్క శుభము, క్రమపరిణామము = క్రమముగాజరిగిన మార్పు.

పుట 62. ప్రాక్తనజీవన విధానము = పూర్వకాలపుజీవన పద్ధతి, ఆధివ్యాధి పీడితుఁడు = మనోవ్యధచేతను, రోగములచేతను బీడింపఁబడినవాఁడు, రోగనిదానము = రోగకారణము.

పుట 63. మరణ+ఉన్ముఖుఁడు = మరణమునకు సిద్ధముగా నున్నవాఁడు.

## II. ప్రశ్నోత్తరములు

ప్ర. 1 : ప్రాచీనకాలమున మానవుఁ డెట్లు జీవించుచుండెను ?

జ. : ప్రాక్తన మానవుఁడు దుర్గమమైన గుహాలలో నరణ్యములలో నివసించుచుఁ గందమూలములు ఫలములు మొదలగు వానిని భక్షించుచు దిగంబరుఁడై యనాగరక జీవన మొనర్చుచుండెను.

ప్ర. 2 : విజ్ఞానశాస్త్ర ప్రాదుర్భావమునకు మూలకారణమేమి ?

జ. : మానవుఁడు తొలుదొలుత తన నిస్సహాయ స్థితిని గుఱించియుఁ దనకుఁ గల శక్తి సామర్థ్యములను గూర్చియు నాలోచనా నిమగ్నుఁడై యుండుటయే విజ్ఞానశాస్త్ర ప్రాదుర్భావమునకు మూలకారణములు.

ప్ర. 3 : మానవుని విజ్ఞానశాస్త్రసముపార్జనకు ఆధారము లేవి ? వానిని మానవు డెట్లుపయోగించుకొనుచున్నాడు ?

జ. : విజ్ఞానశాస్త్రసముపార్జనకు రెండువిధములైన యాధారములు కలవు. ఒకటి యూహాజనితము, రెండవది ప్రయోగాత్మకము. ఇందు విజ్ఞానశాస్త్రము ప్రయోగాత్మక పద్ధతిపై నాధారపడి యుండును. శాస్త్రజ్ఞుఁ డే విషయమునైనను ప్రత్యక్షముగా దర్శింపకుండ విశ్వసించఁడు. ప్రయోగఫలితములనే వివిధ సూత్రములుగా నేర్పఱచును. వాని నాధారముగ గొని నూతన విషయములను పరిశోధించుచు నందు గృతకృత్యుఁడగుచుండును.

ప్ర. 4 : ఆధునిక విజ్ఞానశాస్త్రాభివృద్ధి దుష్ఫలితముల కెట్లు దారితీయుచున్నది ?

జ. : ఆధునిక విజ్ఞానశాస్త్రము మొదట మందముగా సాగినను 19 వ శతాబ్దము దాఁటినపిదప త్వరితగతి నభివృద్ధినొందుచు భూలోకమును స్వర్గతుల్య మొనర్చుచున్నది. కాని యాధునిక యుగమున నీ విజ్ఞానశాస్త్ర ప్రయోగఫలితములు విశ్వశ్రేయస్సున కుపయోగింపక మారణమునకే యుపయోగింపఁబడుచున్నవి. ద్వితీయ ప్రపంచ సంగ్రామమున హిరోషిమా

నాగసాకి ద్వీపములను భస్మముచేసి, ప్రపంచమున శాంతి యుత జీవనమును గొంటవడజేసిన యణ్వాస్త్రములు విజ్ఞాన శాస్త్రాభివృద్ధి వలనఁ గలిగిన దుష్ఫలితములే. కాని యీ దుష్ఫలితములు శాస్త్రాభివృద్ధి జన్యములుఁగావు. ప్రయోగ ఫలితములను దుర్వినియోగ మొనరించు మానవులే యీ దుష్ఫలితములకు గారకులని చెప్పవలసి యున్నది.

ప్ర. 5 : నూతనవస్తువు లెట్లు వింతగాఁ బరిణమించునో యెట్లు సాధారణములై పోవునో సోదాహరణముగ వివరించునది :

జ. : ఒక వస్తువు నూతనముగాఁ గనుగొనఁబడిన కొంతకాలము వఱకు నది నూతనముగా నుండును. నేఁడు సర్వసామాన్యమైన కుమ్మరిసారె, కమ్మరికొలిమి మొదట వింతలే. ఆధునిక విజ్ఞానశాస్త్రమున గెలీలియో కనుగొన్న నూతన విషయము లొకప్పుడు అత్యాశ్చర్యకరములై యుండినను నేఁడు సర్వసామాన్యములైనవి.

ప్ర. 6 : గెలీలియో కనుగొనిన యంత్రమేమి ? దానితో నతఁ డేమి కనుగొనెను ?

జ. : గెలీలియో దూరదర్శిని సాధనమును గనుగొనెను. దాని సాయమున నక్షత్రములు సైతము భూమివంటి గ్రహములే యనియు, అందుఁ గొన్ని భూమికంటె పెద్దవికూడ కలవని యును బ్రతిపాదించెను.

ప్ర. 7 : ఛార్లెసు డార్విను సిద్ధాంతమున కేమని పేరు ? తత్ఫలితము లెట్టివో వివరింపుఁడు.

జ. : ఛార్లెసు డార్విను పరిణామ సిద్ధాంతమును బ్రతిపాదించెను. కొన్ని క్షుద్రప్రాణిజాలములే కొన్నిలక్షల సంవత్సరములలోఁ గ్రమ పరిణామము నంది మానవరూపముల నందుచున్నవని యాతని సిద్ధాంతము. నియమ బద్ధములైన ఆహారాచార విద్యాది విషయములు మానవునికి మానవత్వము నాపాదించు చున్నవి. ఈ మానవత్వమును నశింపఁ జేయఁగల ప్రకృతి శక్తు లసంఖ్యాకములుగా నున్నవి. మానవుఁ డా ప్రకృతిశక్తు

లను జయించు శక్తి సామర్థ్యములు లేనివాఁడైనచోఁ దన మానవత్వమును గోల్పోయి ప్రాచీన జీవన విధానమున కలవడి మానవత్వమును గోల్పోవునని కూడ యీ శాస్త్రజ్ఞుఁడు చెప్పెను. ఈ సిద్ధాంతము లాధారముగ మన తత్వ శాస్త్ర మభివృద్ధి యయ్యెను.

ప్ర. 8 : వైద్యరంగమున నీ యుగమున జరిగిన కృషి యెట్టిది? వాని వలనఁ గలుగుచున్న యుపయోగము లేవి?

జ. : ఆధునిక యుగమున శాస్త్రజ్ఞులు గొందఱు వివిధ రోగపీడిత మానవకోటిని సముద్ధరింపఁ దీవ్రకృషి సలిపిరి. మఱికొందఱు శాస్త్రజ్ఞులు కనుగొన్న నూతన విషయములు యాదృచ్ఛికముగ వైద్యశాస్త్రమునం దుపయుక్తములైనవి ఈ కృషివలన నేఁడు వ్యాధి నిరోధము, వ్యాధి నివారణము, జరుగుచు నకాలమరణ సంఖ్య తగ్గుచు వచ్చుచున్నది. ఇందు టీకాలు–మొదలగునవి నిరోధక పద్ధతులు. ఎక్సురే వలన శరీరములోని లోపలి భాగములను స్పష్టముగాఁ బరిశీలింప నవకాశము గలుగుచున్నది. రేడియమ్ వలన నసాధ్య వ్రణములు చికిత్సింపఁబడు చున్నవి. శస్త్రచికిత్సా విధానము చాలగా నభివృద్ధి నందినది. చికిత్సకుఁ డొక దుష్టాంగమును ఖండించి దానికి మాఱుగ నొక కృత్రిమాంగము నచ్చుట నదుకుచు రోగికి వికార రూపము రాకుండఁ జేయుచున్నాఁడు. ప్రాణవాయువును ప్రయోగించి మరణమును గొంత కాలము వఱకైన నాపుచేయఁ గల్గుచున్నాఁడు. మఱియు రోగనిదానము నందును, చికిత్సా విధానము నందును నూత్న పద్ధతు లెప్పటి కప్పుడే కనుగొనఁ బడుచున్నవి. ఇట్లు వైద్యరంగమునఁ జరిగిన కృషి యపూర్వము,

ప్ర. 9 : మానవ దైనందిన జీవితమును సుఖమయము గావించిన నూతన వైజ్ఞానిక శాస్త్ర వర విశేషములేవి?

జ. : మానవ దైనందిన జీవితము నత్యంత సుఖప్రద మొనర్చుటకు వీలైన యనేక నూతన విషయము లాధునిక యుగమునఁ

గనుగొనఁ బడినవి. వీనియందు విద్యుచ్ఛక్తి యొక్క మహా ద్భుత విషయము. దీని సాయమున నిత్యాహారమున నన్ని కృత్యములు యాంత్రికముగ జరుగును. మానవ శక్తి నన్యథా వినియోగింప నవకాశము కలుగుచున్నది. వ్యక్తిగత సాంఘిక ప్రయోజనము లెన్నియో దీనివలన సాధింపఁ బడుచున్నవి. టెలివిజన్, రేడియో, సినిమా, టెలెగ్రాము, టెలిఫోను మొదలగున వన్నియు విజ్ఞాన శాస్త్రము ప్రసాదించిన వర విశేషములే. భూమ్యాకాశ జలమార్గముల విహరింప ననువగు ప్రయాణ సౌకర్యము లాధునిక విజ్ఞానాభివృద్ధి వలనఁ గలిగిన ప్రయోజనములే.

ప్ర. 10: వాస్తుశాస్త్రజ్ఞుల కృషి నెన్నుఁడు.

జ. : వాస్తుశాస్త్రజ్ఞులు దేశాభివృద్ధి సాధనమునకు మూల స్తంభములని చెప్పఁదగుదురు. వీరు తమ నిర్మాణ కౌశలము నుపయోగించి వివిధములైన సుందర భవనములు, వంతెనలు, ఆనకట్టలు, బాటలు, గొప్ప "ప్రాజెక్టు"లు కట్టుచున్నారు. ఇవి యెల్ల విజ్ఞానశాస్త్ర పరిశోధన ఫలితములే.

ప్ర. 11: పారిశ్రామిక కార్థిక రంగముల విజ్ఞానశాస్త్ర పురోగమును వివరింపుఁడు.

జ. : పారిశ్రామిక రంగమున నావిరియంత్రము సృజింపఁబడిన తరువాత నది దేశముల యార్థిక స్థితిగతులను మార్చివైచెను. దానితో సాంఘిక పరిస్థితులందును మార్పు లనివార్యమయ్యెను. ఈ యంత్రము వలనను, విద్యుచ్ఛక్తి వలనను పరిశ్రమ లధికములై వస్తూత్పత్తి పెరిగి దేశపు టార్థిక స్తోమత దృఢతరమైనది. ఈ యంత్రముల వలననే చిన్న సూదులు మొదలు విమానముల వఱకుఁ దయారు చేయబడు యంత్రాగారములు పని చేయుచున్నవి

ప్ర. 12: ఆధునిక శాస్త్రాభివృద్ధి వలనఁ గలిగిన యనర్థమేమి ? దానిని సద్వినియోగ మొనర్చుకొను టెట్లు ?

జ. : ఆధునిక శాస్త్రాభివృద్ధి శాంతి సమయములందు కంటె యుద్ధ సమయములందుఁ బ్రస్ఫుటముగఁ గనఁబడుచున్నది. తుపాకి మందు నుండి నేఁటి యణ్వస్త్రము వఱకు విజ్ఞానశాస్త్ర ఫలితములే. శాస్త్రీయ జ్ఞానమును దుర్మార్గముల నుపయోగింప తలఁచు మానవుని స్వార్థబుద్ధియే వీని సృష్టికి మూలము. ఈ బుద్ధి మాని యణుశక్తిని సర్వమానవ కల్యాణమునకు నుపయోగింప వచ్చునని యు శాస్త్రజ్ఞులు కనుగొనిరి. ఈ స్థితి యచిర కాలమున సంభవించుగాక యని ప్రపంచ ప్రజ లాశించుచున్నారు.

## III. వ్యాకరణాంశములు

ప్ర. 1: క్రింది సమాసములకు విగ్రహవాక్యములు వ్రాసి సమాస నామములఁ బేర్కొనుఁడు :

1. కందమూలఫలములు=కందములు, మూలములు, ఫలములు : బహుపద ద్వంద్వము
2. ఊహాజనితము=ఊహవలనఁ బుట్టినది : పంచమీ తత్పురుషము (ఊహయందుఁ బుట్టినది - సప్తమీ త॥ గాఁ గూడ చెప్పుదురు.)
3. విశ్వశ్రేయస్సు=విశ్వముయొక్క శ్రేయస్సు : షష్ఠీ తత్పురుషము
4. దుష్టాంగము=దుష్టమైన అంగము : వి॥ పూ॥ కర్మధారయము
5 అపూర్వము=పూర్వము లేనిది : నఞ్ తత్పురుషము
6 ప్రతికృత్యము=కృతకృత్యము : అవ్యయీభావ సమాసము
7. జరామరణశీలుఁడు=జరామరణ స్వభావము గలవాఁడు : బహువ్రీహి
8. పరిశోధనాసక్తుఁడు=పరిశోధనయం దాసక్తుఁడు : సప్తమీ తత్పురుష

ప్ర. 2: క్రిందివానిని విడదీసి సంధినామములు పేర్కొనుఁడు.

1. సృష్టి+ఆది = సృష్ట్యాది : యణాదేశసంధి
2. మార్గ+ఉపరిభాగము = మార్గోపరిభాగము : గుణసంధి
3. ఇతరః+అధికము = ఇతరోఽధికము : విసర్గసంధి
4. శాస్త్ర+అభివృద్ధి = శాస్త్రాభివృద్ధి : సవర్ణదీర్ఘసంధి

5. దేశ(ము) + పు + ఆర్థి కస్థితి :-

(1) కర్మధారయంబుల 'ము' వర్ణకంబునకు బుంపులగు.

(2) కర్మధారయంబులం దుత్తున కచ్చుపరంబగునపుడు 'టు' గాగమం బగు.

ప్ర. 3 : క్రింది ప్రకృతులకు వికృతులు, వికృతులకుఁ బ్రకృతులు వ్రాయుఁడు.

| ప్ర | వి | ప్ర | వి |
|---|---|---|---|
| భోజనము | బోనము | ఆశ్చర్యము | అచ్చెరువు |
| శక్తి | సత్తి | సూచి | సూది |
| భస్మము | బసమము | విజ్ఞానము | విన్నాణము |

# ౯. ప్రేమబలము

## I. అర్థాదులు

పుట 67. తపనుఁడు=తపింపజేయువాఁడు (సూర్యుఁడు), డించి=అడఁగి (విడిచి అని యిట నర్థము చెప్పుకోవలెను), ఆరోహించు×అవరోహించు, సంజ కెంజాయ=సంధ్యాకాలపు ఎఱ్ఱనికాంతి, అలమికొను=వ్యాపించు, కులాయములు=గూండ్లు, నినాదసంయుతము=ధ్వనులతోఁ గూడినవి.

పుట 68. దిననాథుఁడు=సూర్యుఁడు, మలినపూరితములు = మలినముతో నిండినవి, జీర్ణభావము=పురాతనభావము (ప్రాఁతఁదనము), లెస్సగా=బాగుగా, అంధకార + ఆవృత + బిలము=చీఁకటిచే నావరింపఁబడిన రంధ్రము (గుహవంటిది).

పుట 69. కడపటి జతనము=చిట్టచివరి ప్రయత్నము, వమ్ము+అయ్యె = వ్యర్థమయ్యెను, పూర్వ+ఉక్త+వాక్యము=పూర్వము చెప్పఁబడిన వాక్యము.

పుట 70. ఎడదతో=హృదయముతో, తెగువాఱి=సాహసికురాలు, అంధకార బంధురము=చీఁకటిచే నొప్పిదమైనది, కృతనిశ్చయ=చేయఁబడిన నిశ్చయము కలది, ప్రబలదృష్టాంతము=మిక్కిలి బలమైన తార్కాణము, నభంబు=ఆకాశము.

పుట 71. ప్రేలియుండెను=ప్రేలాడియుండెను, కంటకంబను = కంట కట్టఁబడిన స్తంభము, ఇంచుఁబోఁడి=చెఱకువలె మనోజ్ఞురాలగు స్త్రీ.

పుట 72. చేల + అంచలము=బట్టయొక్క అంచు, వాపోవకు=ఏడువకు.

పుట 73. కాలము + అతిక్రమించుటచే = కాలము మించిపోవుటచే, శృంఖలా, బద్ధని=గొలుసుచేఁ గట్టబడినవానిని, సన్నిహితము=సమీపము, మానిని=ఉన్నతచిత్తముగలది (స్త్రీ), కరయుగళము=చేతులజంట, కాలవిలంబనము=కాలక్షేపము (ఆలస్యము).

## II. ప్రశ్నోత్తరములు

ప్ర. 1: వృద్ధుఁ డెవరు? ఆతనిని యువతి కోరిన కోరిక యేమి? ఆతఁడు దాని నేల నిరాకరించెను?

జ. : క్రాంవెలు పరిపాలించు సమయమునఁ గారాగృహమునందలి గంటలను మ్రోగించు నుద్యోగమున నా వృద్ధుఁ డుండెను. యువతి యాతని డగ్గరి యా నాఁటిరాత్రి నిర్ణీతసమయమున నాతఁడు గంటలు మ్రోగింపఁగనే కారాగృహమున బంధింపఁ బడియున్న తన ప్రియుఁ డురితీయఁబడునని యాందోళిత హృదయయై యాతనితోఁ జెప్పెను. ఆనాఁడు క్రాంవెలు బయటకురాఁడు కావున గంటలుకొట్టుట మానివేసి తన ప్రియుని రక్షింపుమని యామె యా వృద్ధుని కోరెను. చాల కాలమునుండి క్రమబద్ధముగఁ దన విధిని నిర్వహించుచున్న యా వృద్ధుఁ డానాఁడు తన విధి నిర్వహణమును భంగము గావింపనని స్పష్టముగాఁ జెప్పివైచెను.

ప్ర. 2: తన కోర్కె నెఱవేఱుట కా యువతిపన్నిన యుపాయ మెయ్యది? అదెట్లు సఫల మయ్యెను?

జ. : గంటలుకొట్టుట మానివైచి తన ప్రియుని రక్షింపుమని యువతి వృద్ధుని కోరెను. ఆతఁడు నిరాకరించెను ఆమె లెస్సగా యోజించి తనలో నస్ఫుటముగ "గంట మ్రోగకుండుగాక" అని పలుకుచుఁ ద్వరితగతిని గంట వ్రేలాడఁ గట్టఁబడిన తావునకుఁబోయి యున్నత గోపుర శిఖరమునకు గల చీఁకటిదారినిబడి యెక్కి కొంత తడవునకు ఘంటాంచలమును బట్టుకొని వ్రేలాడసాగెను. మఱికొంతసేపటికి వృద్ధుఁడు నిర్ణీత కాలమునకు గంటత్రాడు పట్టుకొని లాగెను. యువతి వ్రేలాడుచుండుటచే నా గంట మ్రోగకుండెను. వృద్ధుఁడు

బధిరుఁడగుటచే గంట మ్రోగెనో లేదో తెలియకుండెను. తన పనిని ముగించుకొంటినిగదా యని వృద్ధుఁడు తృప్తినొందెను. పిదపఁ గొంత తడవునకు యువతియు దిగివచ్చెను. ఆమె చేతులు చిటిలి రక్తమయములై బాధించుచుండఁగా నామె రాచబాటలోఁబడి పోవుచుండెను. ఆ నాఁడు ఘంట లేల మ్రోగ లేదాయని తలఁచుచు క్రాంవెలా దారినే పాదచారియై వచ్చుచు నామె కెదురుపడెను. అతనిఁజూచి యాగరిత పాదములపై వ్రాలెను. అతఁడు లేవనెత్తి జాలిగా నీకుఁగలిగిన యాపద యేమనెను. ఆమె యావేగమునఁ బలుకఁజాలక యూరక యేడువఁదొడగెను. బుద్ధిమంతుఁడైన క్రాంవెలు సర్వమును గ్రహించి యామె సాహసమునకు మెచ్చి "నీ ప్రియుని క్షమించితిని. ఇదిగో క్షమాపత్రమును గొనుము" అనుచు క్షమాపత్రమును వ్రాసియిచ్చెను. యువతి దానిని గ్రహించి మరల నాతనికి మ్రొక్కి వేవేగఁ గారాగృహమునకుఁ బరువెత్తెను. అప్పటికి కారాధికారులామె ప్రియుని యురికంబము కడకుఁ గొనివచ్చుచుండిరి. ఆమె క్షమాపత్రమును వారికిఁజూపి తన ప్రియుని రక్షించుకొనెను.

ప్ర. 3 : క్రాంవెలు ఆమెప్రియు నేల క్షమించెను ?

జ. : పై ప్రశ్న సమాధానమును జూడుఁడు.

ప్ర. 4 : ఆ భామిని మన సావిత్రివంటిది. ఎట్లు ? ఆ భామినికి సావిత్రికి సామ్యమేమి ? (భేదమేమి)

జ. : సావిత్రి సత్యవంతుని వరించి పెండ్లాడెను. అతఁడు దైవవశమున మరణింప నాతని ప్రాణములను గొనిపోవచ్చిన యముని విడువక వెన్నాడి యాతనిచే వరములనంది భర్తను బ్రతికించుకొనెను. ఈ కథలోని యువతియు రాజాజ్ఞచే మరణింప సిద్ధముగనున్న భర్తను దానొక సాహసకృత్యమొనర్చి రాజు దయను సంపాదించి భర్తను రక్షించుకొనెను. వీరిరువుర కింత మాత్రమే సామ్యము. తక్కిన చరిత్రమెల్ల విభిన్నమైనదే!

# III. వ్యాకరణాంశములు

ప్ర. 1 : క్రింది సమాసములకు విగ్రహవాక్యములు వ్రాసి, యవి యే సమాసములో పేర్కొనుఁడు.

1. తెల్లనిగడ్డము=తెల్లనైన గడ్డము : వి॥ పూ॥ కర్మధారయము
2. అంధకారకల్లోలిని=అంధకారమనెడి కల్లోలిని : రూపక సమాసము
3. చీకటిరంగు=చీకటి (రంగు) వంటి రంగు : ఉపమాన పూర్వపద కర్మధారయము
4. ప్రతిదినము=దినము దినము : అవ్యయీభావ సమాసము
5. అధరపల్లవము=పల్లవమువంటి అధరము : ఉపమానోత్తరకర్మధారయము
6. వివర్ణవదనము=వివర్ణమైన వదనము : వి॥ పూ॥ కర్మధారయము
7. హృదయదర్పణము=హృదయమనెడి దర్పణము : రూపక సమాసము
8. ఓష్ఠకిసలయము=కిసలయమువంటి యోష్ఠము : ఉపమానోత్తరపద కర్మధారయము
9. మంత్రాక్షరము=మంత్రముయొక్క అక్షరము : షష్ఠీ తత్పురుషము
10. హస్తపల్లవము=పల్లవమువంటి హస్తము : ఉపమానోత్తరపద కర్మధారయము
11. ధైర్యసాహసము=ధైర్యము సాహసమును : ద్వంద్వ సమాసము
12. తమ్మికంటి=తమ్మివంటి కన్నుగలది : బహువ్రీహి సమాసము
13. పాదసరోజములు=సరోజములవంటి పాదములు : ఉపమాన పూర్వపద కర్మధారయము
14. మందగమనము=మందమైన గమనము : వి॥ పూ॥ కర్మధారయము
15. ససంభ్రముఁడు=సంభ్రమముతోఁ గూడినవాఁడు : సహపూర్వపద బహువ్రీహి సమాసము

ప్ర. 2 : క్రింది ప్రకృతులకు వికృతులు, వికృతులకుఁ బ్రకృతులు వ్రాయుఁడు.

| ప్ర | వి | ప్ర | వి |
|---|---|---|---|
| సంధ్య | సంజ | పక్షి | పక్కి |
| కుడ్యము | గోడ | యత్నము | జతనము |
| అక్షరము | అక్కరము | హృదయము | ఎద |
| ఘంట | గంట | | |

ప్ర. 3 : క్రిందివాని యందలి వ్యాకరణ విశేషములను వివరింపుఁడు.

1. అయ్యెడఁ=(అ+ఎడ) :- త్రికసంధి చూడుఁడు.

2. తెల్లనిగడ్డము=గుణవచనంబులగు నల్లాదులకుం గర్మధారయంబునందు నిగాగమంబు బహుళంబుగానగు.

3. ములుకులు=(ములికి+లు) :- వికృతియం దికారాంతములు యుపోత్తమేత్వంబునకు బహువచనము పరంబగునపు డుత్వంబగు.

4. వృద్ధు:- వృద్ధాతుల డుజ్ఞనకు లోపము విభాషనగు.

5. పాదాలు=పాదము+లు:- లు, ల, న లు పరంబగునపుడు ఒకానొకచో 'ము' గాగమంబునకు లోపంబును తత్పూర్వస్వరంబునకు దీర్ఘంబును విభాషనగు.

# ౧౦. రెడ్డియుగము - ఆంధ్రవాఙ్మయము

## I. అర్థాదులు

పుట 75. విశిష్టత=ప్రత్యేకత, వ్యత్యాసము=భేదము.

పుట 76. ఈసడింపు = నిరసనము, తదన్యము = దానికంటె నితరము, ఆశ్రితవత్సలవృత్తి=ఆశ్రితులయందు స్నేహముతోఁగూడిన నడవడి

పుట 77. ఏకస్థాపనాచార్యులు=(బిరుదుపదము) ఏకరాజ్యమును స్థాపించిన ఘనులు.

పుట 78. సంస్కృతభాషావధూటికి=సంస్కృతభాష యనెడు స్త్రీకి, సంగ్రామములు=యుద్ధములు, రాజ్య+లాభ+ఆకాంక్షనో = రాజ్యలాభమునందలి కోరిక వలననో, పర+రాజ+ఆక్రమణ+నివారణము=శత్రురాజుల యాక్రమణమును బోగొట్టుట.

పుట 79. ప్రబోధము=మేలుకొలుపు, ప్రాచీనసంప్రదాయశృంఖలములు=పూర్వాచారములను సంకెలలు, సడలినవి=సన్నగిలినవి, సామాన్య, జన, వృత్త, వర్ణనము=సాధారణజనులయొక్క చరిత్రను వర్ణించుట.

పుట 80. ప్రజావాది = ప్రజలపక్షమున వాదించువాఁడు, భూనేతలు=భూమికినాయకులు (ప్రభువులు), అనుబంధము=సంబంధము, పాదివిశోను=చెక్కు కోను, గౌరవ,ప్రతిష్ఠా,సముచితము=ప్రతిపత్తి గౌరవములతోఁ బూజింపఁదగినది, అకుంఠిత=మొక్కవోని, పరస్పరసమాశ్రయభావమున = ఒండొరుల నాశ్రయించు తాత్పర్యమున.

పుట 81. సమ్+ఆచార+బద్ధులు = తెస్పయైన యాచారముచేఁ గట్టఁబడినవారు, సంప్రదాయ+అతిక్రమణ+సంసిద్ధులు=సంప్రదాయమును అతిక్రమించుటకు మిక్కిలి సిద్ధమైనవారు.

## II. ప్రశ్నోత్తరములు

ప్ర. 1: రాజరాజునకుఁ బూర్వము భాషావిషయమునఁ బ్రజలలోఁ గల యభిప్రాయము లెట్టివి?

జ. : సంస్కృతము దేవతల భాష యగుటవలనను పవిత్రములైన మత గ్రంథముల భాషయగుట వలనను దేశ భాషలకంటె నదియె యుత్తమస్థానము నాక్రమించి యుండెను. సంఘములోఁ గూడ సంస్కృతాంధ్ర విద్యా విశారదులకుఁ జూపఁబడు గౌరవమునందుఁగూడ వ్యత్యాసముండెడిది. గీర్వాణ భాషయే రాజభాష, పండితభాష. అదియే యుత్తమ గ్రంథరచన కను వగు భాష. తెనుఁగు కావ్యత్వసిద్ధికి అది తగినది కాదను భావము విద్వాంసులలో వ్యాపించి వారివలన రాజులకు నట్టి నమ్మకము కుదిరెను. ఆ ద్వారమున నది ప్రజలలోను వ్యాపించెను.

ప్ర. 2: రాజరాజు నాదరణమున నాంధ్ర మెట్లభివృద్ధి నందెను?

జ. : అంతవఱకు నాంధ్రకవులే సామంత మండలేశ్వరులనో మంత్రి సేనాపతులనో యాశ్రయింపవలసి యుండఁగా రాజరాజు స్వభాషయైన యాంధ్రమునెడల నభిమానముజూపి యాంధ్ర కవుల నాదరించుటేకాని, యాంధ్రమున గ్రంథములను రచింపఁ బ్రోత్సహించెను. మహాకవియైన నన్నయభట్టారకుని మహాభారతమును దెనుఁగున వ్రాయుమని యర్థించెను. ఆంధ్ర మహాభారతమునకు నన్నయభట్టు శ్రీకారము జుట్టిన సుముహూర్తమునుండి యాంధ్రమునకు రాజావలంబనము లభింపఁ జొచ్చెను.

ప్ర. 3: ఆంధ్రవాఙ్మయ చరిత్రమున రెడ్డియుగము తెచ్చి పెట్టిన మార్పేమి?

జ.: రెడ్డి రాజులు మహారాజాధిరాజులైన పిదపఁగూడ తెలుగును విడువలేదు. వారు దానిని రాజమర్యాదలతో సత్కరించి పోషించిరి. అయినను సంస్కృతమును విడనాడలేదు. సంస్కృతాంధ్రములు రెండును మహారాజుల యెత్తుచేతి బిడ్డలైనవి. తెలుఁగు కవిసార్వభౌముఁడైన శ్రీనాథకవి దేవభాషా పండితులకుఁగూడ విద్యాపరీక్షాధికారిగా నొనర్పఁబడిన దీ రెడ్ల కాలమునందే. ఇట్టి రాజాశ్రయము ఆంధ్రవాఙ్మయ వికాసమున నొక నూతన పరిణామమును గొనివచ్చినది.

ఈ కాలమునఁ బ్రజలలో నొక రాజకీయ చైతన్యము పొడసూపెను. కేవలము రాజులేని కాలమునఁ బ్రజలే నడుములు కట్టి మహమ్మదీయులను పాఱఁద్రోలి స్వేచ్ఛాస్వాతంత్ర్యముల సంపాదించుకొనిరి. ఈ ప్రజాప్రబోధము ఆంధ్రవాఙ్మయమున నొక క్రొత్త మార్పును కలిగించినది.

రెడ్డియుగారంభము వఱకు నాంధ్రవాఙ్మయము ప్రత్యేకము మతము కొఱకే మత ప్రబోధముకొఱకే మతధర్మ వ్యాపనము కొఱకే పరికరముగా నుండెడిది. కావున నాంధ్రగ్రంథములెల్ల సంస్కృతానువాదములో అనుకరణములోనై యుండెను. అవి ధర్మమోక్షసాధనమే లక్ష్యముగాఁ గలవి. ఈ సంప్రదాయములు కొన్ని యీ యుగమున సడలినవి. తెనుగుకవిత సామాన్య జనప్రవృత్తవర్గమునకు అంతకంతకు వాడుక చేయబడుచు వచ్చినది. ఈ విషయము శ్రీనాథుని గ్రంథములవలనను చాటువులవలనను సువిదితమగుచున్నది. ఇట్లు రెడ్లనాఁటి యాంధ్రవాఙ్మయము సంఘమునకు వాఙ్మయమునకు గల యనుబంధమునే కాక యుపయోగమును గూడ చాటిచెప్పినది. ఈ రెడ్ల కాలము అతి త్వరితముగ నంతరించి పోవుచున్న భూతకాలమునకును దివ్యవర్ణాంచితమును, అధిక ఫల భరితమునైన భావికాలమునకును అతుకు కలుపు సంధిగఁ బ్రకాశించినది.

4 : రెడ్డియుగమున శ్రీనాథుఁ డెట్లు ప్రసిద్ధికి వచ్చెను? ఆయన భాషకొన ర్చిన సేవ యేమి?

: శ్రీనాథుఁ డాంధ్రగీర్వాణములయం దపారమైన పండితుఁడు. ఆయన ఆంధ్రకవిగా రెడ్డిరాజుల యాశ్రయము నందెను. పెదకోమటి వేమారెడ్డి యాస్థానమునఁ గవియై సంస్థాన విద్యాధికారియై మన్నన లందెను. కొండవీటి రాజ్య మస్త మించిన పిదప దేశసంచార మొనర్చి రాజమహేంద్రవరపు రెడ్ల యాశ్రయమును సంపాదించెను. నైషధము, హరవిలా సము, భీమఖండము, కాశీఖండము మున్నగు నీయన గ్రంథము లెల్ల సంస్కృతానువాదములే. కాని యానాటి ప్రజాజీవితము నకు జీవగఱ్ఱ యనఁదగు శౌర్యోత్సాహములతోఁ బులకరించి యీయన రచించిన పలనాటివీరకథ నాఁటి సంఘసాహిత్యాను బంధమున కొక చిహ్నముగ నిలిచినది.

5 : రెడ్డియుగమున జరిగిన ప్రజాప్రబోధము, జాతీయప్రబోధము, దేశభాషా గౌరవము మున్నగువానిని వివరించునది.

: పై మూఁడవప్రశ్నలోఁ జూచునది.

6 : రెడ్డియుగమునఁ గలిగిన విప్లవమునకు దారిచూపిన గ్రంథములేవి? అవి యెట్లు రాజకీయ సాంఘికములందు మార్గముఁ జూపినవి?

: కేయూరబాహుచరిత్ర, దశకుమార చరిత్రములు రెడ్డియుగ మునకు ముందే వెలువడిన కృతులు. అవి నాఁటి సాంఘిక రాజకీయ పరిస్థితుల కనుగుణముగ వెలసినవి. సాహస కార్యము లొనర్చుటయందు కుతూహలముగల యానాఁటి ప్రజల మనఃప్రవృత్తి కా గ్రంథములు ప్రతిబింబములు. ఆ కృతులలో నా కాలము ఆ కాలములో నా కృతులు పరస్పర సమాశ్రయ, భావమున బ్రకాశించినవి.

7 : రెడ్డియుగమున నుద్భవిల్లిన వాఙ్మయము ప్రత్యేకతను బరిశీలించునది.

రెడ్డియుగమున జనించిన వాఙ్మయము పూర్వపు సంప్రదాయ శృంఖలలఁ గొంతవఱకు సడలించి కొన్నది. అప్పటి నుండి

తెనుఁగు కవిత సామాన్య జనవృత్త వర్ణనమునకు వాడుక చేయఁబడఁ జొచ్చెను. ఈ మార్పువలన నిఁకముందు నికరమైన కావ్యానందమే పరమార్థముగాఁ గల రసవంతమైన స్వతంత్ర ప్రబంధము లవతరించుటకు మార్గమేర్పడినది.

ప్ర. 8: రెడ్డియుగమునాఁటి యాంధ్ర జీవిత మెట్టిది?

జ.: రెడ్డియుగపుఁ బ్రజ లెంతటి వీరులో యంతటి యుదారులు, భోగులు, త్యాగులు, ఆచార బద్ధులయ్యును సంప్రదాయాతిక్రమణ సంసిద్ధులు. ఆనాటి ప్రజాజీవితము నిండు జీవముతో విద్యుద్వల్లరివలె మిలమిలలాడి తళతళలాడి విరిసి మెఱసి పోయినది. ఆ నాఁటివారు సమరు బెదురు లేక యణువణువున నానందలహరి పొంగి పొరలునట్లు మధుర రసమయ జీవనమును గడిపిరి. ఆ జీవితమంతయు యథార్థమే కాని కృత్రిమము లేదు. నాఁటి యాంధ్రుల జీవితము శ్రీకృష్ణ మురళీగానములో నొక మధురస్వరము.

ప్ర. 9: రెడ్డియుగము - ఆంధ్రవాఙ్మయము అను వ్యాసమును రచించినవా రెవరు? వారిని గూర్చి మీకేమి తెలియును?

జ.: పాఠ్యగ్రంథములోని పరిచయ వాక్యములను జూడుఁడు.

## III. వ్యాకరణాంశములు

ప్ర. 1: క్రింది సమాసములకు విగ్రహవాక్యములు వ్రాసి, యవి యే సమాసములో పేర్కొనుఁడు.

1. దానధర్మములు = దానమును, ధర్మమును : ద్వంద్వ సమాసము
2. భాషావధూటి = భాష యను వధూటి : రూపక సమాసము
3. ఆంధ్రవాఙ్మయవికాసము = ఆంధ్రవాఙ్మయము యొక్క వికాసము : షష్ఠీ తత్పురుషము
4. ఉన్నతపదము = ఉన్నతమైన పదము : వి॥ పూ॥ కర్మధారయము
5. ఆత్మగౌరవము = ఆత్మయొక్క గౌరవము : షష్ఠీ తత్పురుషము
6. చతుర్విధ పురుషార్థములు = చతుర్విధములైన పురుషార్థములు : వి॥ పూ॥ కర్మధారయము

7. ధర్మార్థకామమోక్షములు = ధర్మము, నర్థము, కామము, మోక్షమును : బహుపద ద్వంద్వ సమాసము

8. కావ్యకోకిలములు = కావ్యములనెడు కోకిలములు : రూపకసమాసము

9. కావ్యానందము = కావ్యమువలని ఆనందము : పంచమీ తత్పురుషము

10. ఆనందలహరి = ఆనందమనెడు లహరి : రూపక సమాసము

11. మధురస్వరము = మధురమైన స్వరము : వి॥ పూ॥ కర్మధారయము

2 : క్రింది ప్రకృతులకు వికృతులు, వికృతులకుఁ బ్రకృతులు వ్రాయుఁడు.

| ప్ర | వి | ప్ర | వి |
|---|---|---|---|
| భాష | బాస | కవిత | కైత |
| గౌరవము | గారవము | భారము | బరువు |
| ధర్మము | దమ్మము | శృంఖలము | సంకెల |
| పుణ్యము | పున్నెము | కథ | కత |
| కార్యము | కర్జము | కోకిల | కోయిల |
| భాగ్యము | బాగెము | | |

3 : క్రింది వానియందలి వ్యాకరణ విశేషములను వివరింపుఁడు.

1. పూర్వ(ము) + పు + యుగము :- కర్మధారయంబున 'ము' వర్ణకంబు నకుం బుంపులగు.

2. ఎఱ్ఱఁదనము :- ఉదంత స్త్రీసమంబులకుం బుంపులకు నదంత గుణ వాచకంబులకును 'దనంబు' పరమగునపుడు 'ను' గాగమంబగు.

3. కన్గొలకులు (కన్ను + కొలకులు) :- (1) కన్నులోని జడ్డకు లోపము. (2) పిదప ఉకారలోపము.

4. మున్ముందు (మున్ను + ముందు) :- పై విధముగనే జడ్డకు లోపము, ఉకార లోపము.

5. మొట్టమొదటిమాటలు :- ఆమ్రేడితంబు పరంబగునపుడు కడాదులం దొలియచ్చు మీఁదివర్ణంబులకెల్ల నదంతంబగు ద్విరుక్త 'ట' కారంబగు.

# ౧౧. రఘునాథనాయకుఁడు

## I. అర్థాదులు

పుట 84. అగ్రగణ్యుఁడు=మొదట లెక్కింపఁదగినవాఁడు, శత్రువిజేత=శత్రువులను జయించినవాఁడు, సింహాసన+అధిష్ఠితుఁడు=సింహాసనము నారోహించినవాఁడు.

పుట 85. ప్రజ్వరిల్లినది=ప్రకాశించినది, నిదర్శనము=దృష్టాంతము, ఎత్తివచ్చినవి=దండెత్తివచ్చినవి, దయార్ద్రహృదయుఁడు=దయచేఁ దడిసినహృదయము గలవాఁడు.

పుట 86. అభేద్యము=భేదింపరానిది, దూరదర్శి=దూరపుచూపు కలవాఁడు, బలవద్వైరి=బలవంతుఁడైన శత్రువు, రణము=యుద్ధము, చిరయశస్సు=చాలకాలము నిలుచు కీర్తి, ఉషఃకాలము=ఉదయపు సంధ్యాకాలము (తెల్లవారుటకు ముందు నాలుగు గడియల కాలము).

పుట 87. అవక్రపరాక్రముఁడు=వక్రములేని పరాక్రమము కలవాఁడు, వర్ణన విశిష్టత=వర్ణనలయొక్క ప్రత్యేకత, ఇంపు+ఎసలార=ఆనంద మతిశయింప.

## II ప్రశ్నోత్తరములు

ప్ర. 1: రఘునాథనాయకుఁ డెవరు? అతని గుణగణము లెట్టివి?

జ.: రఘునాథనాయకుఁడు తంజాపుర నాయకరాజైన యచ్యుత నాయకుని కుమారుఁడై, యాతని పిదప నా రాజ్యము నఖండ ప్రతాప వైభవములతోఁ బాలించిన తెలుఁగురాజు. ఈయన చతుష్షష్టి కళలను బాల్యమునందే యభ్యసించెను. ధనుర్విద్య, కత్తిసాము మొదలగు రాజోచిత విద్యల నాఱితేరిన మేటి వీరుఁడు. వినయము, ధర్మబుద్ధి, సత్ప్రవర్తనము, శరణాగత రక్షణము, పరాక్రమము నాతని నైజగుణములు.

ప్ర. 2: రఘునాథుఁడు బాల్యమున నొనర్చిన యుద్ధములేవి?

జ.: రఘునాథుఁడు యువరాజుగా నున్నప్పుడు విజయనగరాధీశుఁడగు వేంకటపతిరాయలపై మధురజింజీరాష్ట్ర నాయకు లెత్తి వచ్చిరి. రఘునాథుఁడు నూనూగు మీసాల నూతన యౌవన

మున నున్నవాఁడు. అతఁడు రాయలపక్షమును వహించి శత్రువులను దఱిమివైచి రాయలను సింహాసనముపై సుప్రతిష్ఠితుని గావించెను. ఇంకొకపరి పోర్చుగీసువారు తంజావూరునఁ గల్లోలములు గల్పించుచుండ రఘునాథుఁడు వారినిఁ దఱిమెను. మఱియొకమాఱు గొలకొండ సుల్తాను రాయలమీఁదికెత్తివచ్చినపు డాతఁ డెదిరించి సుల్తాను నోడించెను. ఈ యుద్ధము లాతని పరాక్రమమును చాటుటేకాక స్వామిభక్తి పరాయణతను వేనోళ్ల జాటినవి.

ప్ర. 3: రఘునాథుఁడు సింహాసన మెక్కినప్పటికి పరిస్థితు లెట్లుండెను.

జ. : (a) రఘునాథుఁడు సింహాసన మెక్కిన వెనుకనే యాతనిపై మధుర, జింజీ, పోర్చుగీసు రాజ్యములు మూఁడు నొక్కుమ్మడిగా దాడిచేసిరి. వీరికిఁ దోడుగ దేవకోట కేలిక యగు చోళుఁడును వచ్చెను.

(b) పోర్చుగీసువారు సింహళములోని జాఫ్నా రాజును దొలగించి రాజ్యము నాక్రమింప నాతఁడు రఘునాథుని శరణుఁ జొచ్చెను. రఘునాథుఁ డాతని కభయమిచ్చెను.

(c) చంద్రగిరిలో వేంకటపతిరాయల మరణానంతరము కుమారుఁడు శ్రీరంగరాయలు సింహాసన మెక్కగా జగ్గరాజను నాతఁడు కుట్రచేసి శ్రీరంగరాయల కుటుంబము హత్యజేసెను. రాజ కుటుంబమునందు భక్తిగల యాచమ నాయకుఁడను నాతఁడు శ్రీరంగరాయల కుటుంబములోని చిన్ని బాలుని రామరాయ లనువాని నెట్లో మృత్యువునకుఁ దప్పించి, రఘునాథుని శరణు జొచ్చెను. ఈ స్వామిభక్తి పరాయణుఁడగు రఘునాథుఁ డా బాలుని రక్షించి సింహాసనమునఁ బ్రతిష్ఠించు భారము వహింప వలసిన వాఁడయ్యెను.

ప్ర. 4 : రఘునాథుని సత్య వాక్పరిపాలన మెట్టిదో యుదాహరింపుఁడు.

జ. : పోర్చుగీసువారు సింహళములోని జాఫ్నా రాజును గొలగించి రాజ్యము నాక్రమింప నాతఁడు వచ్చి రఘునాథుని శరణు వేఁడెను. రఘునాథుఁ డాతని కభయ మొసఁగెను. రఘునాథుఁడు ముందుగా దన రాజ్యముపై నెత్తి వచ్చుచున్న చోళకుని తత్సహాయులైన పోర్చుగీసు వారిని, మధుర జింజీనాయకుల నోడించెను. పిమ్మట జాఫ్నా కేగి యచ్చటి పోర్చుగీసు వారినిఁ దఱిమికొట్టి తన వాగ్దానము ప్రకారము జాఫ్నా రాజునకు మఱల పట్టము గట్టివచ్చెను. ఇది యాతని సత్య వాక్పరిపాలన కుదాహరణమై యాతనికిఁ జిర యశస్సు నార్జించి పెట్టెను.

ప్ర. 5 : తోపూరు యుద్ధము, ఎవరి కెవరికి జరిగెను? దాని ఫలిత మేమి?

జ. : (పై మూఁడవ ప్రశ్నకు జవాబులోని మూఁడవపేరా [C] ఇచ్చట వ్రాసి, పిమ్మట నీ క్రింది విషయమును జేర్చుఁడు.)

రఘునాథుఁడు తన రాజ్యమునఁ గల్లోలముల నణఁచి, శత్రువులను బాఱఁద్రోలిన పిదప గొబ్బూరి జగ్గరాజు మధుర జింజీనాయకుల యొక్కయు, పోర్చుగీసువారి యొక్కయు సాహాయ్యముతో రఘునాథునిపై నెత్తివచ్చెను. రఘునాథుని పక్షమున యాచమనాయకుఁడు డచ్చివారు నుండిరి. ఇరు పక్షముల వారికిని "తోపూరు" అనుచోట ఘోరయుద్ధము జరిగెను. యుద్ధమున జగ్గరాజు హతమయ్యెను. మధుర జింజీ నాయకులు పరాజితులై పాఱిపోయిరి. విజేతయైన రఘునాథుఁడు రణరంగముననే రామరాయలను జంద్రగిరి రాజుగాఁ బట్టము కట్టెను.

ప్ర. 6 : రఘునాథ నాయకుని సంగీత సాహిత్య కళాపోషణమును వివరింపుఁడు.

జ. : దేశమున శాంతి యేర్పడిన పిదప రఘునాథుఁడు తన కాలమును సంగీత సాహిత్య పోషణముతోఁ గడిపెను. ఆయన స్వయము కవియై వాల్మీకి చరిత్రము రామాయణ భారత

సంగ్రహములు మొదలైన యనేక కావ్యములను రసవంతముగ రచించెను. ఈయన సంగీతమునందును బ్రతిభావంతుఁడు. ఈయన రఘునాథమేళ యనునొక క్రొత్తవీణెను సృజించి సంగీతశాస్త్రమున కొక నూతన గౌరవమును గూర్చెను.

ఈయన స్వయము కవియేకాక కవిపండిత పోషకుఁడు. ఈయన యాస్థానమున ననేకులు సంస్కృతాంధ్ర విద్వత్కవులు, కవయిత్రులు నుండిరి. కవులలోఁ జేమకూర వేంకట కవియుఁ, గవయిత్రులలో మధురవాణి, రామభద్రాంబ యను వారును ముఖ్యులు. వేంకటకవి తన విజయవిలాసమును రఘునాథునికే యంకిత మొనర్చెను. ఇట్లు రఘునాథ నాయకుఁడు కళారాధకుఁడై శ్రీకృష్ణరాయల వారితోఁ దుల్యుఁడై యఖండ యశస్సు నార్జించెను.

## III. వ్యాకరణాంశములు

ప్ర. 1: క్రిందివానికి విగ్రహవాక్యములు వ్రాసి యవి యే సమాసములో తెల్పుఁడు:

1. చతుష్షష్టికళలు = అఱువదినాల్గు కళలు : ద్విగు సమాసము
2. దానధర్మములు = దానమును ధర్మమును : ద్వంద్వ సమాసము
3. సువర్ణాక్షరములు = సువర్ణమైన అక్షరములు : వి॥పూ॥ కర్మధారయము
4. ఉషఃకాలము = ఉషస్సుఅను కాలము : సం॥పూ॥ కర్మధారయము
5. ధర్మశీలుఁడు = ధర్మమే శీలముగాఁ గలవాఁడు : బహువ్రీహి
6. స్వామిభక్తి = స్వామియందలి భక్తి : సప్తమీ తత్పురుషము

ప్ర. 2 : క్రింది ప్రకృతులకు వికృతులు, వికృతులకుఁ బ్రకృతులు వ్రాయుఁడు.

| ప్ర | వి | ప్ర | వి |
|---|---|---|---|
| స్వామి | సామి | యత్నము | జతనము |
| సంతోషము | సంతసము | ద్వీపము | దీవి |
| కావ్యము | కబ్బము | భారము | బరువు |
| వృద్ధ | పెద్ద | కర్పూరము | కప్పురము |

ప్ర. 3 : క్రిందివానిలో వ్యాకరణ విశేషములను వివరింపుఁడు.

1. మీఁసము + లు = మీఁసాలు :- లు, ల, న లు పరంబులగునపుడు ఒకానొకచో ముగాగమంబునకు లోపంబును దత్పూర్వస్వరంబునకు దీర్ఘంబును విభాషనగు.

2. పట్టము + ఏనుగు = పట్టపుటేనుగు :-

   (1) కర్మధారయమున 'ము' వర్ణకంబునకుం బుంపులగు.

   (2) కర్మధారయమునందుత్తున కచ్చుపరంబగునపుడు టుగాగమంబగు.

3. భయము + పడు = భయంపడు :- పడ్వాదులు పరంబగునపుడు 'ము' వర్ణకంబునకు లోపపూర్ణబిందువులు విభాషనగు.

4. ఉత్సవపు మచ్చట :- కర్మధారయంబున 'ము' వర్ణకంబునకుం బుంపు లగు.

# ౧౨. లేపాక్షి దేవాలయము

## I. అర్థాదులు

పుట 90. కుడ్యము = గోడ; కళా + అభిజ్ఞులు = కళల నెఱిఁగినవారు; కోశాధిపతి = ధనాగారము నధికారి; కూర్మ + ఆకారము = తాఁబేటి యాకారము.

పుట 91. వాస్తుశాస్త్రము = ఇండ్లు మొదలగు కట్టడములనుగూర్చి తెలుపు శాస్త్రము.

పుట 92. ఆలేపము = పూఁత; ప్రతిభామహత్త్వము = బుద్ధియొక్క గొప్పదనము; వాసికెక్కినది = ప్రసిద్ధికెక్కినది; బసవన్నవిగ్రహము = నందీశ్వరవిగ్రహము.

## II. ప్రశ్నోత్తరములు

ప్ర. 1 : లేపాక్షి యెచ్చటనున్నది ? అచ్చటి దేవాలయమును గట్టించిన వారెవరు ?

జ. : లేపాక్షి యనుగ్రామము అనంతపుర మండలమున హిందూపురమునకు దొమ్మిది మైళ్లదూరమున నున్నది. అచ్చట అపురూప శిల్పసంపదతో నొప్పు వీరభద్రాలయము గట్టించినవాఁడు లక్కిసెట్టి కుమారుఁడైన విరుపణ్ణ. ఈతఁడు శ్రీకృష్ణదేవరాయలవారి కోశాధిపతియై యుండెను. ఆలయ నిర్మాణమున విరుపణ్ణ సోదరుఁడైన వీరణ్ణయుఁ దోడ్పడెనని చెప్పుదురు.

ప్ర. 2 : విరుపణ్ణ కన్నులు పొడుచుకొనుటకు హేతువేమి?

జ. : విరుపణ్ణ తనకు దొరికిన వీరభద్ర విగ్రహమును ప్రతిష్ఠించి యొక సుందర దేవాలయమును గట్టింపదలంచి దాని నిర్మాణమున కగు సొమ్మును రాజాజ్ఞ లేకయే కోశమునుండి వెచ్చించెను. ఈ సంగతి రాయలవారెఱింగి యాతని కనులు పొడిపింప నాజ్ఞ చేసిరంట! ఆవార్త విని విరుపణ్ణ తన కన్నులితరులేల పొడువవలెనని తానే రెండుకన్నులను బొడిచివేసి కొనెనంట!

ప్ర. 3 : లేపాక్షి దేవాలయమునందలి మహామంటపమును వర్ణింపుడు.

జ. : లేపాక్షి దేవాలయమున మిక్కిలి సుందరమైనది మహామండపము. దానిని నిర్మించిన శిల్పి తన కౌశలమంతయు నిందు జూపెను. ఆ మండపమున నిలువదియారు స్తంభములున్నవి. అందు రెండడుగుల భాగమున నొక మూల మాత్రమే నేల నానుకొని యున్నవి. స్తంభములన్నిటి మీదను గాయన గాయనీమణుల చిత్రములున్నవి. పై మిద్దెకు వేసిన బండల మీద భారత రామాయణాదుల యందలి కథలకు సంబంధించిన చిత్రములు పెక్కు కలవు. ఈ చిత్రకళాసంపద యెల్ల వర్ణనాతీతముగ నుండును.

ప్ర. 4 : చిత్రకారులు రాతిబండల నెట్లు నునుపుచేయుదురు?

జ. : చిత్రకారులు రాతిబండలను మొదట వరిపొట్టుతోఁ గలిసిన యాలేపముతోఁ జునుముచేసి దాని నారనిచ్చి మఱల రెండవ పూఁత పూయుదురు. తరువాత ముద్గజలమును అరఁటి పండ్లపై తొక్కలూరఁబెట్టిన నీరును ఉపయోగించి యా రాతి బండకు బింగాణీ మెఱుగు వచ్చునట్లు చేయుదురు. అద్ది యారి గట్టిపడి వేలకొలఁది సంవత్సరములు స్థిరముగా నుండిపోవును. దానిపైఁ జిత్రకారులు చిత్రములను వ్రాయుదురు.

ప్ర. 5 : లేపాక్షి దేవాలయ చిత్రసంపదను వివరింపుఁడు :

జ. : లేపాక్షి దేవాలయపు గోడలమీఁదను, మండపము లోపలి కప్పుమీదను శివునికి సంబంధించిన కథ లచ్చెరువుగొల్పునట్లు చిత్రింపఁబడినవి అందు పార్వతీపరిణయము, త్రిపురసంహారము పార్వతీ పరమేశ్వరుల చతురంగక్రీడ, శివుని భిక్షాటనము, అంధకాసుర సంహారము మున్నగు చిత్రములు గలవు. గౌరీ ప్రసాద శివుడను చిత్రమున నా పార్వతీపరమేశ్వర చిత్రములు మహా శోభావంతముగా నున్నవి. ఇట్లే వృషారూఢుఁడైన శివుని చిత్రమును మనోహరము.

ప్ర. 6 : లేపాక్షికి సమీపముననున్న నంది విగ్రహమును వర్ణింపుఁడు.

జ. : లేపాక్షికిఁ గొంతదవ్వున నొక బసవన్న విగ్రహము కలదు. అది 14 అ. ఎత్తు; 27 అ. పొడవు; 23 అ. వెడల్పును గలిగిన సమున్నత మనోహర విగ్రహము. ఇంత పెద్దనంది విగ్రహము దక్షిణాపథమున మఱెచ్చటను లేదని చెప్పుదురు.

## III. వ్యాకరణాంశములు

ప్ర. 1 : క్రింది సమాసములకు విగ్రహవాక్యములు వ్రాసి యవి యే సమాసములో పేర్కొనుఁడు :

1. దివ్యసుందరము = దివ్యమును సుందరమును : విశేషణోభయపద కర్మధారయము.
2. శిథిలావస్థ = శిథిలమైన యవస్థ : వి॥ పూ॥ కర్మధారయము
3. రెండుకన్నులు = రెండుకన్నులు : ద్విగు సమాసము
4. వర్ణనాతీతము = వర్ణనమును అతిక్రమించునది : ద్వితీయాతత్పురుషము
5. కీర్తిశేషుఁడు = కీర్తియే శేషముగాఁ గలవాఁడు : బహువ్రీహి

ప్ర. 2 : క్రింది ప్రకృతులకు వికృతులు, వికృతులకుఁ బ్రకృతులు వ్రాయుఁడు.

| ప్ర | వి | ప్ర | వి |
|---|---|---|---|
| కథ | కత | శిఖ | సిగ |
| కుడ్యము | గోడ | స్తంభము | కంబము |
| శ్రేష్ఠి | సెట్టి | స్థిరము | తిరము |

| | | | |
|---|---|---|---|
| కుమారుడు | కొమరుఁడు<br>కొమారుఁడు | రేఖ | రేక |
| | | వృద్ధు | పెద్ద |
| ఆశ్చర్యము | అచ్చెరువు | ఆజ్ఞ | ఆన |
| మాణిక్యము | మానికము | పశ్చాత్తాపము | పాచితము |
| వర్ణము | వన్నె | చిహ్నము | చిన్నె |

ప్ర. 3: క్రిందివానిలో వ్యాకరణ విశేషములను వివరింపుఁడు :

1. వాక్ + మయము :- అనునాసికసంధి. అనునాసికములుగాని హల్లులకు 'మ' కారాది ప్రత్యయములు పరమగునపుడు అనునాసికములు వచ్చును.
2. ప్రకటింతురు :- 'ము' వర్ణంబు తోడి దుగ్ధకారంబు 'త' కారంబగు.
3. మధ్యయుగపుఁ జిత్రకళ :-
   (1) కర్మధారయమున 'ము' వర్ణకమునకు బుంపులగు.
   (2) సమాసంబు నుదంతంబులగు స్త్రీసమంబులకుం బుంపులకుం బరుష సరళంబులు పరంబులగునపుడు 'ను' గాగమంబగు.
4. మనః + హరము = మనోహరము :- విసర్గసంధి.
5. తల్లిదండ్రులు :- ద్వంద్వంబునం బదంబుపయి పరుషములకు గసడదవ లగు.
6. వృషభ + ఆరూఢుఁడు = వృషభారూఢుఁడు :- సవర్ణదీర్ఘసంధి.

# ౧౩. ప్రజాప్రభుత్వము - నియంతృత్వము

## I. అర్థాదులు

పుట 94. ఆదర్శభూతము=ఆదర్శమైనది; వర్తిల్లిన=ఉండిన; ప్రధాన + అమాత్యుఁడు=ముఖ్యమంత్రి.

పుట 95. రూపసౌష్ఠవము=రూపపరిపూర్ణత; శాసనసభా+ఆమోదము = శాసనసభయొక్క అంగీకారము.

పుట 96. నిశ్చితపద్ధతి=నిర్ణయింపఁబడిన విధానము.

పుట 96. ఏకవ్యక్తిసమాశ్రయము=ఒకేవ్యక్తి నాశ్రయించినది.

పుట 98. ఆచ్ఛాదించుటకై=కప్పిపుచ్చుటకై.

## II. ప్రశ్నోత్తరములు

ప్ర. 1 : అబ్రహాము లింకను ప్రజాప్రభుత్వము నేమని నిర్వచించి యుండెను ?

జ. : అబ్రహాములింకను ప్రజా ప్రభుత్వమును "ప్రజలకొఱకుఁ బ్రజలచే నిర్వహింపఁబడు ప్రజలయొక్క ప్రభుత్వమే ప్రజా ప్రభుత్వము" అని నిర్వచించెను.

ప్ర. 2 : నియంతృత్వ మనఁగా నేమి ? ఆసియా యూరపు ఖండములందలి పలు దేశములలో నియంతృత్వము సాగెననుటకు దృష్టాంతములిండు :

జ. : ఆసియాలో టర్కీ-దేశము కెమాల్ పాషా నియంతృత్వము క్రిందను, పర్షియాలో రెజాషాపహ్లావి నియంతృత్వము క్రిందను, ఉండెను. యూరపులో జర్మనీలో హిట్లరు, ఇటలీలో ముసోలినీ, స్పెయినులో ఫ్రాంకోలు నియంతలై యుండిరి.

ప్ర. 3 : నియంతృత్వము ప్రాచీనకాలమున నుండెనా ? ఫాసిస్టు పద్ధతియే దానికిఁ బ్రోత్సాహమగుననుట యెంతవఱకు సత్యము?

జ. : ఫాసిస్టు పద్ధతియే నియంతృత్వమునకు బ్రోత్సాహమగుననుట సత్యముకాదు. క్లిష్టపరిస్థితులు వచ్చినపుడు ప్రాచీనకాలమున నియంతృత్వ పద్ధతి యుండెను. రోమను లట్టి యొక నియంత నేర్పఱచుకొనిరి. ఆతఁడు జూలియస్ సీజరు. నెపోలియను కూడ అట్లే ఫ్రాంసులో నియంతృత్వమును వహించెను.

ప్ర 4: (ప్రజాప్రభుత్వమునందలి మంచిచెడ్డలను వివరింపుఁడు). ప్రజాప్రభుత్వ నియంతృత్వములకు గల తారతమ్యమేమి ?

జ. : (ఈ రెండవప్రశ్ననుబట్టి మొదటిప్రశ్నకు సమాధానము వచ్చును. కనుక నది వేరుగ వ్రాయబడుటలేదు).

1. సత్వరనిర్ణయములు చేయవలసి యున్నప్పుడు ప్రజా ప్రభుత్వపు శాసనసభలు త్వరితగతిని నిర్ణయము చేయజాలక పోవచ్చును. కార్యనిర్వాహకవర్గము స్వతంత్రించి ధైర్యముగా నే పద్ధతి ననుసరింపఁజాలదు. కాని, నియంతృత్వమున నట్లు కాదు. అది చాల శక్తిమంతమైన పరిపాలన. నియంత మాటయే శాసనమై వెంటనే యాచరణలోనికి వచ్చును.

2. ప్రజాప్రభుత్వమున నేఁ డధికారములో నున్నవారు రేఁపు లేకుండఁ బోవచ్చును. కనుక వారు భవిష్యత్తులో నుపయోగించు పద్ధతులను నిర్ణయింపఁజాలరు. నియంత యట్లు చేయఁగలఁడు. అతఁ డవలంబించు పద్ధతిలో నైక్యము, ప్రయోజన స్థిరత్వము, అవిచ్ఛిన సామరస్యము గోచరించును.

3. ప్రజాప్రభుత్వమున సామాన్యముగాఁ గానవచ్చు నసమర్థత, లంచగొండితనము, ఆశ్రిత పక్షపాతము మున్నగు లక్షణములు నియంతృత్వమున నుండవు. అవసరమగుచోఁ బ్రజా ప్రభుత్వమునందు కంటె నియంత ప్రజలలో ధైర్యోత్సాహముల రేకెత్తింపఁ గలఁడు.

4. నియంతృత్వము కొనసాగవలెనన్న మిక్కిలి ప్రతిభావంతుఁడైన వ్యక్తి నియంతగా నుండవలెను. ఒకఁ డట్టి వాఁ డున్నచో అతని పిదప మఱల నట్టి వాఁడు దొరకునని చెప్పఁజాలము. ఇది యీ పద్ధతిలోని యొక చెడుగు. ప్రజా ప్రభుత్వమును సామాన్యులతో నడిపింపవచ్చును.

5. నియంతృత్వమున దేశపు సైనిక గౌరవము, ఆర్థిక సంపద పెంపొందు నేమో కాని వ్యక్తిస్వాతంత్ర్యము నశించును. ప్రజాప్రభుత్వమున వ్యక్తిస్వాతంత్ర్యమునకు రక్షణ కలదు.

6. ప్రజాప్రభుత్వము లింటను బయటనుగూడ శాంతినే కోరుచుండును. నియంతృత్వములు సంగ్రామ లాలసములై యుండును.

ఇట్లు ప్రజాప్రభుత్వమున నియంతృత్వమునందుకంటె లోపములు తక్కువగా నున్నవి కావున నదియే యిప్పటికి శ్రేష్ఠమైన పద్ధతియని చాలమంది తలఁచుచున్నారు.

(పాఠ్యగ్రంథములోని 6 వ ప్రశ్నకు సమాధానముకూడ యిందే కలదు).

# III. వ్యాకరణ విశేషములు

ప్ర. 1: ఈ క్రిందివానికి విగ్రహవాక్యములు వ్రాసి సమాసములను పేర్కొనుడు :

1. క్లిష్టపరిస్థితులు : క్లిష్టమైన పరిస్థితులు : వి. పూ. కర్మధారయము
2. అధికారచ్యుతులు : అధికారమునుండి చ్యుతులు : పంచమీతత్పురుషము
3. రెండు సంవత్సరములు : రెండు సంవత్సరములు : ద్విగుసమాసము
4. సత్వరము – త్వరతోఁ గూడినది : అవ్యయీభావ సమాసము
5. ఆదరప్రోత్సాహములు: ఆదరము ప్రోత్సాహమును: ద్వంద్వసమాసము

ప్ర. 2: కర్తరికవాక్యములుగా మార్చు : (జవాబులు)

(1) లెనిన్ను నియంత కొంతకాలము రష్యాను పాలించెను

(2) నియంతలు భవిష్యద్విధానములనుగూడ నిర్ణయింతురు

(3) నేఁ డధికారమున నున్నవాఁడు రేపు తొలఁగవచ్చును

ప్ర. 3 : ప్రకృతి వికృతులు :

| ప్ర | వి |
|---|---|
| ఆశ | ఆస |
| హృదయము | ఎద |

ప్ర. 3 : క్రిందివానిలోని వ్యాకరణవిశేషములను వివరింపుడు :

1. కానిపించుదురు=కానిపింతురు
   చువర్ణంబుతోడి దుగ్ధకారంబు తకారంబగు.
2. ఎట్టెదుట=(ఎదుట+ఎదుట)
   ఆమ్రేడితంబు పరంబగునపుడు కడాదులం దొలియచ్చు మీఁది వర్ణంబులకెల్ల నదంతంబగు ద్విరుక్తటకారంబగు.
3. భయము+పడు=భయంపడు
   పడ్వాదులు పరంబగునపుడు మువర్ణకంబునకు లోపపూర్ణబిందువులు విభాషనగు.
4. జయపెట్టు
   ప్రథమమీఁది పరుషములకు గసడదవలు బహుళముగనగు.
5. అతి+ఉగ్రము=అత్యుగ్రము=యణాదేశసంధి.
   ఇ, ఈ, ఋ, ౠ వర్ణములకు అచ్చుపరమైనచో య, వ, ర, ల క్రమముగా నాదేశమగును.

*First Edition : June, 1960*

# విషయసూచిక

## పద్యభాగము



## గద్యభాగము



*Printed at The University Press, Tenali*